

"యాత్రికుడు"

ఫోటో యస్ ఆర్ కొల్లా (గుంటూరు)

# ఆంధ్ర సచిత్ర వారపత్రికను చదవండి!

## వరద బాధితులకు
## శక్తివంచన లేకుండా సహాయం చేయండి



### ప్రధాని
# జాతీయ సహాయక నిధికి
## విరివిగా విరాళాలివ్వండి

*మీ విరాళాలను కార్యదర్శి, ప్రధాని జాతీయ సహాయక నిధి ప్రధానమంత్రి సెక్రటేరియట్ సౌత్ బ్లాక్ న్యూ ఢిల్లీ అనే చిరునామాకి పంపించండి మీరు పంపే చెక్కులమీద 'ప్రధాని జాతీయ సహాయక నిధికి చెల్లించవలెను' అని వ్రాయండి*

# ఉత్తరాలు

## ప్రత్యేక సంచిక

ఆంధ్ర సచిత్ర వారపత్రిక స్వాతంత్ర్య దినోత్సవ సంచిక చాలా బాగుంది అశోకచక్రంలో 24 ఆకులు ఉంటాయి కాని పత్రిక ముఖచిత్రం మీదున్న అశోకచక్రంలో పదహారే ఉన్నాయి రాణీ పర్యటనప్పుడు యూనియన్ జాక్, మన జాతీయ పతాకములను అల్టర్నేటివ్‌గా వేసినప్పుడు కూడా పదహారు ఆకులే వేశారు అశోక చక్రానికి 24 ఆకులని మీ చిత్రకారునికి తెలియదా ?

బి శ్రీనివాసులురెడ్డి (తిరుపతి)

* * *

స్వాతంత్ర్యదినోత్సవ ప్రత్యేక సంచిక ఏమాత్రము బాగాలేదు ఒకవిధంగా పాఠకులను నిరుత్సాహపర్చిందేమో ! అట్టమీది బొమ్మ మాత్రము ముద్దుగా ఉంది

బి రామచందర్‌రావు (భువనగిరి)

## పదమూడో ఎక్కం ఖద

'స్వతంత్రదినోత్సవ సంచిక' చక్కని పరిమళముతో సర్వాంగ సుందరముగా వెలువడింది బుడుగు : "రావ్పు బుడూ—పదమూడో ఎక్కం ఖద" బాలలకే గాక, అన్ని తరగతులవారికీ అత్యంత ఆహ్లాదమును కలిగించింది ముళ్లపూడి వెంకటరమణ గారికి అభినందనలు

డి ఎల్ నరసింహారావు(నాగపూర్)

* * *

ఒరే బుడుగ్గా ! నీ చదూసంజెల ఖద చాలా బాగుందిరా ! నీ పక్కన గోపిగాణ్ణి చూసి నీకు తమ్ముడు పుట్టాడనుకొన్నాను బాబాయిగాడు బిజీగ ఉండడము చాలా బాగుందిరా చదూసంజె లేపోతే ఎంత కష్టమో చూడు ఈ ఉత్తరము రాసిపెట్టమని మా అమ్మను అడిగానురా ! నీవు అప్పుడప్పుడు కనబడుతూ వుండూ ఇక వుంటా

రాంబాబు (విజయవాడ)

* * *

వుర్రేయ్, బుడుగు, కుంకోం అగు!చదూసంజెలు నేర్పిన, నీ అమ్మ, నాన్నలు మర్యాదలు నేర్పినట్ట్లు లేదే నీగూర్చి రాసినవాడికి చెప్పు కాస్త సరిగా వ్రాయమని లేకపోతే నీ వంతేనా ! నీ చెవులు మలిమేవారు లేనట్టు ఉంది జాగ్రత్త, చూసుకో ! కాచుకో !! పదమూడో ఎక్కం వచ్చిన సంతోషంగానే ఉంది కుంకోం తెలివి తెచ్చుకుని మాట్లాడు ఇదే కడా హెచ్చరిక పెద్దవారిని వారు, నీరు అనాలి తెలిసిందా ? లేకపోతే కొనునాంబ దొరకదు జాగ్రతోం జాగ్రత్త

బి శ్రీనాథగుప్త (బళ్ళారి)

* * *

"త్రివర్ణ ప్రశస్తి" అనే కవిత బాగానే ఉన్నది అందులో "రాయలును బాబరాదిగ రాజవరులు' అన్నది' సందర్భరహితముగ నున్నట్లనిపించు చున్నది హైందవేతరుడైన బాబరు (రాజవరుడు) ను "మూడు వర్ణాల తోడను కూడియుండు" అని రాయలుతో కలిపి వ్రాయుటం అసందర్భముగ నున్నదేమో అనిపించుచున్నది

వి రామకృష్ణశర్మ (విజయవాడ)

## కార్టూన్

స్వాతంత్ర్యదినోత్సవ సంచికలో "లోకం పోకడ" అన్న శీర్షికకు ఊమెన్ గారి కార్టూను చాలా బాగుంది మీకూ, ఊమెన్‌గారికి కూడా నా ధన్యవాదాలు

ఆర్ ఎస్ కాంతారావు (రాజోలు)

## న్యూఢిల్లీ లేఖ

ఈమధ్య శ్రీ కృష్ణగారి ఢిల్లీ లేఖలు చదువుతూ ఉంటే ప్రభుత్వాన్ని దుయ్యబట్టడమే వారికి ముఖ్యాశయంగా తోస్తున్నది

రాష్ట్రపతికి ప్రైవేట్ నర్సింగ్ హోమ్‌లో చికిత్సని విమర్శించడం అర్థంలేనిపని ఒకమూల ప్రమాద స్థితిలో ఉండగా అందరితోపాటు, ప్రభుత్వ ఆస్పత్రికి పోయి 'క్యూలో' నుంచోవలసిందనేనా శ్రీ కృష్ణగారి ఉద్దేశం ???

రాష్ట్రపతిని ప్రాణాపాయస్థితినుండి ఎలా తప్పించా అన్నదే అప్పటి సమస్య కాని "ఏ నర్సింగ్ హోం" అనేది కాదు

ఎం శిరీషకుసుమ (కాకినాడ)

## కథ

ఆర్ ఎం చిదంబరంగారు వ్రాసిన 'కన్నీటిగీత' అను కథ చాలా బావుంది ఈ కథ ఎవరినైనా కలచి వేస్తుంది కాని ఉషలాంటి కఠిన హృదయురాలు వాస్తవిక జగత్తులో ఉంటుందా అనిపిస్తుంది

జి రామచంద్రరావు (సంబల్‌పూర్)

## మనరాజధాని పోకడ

గక్కడ గక్కడ మంచిగ మాటాడుతున్నవ్, మరి గ్నైత నీకు సదువు మంచిగ రాదుగంద కాలేజి పెరెట్ట చదివినావ్ ? గమ్మత్తుగుందాది ఫికర్ లేకుండ గంతదూరం సైకిల్ ఎట్ల తొక్కినవ్ ? మరిసిన దో'పహర్' ఆబిద్‌సు దగ్గర 'రెడ్డి హోటల్లో' ఉంటి యా హోటల్లో ఇడ్లీ—దా— 75 పైసలు కాదు గందయా ఏంది గంత జూట్ రాసినవ్—మీదికెల్లి గప్పుడప్పు మా ఉస్మానియా యూనివర్సిటీ కెల్లి వత్తె నన్ను కలవడం యాదుంచుకో !

పి. వీరవెంకటేశ్వర్, (హైదరాబాద్)

* * *

ఇంకా హైదరాబాద్‌లో అన్నీ దోకాలేని లంగలకు, అఫీంగులకు మశూర్ అని మన రాజధానిని బనాయించడం వాసమజ్ లో ఏమంతా కానా బాగనిపించలే మొత్తంమీద నవ్వు పుట్టుకొచ్చింది యింత మంచిగా రాశినందుకు రచయితకు నా షుక్రియాలని తెల్పగలరు

ఆర్ వెంకటరెడ్డి (హనుమకొండ)

* * *

### కథ కాని కథల రచయితలకు

### విజ్ఞప్తి

రచయితలీశీర్షికకు కేవలం 'హాస్య సంఘటనల'నే పంపుతున్నారు. నిత్యజీవితంలో చిత్రవిచిత్రాలైన సంఘటనలెన్నో తటస్థిస్తూ ఉంటాయి వాటిని గురించి కూడా వ్రాస్తే బాగుంటుందని రచయితలకు మనవిచేస్తున్నాము

# ఉత్తరాలు

**శానాదినాలకు నీ ఖబరు తెలిసింది గిన్నిదినాల సుంచి ఏమి చేసినవు ? నీ విషయమ్మై నాకు శాన పరేశానుండె నువ్వుగిట్ల పట్నంలో దోఖ తింటవని అనుకోలేదు** నీకు కారటు రాద్దామనుకున్న గని పత్త **తెలక ఊకున్న మల్ల జల్ది** పుర్సతు సూసుకొని **పట్నం** సంగతులు రాయి అంతా కైరియత్

కె ఎల్ ప్రభాకర్‌రెడ్డి (నిజామాబాద్)

*     *     *

శ్రీ పతిగోరు 'మన రాజధానిపోకడ' శానా బాగా రాశిను కొనపేరాలోగాని మోసమేంటో బయటపడకుండ కథ నెట్టుకొచ్చిను ఆరికి నా దండాలు పతిగోరి మూడోరోజ అనుభవాలు యెట్టుంటాయోనని యెఖ్ఖ్య కళ్లతో యెదురు సూత్తా వున్నాము

ఒక్కలంక రామారావు (అయినెల్లి)

పట్నమంటె చూడనోళ్లందరికి చాల మోజుంటది బగ్గ చూడాలనుంటది అట్లనే వాళ్లందరికి అంత ఎక్కువ దిమాక్ ఉండది కన్న పట్నం ఉండెదోకాల బారాల శ్రీ యమెల్ పతి చాలా మంచి గనే రాసిండు ఖఛి తెలుసుకున్నోళ్లకు బర్నైనా మని స్తవి అంట్ల, నిన్న ఇయ్యాల పట్నంల కొత్త కొత్త తీరుతీరు ఢోగాలు జరుగుతున్నయని విన్నాను కనుక పట్నంలోని సంగతుల బారాల (గురించి) కభీ పుర్సతు చేసుకుని ఇంకా రాస్తే ముందటికి చానా పనికి వస్తవి అవుర్ ఇట్ల తెలియనోళ్లకు ఇంత మంచిది రాసినందుకు నాతరఫున శుక్రియా

ఆర్ జగదీశ్వర్ (మెదక్)

పాపినా ఎం ఎల్. పతిగార్కి ములాఖాత్ హైన తర్వాత వారు మస్కు రాజధాని గూర్చి రెండోసారి వొస్తున్నది వొస్తున్నట్లు రాసిండు కాని వార్కి రాసినదాన్లో ఒక్కటిమాత్రం నాకు సిత్రంగా మాలూమ్ ఐతాతున్నది అదేమిటంటె పోరోల్ని సైకిలుమోటర్ వద్దుట. ఎందుకంటె పోరోళ్లు స్కూటరు వద్దుట సూపినా కాని సైకిలు మోటర్ని చలాయించుట చూడలేదు పిది ఎట్లున్నప్పటికి వారు ఎంతో పాకత్ మంద్మై కూడ దగుల్బాజివాళ్ల ధోకాలో పడ్డారంటె వేరేవాళ్లు తప్పక దగుల్బాజోళ్లతోటి ధోకాలో పడ్తరన్నమాటే.

వార్కి మల్లి మూడోరోజ గమ్మతులు జల్ది రాస్తారని ఆశిస్తున్నా

మోహన్ (హైదరాబాదు,) ★

బుధవారం : 30-8-61
ప్లవ సం॥ శ్రావణ శుద్ధ పంచమి
సంపుటము : 53 సంచిక : 51

స్థాపితము:
1908

* * *

ముఖ్యసంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

* * *

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

* * *

విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.

* *

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1

## లోకంపోకడ



"మంత్రిగారు ఎన్నికల ప్రచారానికి వెళ్లినందుకు ధన్యవాదాలు చెప్పుకోవాలి. వారి ఆఫీసు గది మన కాలక్షేపానికి మహా [illegible]"

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

## విషయానుక్రమణిక

ముఖచిత్రం [illegible]వారి 'బికారిరాముడు'లో
మీనాకుమారి



### శ్రీశైల ఆలయ ఉద్ధరణ నిధి

'ఆంధ్రపత్రిక' సేకరిస్తున్న శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జున స్వామివారి ఆలయ ఉద్ధరణ నిధికి ఆగస్టు 19 వ తేదీనాటికి రు. 35,517=32 వసూలు అయింది. యథాశక్తి విరాళాలు ఇచ్చి, ఈ పవిత్రమైన కార్యక్రమాన్ని జయప్రదం చేయవలసిందని ప్రజలకు, ప్రజాసంస్థలకు విజ్ఞప్తి చేసున్నాము.



దేశ పరిస్థితి
మతతత్వం
కులతత్వం
భాషాతత్వం
వీటిని సమైక్య పరచే దానికి
సిద్ధాంత బలం కావాలి


ప్రతిక్రియ
ముస్లిం మహా సభ
హిందువుల మహాసభ


బెర్లిన్ నగరాన్ని ఆవరిస్తున్న
మేఘాలు





స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంలో ప్రధాని శ్రీ నెహ్రూ న్యూఢిల్లీలో ఎర్రకోట బురుజుపై పతాకోత్సవం జరిపారు

న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

# న్యూఢిల్లీ నగరం మీద వరుణదేవుని శీతకన్ను : గత పదేళ్ల చరిత్ర

## తారాసింగ్‌కు నేర్పిన పాఠం

పార్లమెంటు వర్షాకాల సమావేశం ఇటీవల ప్రారంభమైంది. పోయినసారి చూసినా ప్రశ్నల వర్షాన్నిబట్టి చూచినా సభ నిండుగానే వుందనాలి. ఉదాహరణకు ఒక బుధవారంనాడు 126 నక్షత్ర ప్రశ్నలు 220 లిఖిత పూర్వక ప్రశ్నలు వెరసి 346 ఒక్క గంటలో పరిశీలనకు వచ్చాయి. ఆఖరికి ఢిల్లీనుంచి ఎన్నికైన ఒక సభ్యుడు కూడా ఒక ప్రశ్నకు అనుబంధ ప్రశ్నల వరం వరస జరిపేస్తే! ఇందంతా చూస్తే సభ్యులలో వచ్చే ఎన్నికలగూర్చివున్న ఆరాటం వ్యక్తమవుతోంది.

కాంగ్రెస్ పక్షంకు ఓట్లు సంపాదించుకునే నిదుపాయాన్ని కార్మికశాఖ సమకూర్చిపెట్టింది. కేంద్ర ప్రభుత్వోద్యోగులకు సంబంధించినంత వరకు ఢిల్లీని ఏ' తరగతి నగరంగా పరిగణించారు. వాళ్లో తరగతి నాన్ గెజెటెడ్ ఉద్యోగులు 7 లక్షల మందికి అదనపు వైద్య సౌకర్యాలు కల్పించారు. విదేశీ ద్రవ్యార్జన చేయగల పరిశ్రమలకు వేతన సంఘాన్ని ఏర్పాటు చేశారు. అయినా ఈ ఆపుల వేతన సంఘంవారి తీర్పును ఖాదీ పరిశ్రమకు ఎందుకు వర్తింపచేయలేదో అసలు ఖద్దరు పరిశ్రమకు వేతన నిర్ణయ సంఘాన్ని ఎందుకు ఏర్పాటు చేయలేదనే ఈ విషయాన్ని మాత్రం కార్మికశాఖ ఇంకా వివరించ లేదు. తిరస్కారణం వారికి న్యాయమైన వేతనాలు ముడుతున్నాయనా?

* * *

ఢిల్లీ ఏ తరగతి నగరంగా మారింది దాంతో పాటు ఏ తరగతి వరదలు కూడా వచ్చాయి! గ్రేషమ్స్ సిద్ధాంతం పత్రికా రచయితల్లో కూడా పని చేస్తోంది. ఈ సిద్ధాంతం ప్రకారం పాతదబ్బును కొత్తదాన్ని మా ర క ం లో ం చి తప్పించి వేస్తుంది. సర్వత్రా ప్రమాణాలు పతనమైనా పత్రికా రచనలో ఆ ప్రమాణాల పతనం బాగా వేళ్ళుపాతుకుపోయిందని చెప్పకతప్పదు. ఉదాహరణకు ఏటా వచ్చినట్లే న్యూఢిల్లీకి వరదలువస్తే ఈ పత్రికా ప్రతినిధులు 73 ఏళ్ళ అనంతరం ఈయేడు భారీ వరద లొచ్చాయని ఒక కథ అల్లారు. ఇది 1961 సంవత్సరం 73 ఏళ్లంటే 1888 వ సం అన్నమాట. ఆనాడు వాతావరణ శాస్త్రం ఏ దశలోవుందో మనం తెలుసుకోవచ్చు. వాతావరణ శాస్త్రజ్ఞుల లెక్కలు ఎక్కడ వున్నాయని? స్వతంత్ర భారతంలో అయిందానికి కాని దానికి ఉత్సవాలు జరపటం పరిపాటైపోయింది. మరి వాతావరణ పరిశీలనశాఖ శత వార్షికోత్సవాలు ఎప్పుడు జరిగాయో?

ఇదిగాక ఇంకో ప్రశ్న కూడా వుంది. అసలు 73 ఏళ్ళక్రిందట న్యూఢిల్లీ వుందాఅని? పోనీ పాత ఢిల్లీ అనుకుంటే దానికేమీ వరదలు రానేలేదు. దీన్నిబట్టి పత్రికా విలేఖర్లకు తమ కథల నిజా నిజాల గమనిక పట్ల ఎంతబద్ధకంవుందో తెలుస్తోంది. యదార్థ విషయాలు మన ప్రభుత్వానికీ, అందులో ముఖ్యంగా ఢిల్లీ కార్పొరేషనుకు గిట్టవులెండి.

ఇక్కడ కొంచెం సింహావలోకనం అవసరం అవుతుంది. మూడేళ్ళ క్రిందట న్యూఢిల్లీలో మాత్రం వరదలొచ్చాయి. వరుణదేవుడు దమ్మిడీ అంత పక్షపాతం చూపించాడు. తమ యోగ్యతలపైనేటి ఇంజనీర్లకున్న అహంభావంలేని ఇంజనీర్లు మూడువందల ఏళ్ళక్రింద నిర్మించిన పాత ఢిల్లీకి మాత్రం వరద ముప్పు తగల్లేదు. షాజహాన్ కాలంలో పుర నిర్మాతల సంస్థ అంటూ లేదు. అయినా ఢిల్లీ ఈ నాటికి భూకంపాలు ప్రకృతి వైపరీత్యాలు తట్టుకొని నిలిచేవుంది.

న్యూఢిల్లీని బ్రిటిషు వారు నిర్మించారు. ఒక్కమింటోరోడ్డులో తప్ప మిగతా ప్రాంతాల్లో మురుగు పారుదల చక్కగావుంది. న్యూఢిల్లీ పురపాలసంఘం జాగ్రత్తగల ఎట్టిందిని నియమించి పెనవి

(62-వ పేజీ చూడండి)

చలపతి నాకు మిత్రుడు ఆత్మీయుడు ఇద్దరం చిన్నప్పట్నుంచీ కలసి చదువుకున్నాం ఇప్పుడు వాడెక్కడో నే నెక్కడో అన్నట్టు ఉద్యోగ రీత్యా విడిపోయాం

చలపతి సాధువు ఏం జరిగినా తనకే జరిగినట్టు ప్రతి చిన్నవిషయానికీ బాధపడతాడు. దానికి తగ్గట్టు, చిన్నప్పట్నుంచీ దురదృష్టం వాడ్ని వెంటాడుతూనేవుంది, పగబట్టిన పాములా చలపతి గురించి ఒక్కముక్కలో చెప్పాలంటే వాడు వాడికే సమస్యంటే సరిపోతుందేమో!

మావూళ్లో పరంధామయ్యగారంటే అందరికీ భయమే! ఏదోవిధంగా దాదాపు అందరూ ఆయన చేతిలో దెబ్బతిన్నవారే తౌక్యం తెలిసిన ఘనుడు పరంధామయ్యగారు ఆయనంటే వూళ్లో వారందరికీ ఏమాత్రం హైనా తెగించి ఎదురు తిరిగేవారుకారు అందుకే ఆయన స్వార్థం నిరాటంకంగా సాగిపోయేది

చలపతి ఆయన పోషణలో పెరగటం నిజంగా వాడి దురదృష్టమే చిన్నతనంలోనే చలపతిని వాళ్ళమ్మా నాన్నా అన్యాయం చేశారు ఒంటరివాడ్ని చేసి పరానికి పారిపోయారు. అప్పట్నుంచీ చలపతి వాడి మేనమామ పరంధామయ్యగారిదగ్గరే పెరిగాడు

వాడు ఓ పక్క చదువుకుంటూ యింటి పనులన్నీ స్వయంగా చూడవలసి వచ్చేది. ఉదయమే లేచేవాడు అందరి పక్కలూ సర్దేవాడు. నీళ్ళు తెచ్చేవాడు. చద్దిఅన్నం తిని బళ్లోకి వచ్చేవాడు తిరిగి సాయంత్రం ఇంటికొచ్చి, గొడ్డూ గోదాని కట్టివేసి యింత మేతవేసి—నీళ్ళు గట్రా తీసుకొచ్చేవాడు మళ్ళీ నిద్రపోయేంతవరకూ వాడికి చాకిరి తప్పేది కాదు తీరుబడిలేని యీ దిన చర్యలతో ఎలాగో యసల్సీవరకూ చదువుతూ వచ్చాడు పస్మతహా చలపతి తెలివిగల విద్యార్థి

యసల్సీ చదివేటప్పుడు కూడా వాడికి యింటి పనులు తప్పేవికావు. పరంధామయ్య కొడుకు రామం తదుంవంచి అవతలి వుల్ల యివతల పెట్టలేనంత సుకుమారుడు. పరంధామయ్య కూతురు రాధ మాత్రం చాటుగా చలపతి పనుల్లో సాయపడేది అది పరంధామయ్యచూస్తే సహించేవాడు కాదు 'నువ్వెందుకే పని చెయ్యటం అసలే నువ్వు పిల్లవాయె—నిన్నెవరు పని చెయ్యమన్నారు చెప్పు' అంటూ మందలించేవాడు చలపతి పరంధామయ్యగారింట్లో పెద్ద పాలేరు

చలపతి మా నాన్నా, అమ్మగార్లతో చనువుగా వుండేవాడు వాళ్లూ వాడంటె అభిమానంగా వుండేవారు అమ్మా, నాన్నకీ నే నొక్కడ్నే నోముల పంటని చలపతి మా యింటికి తరచు వచ్చేవాడు వాడి కష్టాలన్నీ ఏకరువు పెట్టేవాడు అయినా ఎవడి కర్మకి ఎవరు బాధ్యులు

యసల్సీ పరీక్షలయ్యాయి ఇద్దరమూ పాసయ్యాం నాన్నగారు నా కాలేజి చదువుకోసం పట్టణ నివాసంకోసం సదుపాయ సేకరణలో నిండుగా మునిగిపోయారు నేనైతే ఏదో పెద్ద ఏనుగు ఎక్కినంత సరదాలో వున్నాను పట్టణంలో నా కాలేజి చదువు వూహించుకుని మురిసిపోయేవాడ్ని ఏవో కలలుకనేవాడ్ని

**అందరూ చలపతి జీవితంపై పరిశోధనలు చేశారు, సహనాన్ని పరీక్షించారు. చివరకు అతనికి మిగిలింది ఏమిటి ?**

కాని చలపతి విషయం దారుణంగా తయారయింది వాడు ఒకరోజు మా యింటికొచ్చాడు నా వుషారు స్వయంగా చూశాడు కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు

"నువ్వు అదృష్టవంతుడివిరా రావ్! నాకూ చదువుకోవాలనివుంది నీతోపాటు పట్టణం రావాలనేవుంది మావయ్య యీ విషయంవిని మండిపడ్డాడు నీకూ కాలేజి చదువులైతే ఇక లేండే ముందీ చదివిందిచాలుగాని ఏదైనా ఉద్యోగం చూచుకో ఇంక చదివించటానికి నాకు నోపిక లేదు ఒకపక్క రామం కూడా కాలేజివెలిగిస్తాన్నాడాయె, అది చాలక నువ్వూ చదివితే కొంప మూలపల్లయిపోతుందని నానా మాటలూ అన్నాడు. సరే రావూ! ఎవడైనా అదృష్టానికి పెట్టిపుట్టాల్రా" అంటూ తన విషయమంతా చెప్పుకున్నాడు.

నా మనసు చివుక్కుమంది నేనింతకుముందు అనుభవించిన సంతోషం యావత్తూ ఆవిగారిపోయింది. ఆ రాత్రి భోజనం చెయ్యలేదు. సరిగ్గా నిద్ర కూడా పోలేదు.

నాన్నతో చలపతి విషయం చెప్పాను. ఆయన గూడా విచారించారు.

"పాపం! చలపతి దురదృష్టవంతుడు. వాళ్ళమ్మా నాన్న గనకవుంటే నాతోపాటు వాడూ చదువుకునేవాడు ఏం చేస్తాం అంతా వాడి కర్మ"

రాత్రి నేను ఆలోచించిన పథకం నాన్నకు వివరించాలనుకున్నాను ప్రారంభించాను

"చలపతిని మనం చదివించవచ్చుననుకుంటాను" ఆయన యీ మాట విని విస్మయం అయ్యారు రెండు నిమిషాలు మామధ్య మాటలేవు. తర్వాత ఆయనే అన్నారు.

"కాలేజి చదువంటె మాటలుకావు. ఆలోచించు నాయనా!"

"నాకో అన్నయ్యవుంటె—"

"ఒకవేళ మనం చదివించినా రేపు పరంధామయ్య నోరు మూసుకు కూర్చోడు ఎంత మండి పడతాడో నీకు తెలుసనుకుంటా ఇది లోకం నాయనా!

"మీరెన్నైనా చెప్పండి మనం చేసేది తప్పుగాదు వాడు నాతోపాటు చదవాలి. అంతే" ఆయన నా మాట కాదనలేరని ధైర్యం నాకు ఎప్పటికీ వుంటుంది

"కాని ముందు ముందు చాలా యిబ్బంది పడాల్సొస్తుంది పరంధామయ్య సంగతి అందరికీ తెలిసిందే కంటకులేని దురద కత్తిపీట కెందుకని సామెత గూడా వుంది "మేం చదివించలేని వాళ్ళంగాని — మీరు చదివించేవాళ్ళా'ని పరంధామయ్య విరుచుకు పడుతాడు వృథాగా మాట పడాల్సి వస్తుంది అర్థం చేసుకో "

"ఏమైనాసరే! ఎవరేమనుకున్నా సరే — వాడు నాతోపాటు చదువుకోవాలి " నేను మంకుపట్టాను ఆ మాటనేసి అమ్మ దగ్గరికి వెళ్ళాను అమ్మ గూడా నాన్నలాగే చెప్పిచూచింది కుదరదన్నాను. వాడు చదవకపోతె నేనూ చదువనన్నాను — చివరికి కాదనలేకపోయారు

ఈ విషయాన్నే సాయంత్రం చలపతికి చెప్పాను వాడు ముందు నమ్మలేకపోయాడు. తర్వాత ఖుష్యాడు. కళ్ళనిండా నీళ్ళు నిండాయి గద్గదంగా అన్నాడు

"వరే రావూ! నువ్వు దేవుడివిరా—నాకు తల్లీ తండ్రీ లేరు ఇప్పుడున్నారు ఇంతకుముందు తోడూ నీడా లేరనుకున్నాను ఇప్పుడున్నారు. చాలురా రావ్! నాకే చింతాలేదు. ఆ జన్మాంతం కృతజ్ఞుణ్ణి" చివర్ని ఏడ్చేశాడు వాడ్ని చూస్తుంటె నా కళ్ళు చెమ్మగిల్లాయి

ఇంటికొచ్చింతర్వాత గర్వంగా గాలిపీల్చుకున్నాను. ఎవరూ అందుకోలేని శిఖరాన్ని అవలీలగా అందుకున్నట్టు ఫీలయ్యాను ధన్యుడ్ని ప్రభూ!

మా యిద్దరి చదువులకోసం నాన్న ప్రయత్నాలు చేసున్నాడు ఇక్కడ మా స్థితిగతులు గురించి విన్నవించుకుంటాను. తాతయ్య సంపాయించింది ఎక్కువంటే దాన్ని నాన్న అభివృద్ధి చేశారు. అమ్మ వచ్చేటప్పుడు మరి కొంత ఆస్తి తీసుకొచ్చింది. జీవనోపాధికిగాని మరి నలుగుర్ని పోషించటానిగ్గాని మాకే కొరతాలేదు. ఇకముందు వుండదు

పరంధామయ్యగారికి యీ విషయమంతా తెలిసింది తానై ఏమీ మాటాడకపోయినా నలుగురైదుగురితో చెప్పుకున్నాట్ట— 'కానీండి ఎలా జరుగుతుందో మనం చూస్తాంగా అయినా వాళ్ళ పంచా, నీళ్ళపంచాజడి బతికేదానికంటె చావడం మేలు ఆ వంశానికి యీడున బాగా అలవాటు.'

నాన్నవరకూ యీ మాట లొచ్చాయి అయినా ఆయన మౌనం వహించారు పరంధామయ్యని ప్రతిఘటించడంలో నాన్న ప్రథములయ్యారు

—కాలేజి చదువుకోసం పట్టణం వెడుతూన్నాం. మిత్రులూ, బంధువులూ అందరూ ఆశీర్వదించారు. సాగనంపటానికి స్టేషనికి వచ్చారు పరంధామయ్యగారొకలు రానేలేదు. రైలు కదిలింది. అమ్మా, నాన్న కళ్ళు తుడుచుకుని జాగ్రత్తంటూ హెచ్చరించారు రైలు పరుగెడుతుంది చలపతే అన్నాడు "నాకింక భయంలేదురా రావ్! నాకు పద్మ చూపించావ్"

కాలేజి చదువులు సాగుతున్నాయి డబ్బా దస్కం నాన్నగారు పంపుతూండేవారు ఉత్తరాలు రోజు విడిచి రోజు వస్తూన్నాయి ఏ యిబ్బంది లేకుండా హాయిగా గడిచి పోతూంది కాలం

క్లాసులో చలపతి తెలివిగా వుండేవాడు చేరిన రెండు మూడు నెలల్లోనే చలపతి అందర్నీ ఆకర్షించాడు లెక్చరర్ల అభిమానాన్ని చూరగొన్నాడు. చలపతిలో అంతకుముందు లేని స్వేచ్ఛ—యిప్పుడు స్పష్టంగా కనుపిస్తోంది ఎప్పుడూ నవ్వుతూ తిరిగేవాడూ! చాలు న్యాది!

(57—వ పేజీ చూడండి)



# ఆదర్శాలు - ఆంతర్యాలు

**సింగరాజు లింగమూర్తి**

### జరిగిన కథ

పోలయ్య అంటే ఆ ఊళ్ళో చాలా మందికి అభిమానం, గౌరవం. కొంతమందికి అతనిపై అయిష్టం కలగడానికి కూడా కారణం లేక పోలేదు. నరసింహప్ప చలమయ్య ఒకరినొకరు సాధించుకోవాలని ఎత్తులు వేస్తూ ఉంటారు. నరసింహప్ప పోలయ్యను తన పక్షంలో చేర్పించటానికి ప్రయత్నిస్తాడు. పోలయ్య కు, నరసింహప్ప పెద్దకూతురు ఇందిరకు, రాజారావు ట్యూషన్ చెబుతూ ఉంటాడు. ఇందిర చెల్లెలు లలిత రాజారావును ప్రేమిస్తుంది. నరసింహప్ప రాజారావు ట్యూషన్ మాన్పిస్తాడు. పాతకాల వారి కోర్కెలు తీర్చడానికి వచ్చిన మంత్రి ఎన్నికలలో పోటీ చెయ్యమని రాజారావుకు సలహా ఇస్తాడు. రాజారావును మంచిచేసుకుని చలమయ్య అతి వేణిని నిరోధిస్తాడు. ఒక రోజు న వారిన పోలయ్య రాజారావును పిలిపించి, తనకు ట్యూషన్ చెప్పమని అడుగుతుంది.

రాజారావు భోజనం ముగించి "పోలయ్య ఇంకా రాలేదే" అనుకుంటూ దీపం ముందు కూర్చున్నాడు. పుస్తకం తెరిచాడు.

మనస్సు నిర్మలంగా లేనప్పుడు భాగవతం చదవడం రాజారావుకు అలవాటు. రాధాకృష్ణుల ప్రేమకు సంబంధించిన ఘట్టాన్ని చదువుతూ ఉండేవాడు.

ఒకటి రెండు పుటలు చదివేప్పటికి ఆరోజు జరిగిన సంఘటనలు కళ్ళముందు కదులాడాయి. దానితో మనస్సు వశం తప్పింది.

"నిజంగానే అలివేణి తనదగ్గర చదువుకోవా లనుకుంటున్నదా ? . ఆమెకు చలమయ్య ప్రోత్సాహమా ? ... ఒకవేళ తను అలివేణికి చదువు చెప్పడమే సంభవిస్తే తను చెప్పగలడా .. ఆమె ముందు కూర్చుంటే .... ఆమె అందచందాల ముందు, యౌవన భారం ముందు తన్ను పిచ్చివాడై పోతాడేమో ... ఆమె మాపులు, చిరునవ్వులు మనసాళ్ళను కదిల్చివేస్తాయి. అందుకని తను ఆమెకు ఎంత దూరంగా ఉంటే అంత మంచిదికదూ ? .... తనకు చదువు చెప్పమనడంలో మరేమైనా అంతర్యముందేమో ? .... ఇందులో చలమయ్య కుతంత్ర మేమైనా ఉందేమో" అనుకున్నాడు రాజారావు.

"తను ఆమెకు సదుద్దేశంతోనే చదువు చెప్పడానికి వెడితే ఊళ్ళోవాళ్ళంతా ఏమనుకుంటారు? ఇన్నాళ్ళనుంచి నైతికంగా తనకున్న బలం తగ్గిపోదూ ?" అని ప్రశ్నించుకున్నాడు.

ఇంతలో 'బాబుగారూ' అంటూ పోలాయి అక్కడకు వచ్చాడు.

"రా పోలయ్యా—కూర్చో .. ఏమిటి విశేషాలు?"

"మీరు సాయంత్రం చలమయ్యదొర ఉంచుకున్న అలివేణి ఇంటికి వెళ్ళారా ? చంద్రిగాడు మా కోసమొస్తున్నాడు. ఒక్కటి అంటేద్దామనుకున్నా .. కాని చిక్కకుండా పారిపోయాడు. దొంగవెధవ" చాపమీద కూర్చుంటూ అన్నాడు పోలాయి.

"ఇంకా నయం—వాడిని పట్టుకుని చావ కొట్టావు కాదు" నవ్వుతూ అన్నాడు రాజారావు.

"అబద్ధాలు పుట్టించి ప్రచారం చేస్తుంటే చూస్తూ ఊరుకోమంటారా ?"

"చంద్రయ్య చెప్పినదానిలో తప్పేంలేదు పోలయ్యా ! నిజంగా నేను ఆమె యింటికి వెళ్ళాను

(౭౭-వ పేజీ చూడండి)



హైదరాబాదులో స్వాతంత్ర్య దినోత్సవంనాడు ముఖ్యమంత్రి శ్రీ డి సంజీవయ్య సైనికవందనం స్వీకరించారు

**మనమూ-మనరాష్ట్రం** **కౌండిన్య**

# కోటయ్య, లక్ష్మణ్ గార్ల రగడ: గవర్నర్ సందేశం పరమార్థం

ఆంధ్రప్రదేశ్ శాసనసభ సమావేశం 17 రోజుల పాటు జరిగి క్రితం 12 వ తేదీన సమాప్తి అయింది శాసనసభ సమావేశంలో మిగతా కార్యక్రమాలన్నీ ఒక ఎత్తు, మంత్రి కొండా లక్ష్మణ్ ప్రగడ కోటయ్యగార్ల ఉదంతం ఒక ఎత్తు జడి వానలా వచ్చిన వీరి ఆరోపణ ప్రత్యారోపణలతో ఈసారి వర్షాకాలపు శాసనసభ సమావేశం రక్తి కట్టింది

గవర్నర్ ప్రసంగంపై చర్చలో పాల్గొంటూ జూలై 28 న శ్రీ ప్రగడ కోటయ్య లఘుపరిశ్రమల మంత్రిపై చాలా తీవ్రమైన ఆరోపణలు చేశారు ఆశాఖకు ఆయన అసమర్థుడని పక్షపాతంగా పాలిస్తున్నాడని, వెంటనే ఆశాఖనుండి ఆయనను తప్పించాలని కొంత కటువుగానే విమర్శించారు

కోటయ్య ఆరోపణలలో ప్రధానమైనవి ఆంధ్రలో సహకార సంఘాలలో మొత్తం 85 వేల మగ్గాలలోనూ 10 వేల మగ్గాలు ఆర్ట్ సిల్క్ నూలు వాడుతున్నవని, తెలంగాణాలో ఈ బాపతు నూలువాడేవి 2 వేల మగ్గాలేనని అయినా ఆర్ట్ సిల్క్ నూలు ఈ ప్రాంతాలలో పంచికే సరిసమంగా పంచారని, (2) రంగులు రసాయనాల పంపిణీ కూడా ఆంధ్ర తెలంగాణాల మధ్య 2:1 నిష్పత్తిలో గాక ఇంచుమించు సరిసమంగా ఇచ్చారని

శ్రీ కోటయ్య ఆరోపణలు సత్యదూరమని, ఆర్ట్ సిల్క్ నూలు పంపిణీలో గాని, రంగులు రసాయనాలలో గాని ఏమీ అన్యాయం చేయలేదని శ్రీ కొండా లక్ష్మణ్ 60 పేజీల సమాధానమిస్తూ చెప్పారు పైగా కోటయ్యపై కొన్ని ప్రత్యారోపణలు చేశారు అందులో ముఖ్యమైనవి కోటయ్యకు ఆంధ్ర తెలంగాణా చేనేత సంఘాలు ఏకమవడం ఇష్టంలేదని; అఖిలభారత చేనేత సలహాసంఘంలో సభ్యత్వం ఇప్పించలేదనే కోపం మనస్సులో పెట్టుకున్నాడని; ఆంధ్ర చేనేత సహకార సంఘ వ్యవహారాల దర్యాప్తుకు సంకల్పించడంవల్లనే అసలు ఈ రభస లేవతీశాడని శ్రీ కొండా లక్ష్మణ్ తన సమాధానాన్ని, సభకన్నా ముందుగా పత్రికల కివ్వడంచేత, సభలో దానిని చదవడానికి సభాపతి అభ్యంతరం చెప్పారు చివరకు ఈ వ్యవహారం సభ హక్కులను భంగించారనే టంతవరకు వెళ్లింది ఒక క్షమాపణతో మంత్రిగారు, ఈ చిక్కులో నుంచి బయటపడ్డారు

శ్రీ కోటయ్య ఈ ప్రత్యారోపణలకు సమగ్రమైన జవాబివ్వలేదు తన ఆరోపణలలో చేటిని మంత్రి ఖండించలేక పోయారని మాత్రం అన్నారు పైగా ఆరోపణ ప్రత్యారోపణలపై సభలో చర్చకు సభాపతి అనుమతి ఇవ్వనందున, అసలు కథవిమిటో పుటుపూర్వోత్తరాలు పూర్తిగా బహిర్గతం కాలేదు ప్రతిపక్షం నాయకుడు శ్రీ సుందరయ్య, ఆంధ్ర తెలంగాణా చేనేత సంఘాల వ్యవహారాల దర్యాప్తుకు, జుడిషియల్ సంఘాన్ని వేయాలంటూ కో తీర్మానం తెచ్చారు కాని సభవారు త్రోసివేశారు తిరువాత మళ్ళా శాసనసభ సభ్యులచే ఒక దర్యాప్తు సంఘాన్ని వేయాల ఒక ప్రతిపాదన తెచ్చారు కాని శ్రీ ఎగ్బాల్ తెచ్చిన ఆక్షేపణ సభాపతి అంగీకరించి ఈ ప్రతిపాదన చర్చకు రాకుండ త్రోసివేశారు దాంతో శాసనసభకు సంబంధించినంతవరకూ ఈ గొడవ సమాప్తమైంది

శ్రీ ప్రగడ కోటయ్య ఆరోపణలు సబబే నా, కొన్నా ఆయన ఈ రూపంలో శాసనసభలో తగాదా లేవడం పార్లమెంటరీ పార్టీ సంప్రదాయానికి విరుద్ధమవుతుంది ఒక పార్టీకి చెందిన సభ్యుడు అదే పార్టీకి చెందిన మంత్రిపై బహిరంగా శాసనసభలో విమర్శచేయడం ఆ మంత్రి ని మంత్రివర్గాన్ని అభిశంసించడంతప్ప వేరేమీకాదు పార్టీలో ఏ సభ్యుడికైనా ఒక మంత్రి ధోరణి నచ్చపోతే పార్టీలో ఆ వ్యవహారం చర్చించి తేల్చుకోవాలి వెనుక సహకార మంత్రి శ్రీ చంద్రమౌళిపై శ్రీ మంతెన వెంకటరాజు ఇలాగే కొన్ని ఆరోపణలు చేశారు కాని శాసనసభలో పెట్టి మంత్రిని రచ్చ కీడ్వలేదు శ్రీ కోటయ్య అనుసరించిన పద్ధతి సరైందికాదు అనుకనే శాసనసభ పార్టీ కార్యవర్గం ముందుముందు ఇలా మంత్రులను శాసనసభలో విమర్శించేవారిపై క్రమశిక్షణచర్య తీసుకోవలసివుంటుందని హెచ్చరించింది

ఆంధ్రప్రదేశ్ చేనేత రంగంలో ఈ తగాదా ఇప్పుడు కొత్తగా వచ్చిందేమీకాదు ఈ రంగంలో ప్రముఖులు ముగ్గురు ప్రగడ కోటయ్య మాచాని సోమప్ప కొండా లక్ష్మణ్ ఈ ముగ్గురు మూడుప్రాంతాలలో స్వకీయనాయకత్వం సృష్టించుకొని రాజ్యం చేస్తున్నారు ఈ ముగ్గురిలో కడపటి ఇద్దరు ఒకటైనారు ప్రాంతీయనాయకత్వం నిలుపుకోవాలని ఒకరు ప్రయత్నిస్తుండగా విశాలాంధ్ర నాయకత్వంకోసం మరొకరు తంటాలు పడుతున్నారు ఆంధ్ర, తెలంగాణా సంఘాల విలీనం వద్దనడానికి, లేదా విలీనం కావాలనడానికి ప్రధానకారణం ఈ నాయకత్వం తగాదాయే ననిపిస్తోంది

క్రితం మే మూడోవారంలో తిరుపతిలో శ్రీ లక్ష్మణ్ ఆధ్వర్యాన జరిగిన ఆంధ్రరాష్ట్ర చేనేత సలహా సంఘంలో ఈ సంఘాల విలీనం సమస్యపై పెద్ద రభస జరగడం, ఆ సభనుంచి శ్రీ కోటయ్య వర్గం బయటికి పోవడం గుర్తుండే ఉంటుంది తెలంగాణా సంఘం నష్టంమీద నడుస్తోంది ఆ సంఘాన్ని తొందరపడి ఆంధ్రసంఘంలో కలపరాదని శ్రీ కోటయ్యవర్గం వాదం అసలు ఆంధ్ర సంఘంలో డబ్బు దుర్వినియోగమౌతోంది. దీన్ని దర్యాప్తుచేయించాలని వెంటనే ఈ రెండు సంఘాలను లీనం చేయాలని మాచాని సోమప్ప వర్గం వాదం

ఆంధ్ర చేనేత సహకారసంఘం క్రింద 121 వేల సభ్యత్వంతో 670 ప్రాథమిక సహకారసంఘాలున్నాయి ఇందులో 226

(51-వ పేజీ చూడండి)



కాఫీ అమృతం సేవిస్తున్న భక్తులు

వినకనే అన్నాడొక మహాకవి ఒక్కరొక్కకే "లప్పులతో తడోరుకు ఇక్షణ వష్ఘుల ఇంట" అని ఈనాడూ హోటళ్ళు అంతే ప్రాముఖ్యం వహిస్తున్నై. ఆఖరికి కాఫీని కూడా దేవతగా మార్చేసింది మన తెలుగుజాతి 'కాఫీం మసివర్ణం చతుర్విధం' అన్ని సంధ్యావందనం కన్నా చక్కగా జపిస్తున్నాం. ఈ నాడు ఆర్తుల పాలిట అన్నపూర్ణ, కుటుంబీకుల పాలిటి కల్పవృక్షం, చివరకు ప్రొద్దు పొడుపునే సందర్శించే దేవాలయం ఇదే. ఈ విషయం 'భమిడిపాటి' వారికి బాగా తెలుసు

# 'కామితార్థ ప్రదాయినీ కాఫ్యాలయ దేవతా'

**సి. వి. రాజగోపాలరావు**

ఇదివరలో మాదిరిగా కాక నేడు హోటళ్ళు మన దైనందిన జీవితంలో భాగమైపోయాయి; మారుమూల కుగ్రామంలో నైనాసరే హోటల్ ఉండితీరాల్సిందే. ఇంట్లో కాఫీ త్రాగినా డబ్బు లిచ్చి హోటల్‌లో త్రాగితేనేగాని 'ఫాషన్' కాదనే రోజులు వచ్చాయి. ఇళ్లకు వచ్చిన బంధు మిత్రులను హోటళ్లకు సినిమాలకు ఎన్ని మార్లు తీసుకువెడితే అంత ప్రతిష్ఠ, పరువు పెరుగుతాయని భావించే రోజులివి. 'ఇంట్లో కాఫీ త్రాగినా త్రాగకపోయినా హోటల్‌కు వెళ్లవలసిందే' అన్నాడొకాయన. అది నల్లమందు లాంటిది! పదుపాయాలుంటాయికదా అని కొంతమంది కుటుంబాలతో హోటళ్లలోనే వెలితరబడి కాపురా లుంటారట.

డబ్బుతీసుకొని భోజనం పెట్టటడం పూర్వం మనదేశంలో హీనంగా భావించేవారు. ఆర్థికంగా చితికిపోయిన కొంతమంది మాత్రం డబ్బు పుచ్చుకొని భోజనాలు పెట్టేవారు. అవే పూటకూళ్ళు. కాని దేశంలో వ్యాపారం, విద్య, పరిశ్రమలు అధికంకావడంతో హోటళ్ల అవశ్యకత ఏర్పడింది. ఉద్యోగులు—ముఖ్యంగా విద్యార్థులు—హోటళ్ళపై ఆధారపడటంతో అవి క్రమంగా నీటుగా తయారయ్యాయి. తక్కినవారికన్నా విద్యార్థులు హోటళ్లకు ఎక్కువ ఖర్చుచేస్తున్నారనీ దానిలో కొంత అనవసరపు ఖర్చేననీ హోటల్ యజమానులే అంగీకరిస్తున్నారు.

ఇప్పుడు హోటళ్ళు ఒక పరిశ్రమగా రూపొందాయి. వీటివల్ల ప్రయాణాలలో ఇబ్బంది ఉండదు. హోటళ్ళు లేకపోతే నేడు యింతగా ప్రయాణాలే సాగవేమో అనిపిస్తుంది. అయితే ఆరోగ్యం విషయం చూస్తే హోటళ్లలో తినడం అంత మంచిదికాదు. కొన్ని పెద్ద హోటళ్లలో శుచి శుభ్రతలకు ఏమాత్రం లోటు ఉండదు. కాని

మన ఆంధ్రలో హైదరాబాద్ మినహా తక్కిన పట్టణాలలో పెద్ద హోటళ్ళు లేవనే చెప్పాలి

హోటళ్ళలో ఏవేళ చూసినా రద్దీయే ముఖ్యంగా ఉదయం సాయంకాలాలు చూస్తే 'హోటళ్ళవారు ఎంత లాభాలు గడిస్తున్నారో' అనే అసూయ కూడా కలుగుతుంది అయితే హోటళ్ళ నిర్వహణ అంత తేలికకాదు ఈ విషయంలో యజమానులు చెప్పే కొన్ని యిబ్బందులు యివి — పనిచేసేవారి సహకారం ఏమీ ఉండదు వారు సహకరించి జాగ్రత్తగా ఉంటే, సగానికి సగం ఖర్చు తగ్గుతుందట పనివారికి చట్టాలు వర్తింపజేయడంవల్ల యజమాని పనివారి సంబంధాలు దెబ్బతిన్నాయనీ శాసనాలు వచ్చాక పని సరిగా జరగడం లేదనీ యజమానుల వాదన కాని శాసనాలే లేకపోతే తమను యజమానులు ఎన్ని బాధలు పెట్టేవారో చెప్పలేమని పనివారంటారు కొన్ని హోటళ్ళలో పని చేయించుకోవడమే కాని జీతాలు సరిగా యివ్వరనీ దీనికి లేబర్ ఆక్ట్ కాకపోతే మార్గాంతరం ఏమిటనీ వారంటారు అయితే యజమానులు చెబుతున్న ఒక్క విషయం మాత్రం గమనించదగింది చిన్న హోటళ్ళలో పిండి రుబ్బేవారు ఒకరిద్దరుంటారు వీరు వెళ్ళిపోతానంటే—మరొకరిని వేసుకొనేవరకు వ్యవధి అయినా యివ్వకుండా—చట్టప్రకారం అధికారులు వ్యవహరిస్తున్నారట ఇందువల్ల యజమానులు ఇబ్బందిపడవలసివస్తోంది

హోటళ్ళలో గిరాకీ ఫలానా పదార్థం అని కాక చవకగాఉండేవాటి కన్నిటికీ ఉంటుంది మన రాష్ట్రంలో ముఖ్యంగా ఇడ్లీ ఉప్మా పూరి, పెసరట్లకు ఎక్కువ ఖర్చు ఉంటుందట దోసె అంతగా చలామణీ కాదు మామూలు దోసెకన్నా మసాలా రవ్వదోసెలకు ఖర్చు తక్కువ గత రెండు సంవత్సరాలుగా 'స్వీట్స్' చలామణీ తగ్గిందట అయితే మునుపటికన్నా యిప్పుడు వంటల రకాలు ఎక్కువయ్యాయి మారుతున్న సరదాలకు తోడుగా హోటళ్ళలోని రకాలుకూడా మారుతూనే ఉన్నాయి ప్రజల సరదాలు ఎలా ఉన్నా రకాలు చేస్తే చలామణీకాగలవన్న ధైర్యం హోటల్ యజమానుల కుంది

అన్నిటిలోను ఉడిప హోటళ్ళు ప్రతిచోటా ప్రసిద్ధికెక్కాయి దీనికి కారణం వెదికితే—పరిశుభ్రత మర్యాద అని తేలింది హోటళ్ళను నిర్వహించేవారు చూపే మర్యాదపై ఆ హోటల్‌కు వెళ్ళడం ఉంటుందిగనుక యీ గుణాన్ని వారు బాగా వినియోగించుకొంటున్నారు మరో విశేషం ఏమంటే—ఎక్కడ చూసినా ఉడిపివారు హోటళ్ళే పెడతారుకాని మరో పరిశ్రమగాని వ్యాపారంగాని పెట్టరు దీనికీ కారణం ఉంది ఉడిపి నుంచి వచ్చి ఏదో హోటల్‌లో పనివాడుగా చేరి కొంతకాలం పోయినతర్వాత హోటల్ పెడతాడు ఇందుకు తమతోటి ఉడిపివారు తనకి సహాయం చేస్తారు తనవారు పైకిరావాలన్న భావం వారిలో ఉంది

మన ప్రాంతం వంటవారిలోకూడా యిదే తారతమ్యం గోచరిస్తుంది శాకాహారం తమిళ కన్నడ వంటవారు బాగా చేస్తారట మాంసాహారం చేయడం మళయాళీల సొమ్ము అందువల్ల తెలుగువారు పెట్టిన మిలటరీ హోటళ్ళలో వంటవారంతా మళయాళీలే శాకాహారం తయారీలో తెలుగువారు దిట్టలున్నా హోటళ్ళలో వారికి అంత స్థానంలేదు దీనికి కారణం—తక్కిన వంటలకు తెలుగువంటలకు ఉన్న తేడా అనిపిస్తోంది మన తెలుగువంట ఒక్క తెనుగువాళే

ముక్తికి ముదువులు

కాని తక్కినవా రెవ్వరూ తినలేరని హోటళ్ళ యజమానులు అంటారు.

మన ప్రాంతంలో పెసరట్లు బాగా పాప్యులర్ అయ్యాయి మనకు యిడ్లీకూడా అధిక చలామణీయే దీనికి కారణం మనదేశం ఉష్ణప్రాంతం కావడంవల్ల చలవచేసే పెసర, మినుములకు ఖర్చు ఎక్కువగా ఉండిఉంటుందని 27 సంవత్సరాలు హోటల్ అనుభవం గల ఒక యజమాని చెప్పాడు మన ప్రాంతంలో పాలసరఫరా సరిగా లేకపోవడంవల్ల పాలపొడి విరివిగా ఉపయోగింపబడుతోందని తెలుస్తోంది ★



భక్ష్యం వి న్యా స ము



యజమాని శ్రీ సుబ్బారావు

# మనమూ మనదేహస్థితీ

డా॥ గాలి బాలసుందరరావు

## టాన్సిలైటిస్ నివారణ

టాన్సిలైటిస్ వచ్చినప్పుడు, యింట్లో తీసుకోవలసిన జాగ్రత్తలనుగురించి గతవారం తెలుసుకున్నాము ఇప్పుడు ఔషధ చికిత్స శస్త్ర చికిత్సలను గురించి కొద్దిగా చర్చిస్తాను

టాన్సిలైటిస్, అతి సాధారణంగా కనిపించే వ్యాధి ఈ వ్యాధి వచ్చిన, తరవాత కేవలం ఔషధములవల్ల, పై పూతలవల్ల యీ వ్యాధిని పూర్తిగా నివారించగలమా? లేక శస్త్రచికిత్స మాత్రమే శరణ్యమా? ఏ సందర్భంలో శస్త్ర చికిత్స అత్యవసరం? శస్త్రచికిత్స చేసినంతమాత్రాన దాని దుష్ఫలితాలు తొలిగి, మంచి ఆరోగ్యం చేకూరుతుందా? ఈ ప్రశ్నలన్నీ చాలా మందిని యెదుర్కొంటవి టాన్సిల్‌లో ఏర్పడిన ఇన్‌ఫ్లమేషను, అక్కడే వుండిపోతుందా? లేక స్థానికములయిన అవయవములకుగాని, యితర అవయవాలకుగాని ప్రాకుతుందా? దీర్ఘమైన టాన్సిలైటిస్ (Chronic Tonsilites) వల్ల దుష్ఫలితాలు వుంటవా? అవి ప్రాణాపాయకరమైనవా? ఇటువంటి ప్రశ్నలు యెన్నో సామాన్య గృహస్థులను ఎదుర్కొంటూ వుంటవి ఈ ప్రశ్నల విషయంలో నిపుణులలోనే ఏకాభిప్రాయంలేదు కాని అనుభవాన్నిబట్టి కొంతవరకు యీ ప్రశ్నలకు సమాధానం చెప్పవచ్చును

టాన్సిలైటిస్ కేవలం క్రిమిదోషంవల్ల ఏర్పడే వ్యాధి టాన్సిల్‌ను ఇన్‌ఫ్లేం చేసే క్రిములను అందరూ పీలుస్తూనే వుంటారు కాని అందరికీనూ టాన్సిలైటిస్‌రాదు వచ్చినా సంవత్సరాలుగా వుండదు అంటే తీవ్ర స్థితిలోనే అంతరించిపోతుందిగాని దీర్ఘస్థితిని పొందదు కొంతమంది టాన్సిలుతో డిఫ్తీరియా క్రిమివంటి అతి ప్రమాదకర క్రిములువున్నా, వారిలో ఆ వ్యాధిని కలిగించలేవు కాని వారు విడిచిన వాయువులను పీల్చినవారిలో ఆ వ్యాధిని కలిగిస్తవి ఇందువల్ల కొందరిలోనే కొన్ని క్రిముల సంపర్కంతో వ్యాధిగ్రస్తులయ్యే స్వభావం వుంటుందని తెలుతున్నది అన్ని క్రిములకు రోగం కలిగించే శక్తి వుండదు అందుకు అవి శక్తివంతమయిన స్థితిలో వుండాలి ప్రతి వ్యక్తిలోనూ అంతో యింతో రోగ నిరోధక శక్తి, క్రిమి సంహారక శక్తి వుంటవి ఇది ఎవరిలో ఎందుకు ఎంతగా ఉంటుంది అన్న ప్రశ్నలో వూహాగానం చాలా చేయవచ్చు. పైతృకములయిన కారణములవల్ల, ఆహారం, జీవిత విధానం, పరిసరములు అభ్యాసములు వీటన్నింటిమీద యీ శక్తి ఆధారపడివుంటుందని చాలామంది శాస్త్రజ్ఞుల విశ్వాసం ఆహారం, వాక్పారిశుద్ధ్యం (Oral Hygiene) వంటి విషయముల మీదకూడా వాగ్రోగములు (Oral Diseases) కలిగించే క్రిములను నిరోధించగలిగే శక్తి ఆధారపడి వుంటుంది ఈ వ్యాధి మొదటిమాటు రావడానికి యే పరిస్థితులు కారణములో పదే పదే రావడానికి కూడా అవే కారణము లవుతవి ఈ వ్యాధి ఎక్కువసారులువచ్చిపోయినకొద్దీ టాన్సిలైటిస్ దీర్ఘస్థితినిపొంది, శరీరంలో యితర అంగములు కూడా రోగగ్రస్తములై సర్వ శారీరకమైన దుర్బలస్థితి యేర్పడుతుంది టాన్సిలైటిస్ స్వయంగా ప్రాణాపాయకరమైనది కాకపోయినా, దీర్ఘస్థితిపొంది, యితర అంగములు వ్యాధిగ్రస్తములైనప్పుడు ప్రాణాపాయం కలిగించవచ్చును అందుచేత ఈ వ్యాధికి తీవ్రమయిన త్వరితమయిన వీలైనంతవరకు శాశ్వతమైన నివారణకు ప్రయత్నం చేయాలి

"సల్ఫానిలమైడ్" (Sulphanilamide) అనే ఔషధం వచ్చేవరకు యీ వ్యాధికీ, యితర క్రిమి జనిత వ్యాధులకూ సరిఅయిన ఔషధం ఆధునిక వైద్య విధానంలో వుండేదికాదు శారీరకమయిన రోగ నిరోధక శక్తివల్లా, కొన్ని పైపూతలవల్లా క్రిమి సంహార కౌషధములు నీళ్ళలో కరిగించి పుక్కిలింతలవల్లా, యీ వ్యాధి వచ్చి పోవడం జరిగేది ఇప్పుడు అనేక క్రిమిసంహారకౌషధములు ఆధునిక వైద్యవిధానంలో ఉపయోగానికి వచ్చినవి పెన్సిలిన్, టెట్రా సైక్లిన్ (Tetra-Cyclin) క్లోరోంఫెనికాల్ (Chloromphenecal) వంటి మందులెన్నింటినో అనేక ఔషధ నిర్మాతలు తయారు చేసి వైద్యలోకానికి అందించారు అయితే ఈ మందులు యీ పేరులతో దొరకవు ఒక్కొక్క కంపెనీవారు ఒక్కొక్క పేరుతో వీటిని విక్రయిస్తారు ఒక్కొక్క జాతి క్రిములమీద వీటిలో ఒక్కొక్క మందు బాగా పని చేస్తుంది. నిరంతర పరిశోధనల వల్ల, ఈ మందుల రసాయనిక స్వరూపమూ, పేర్లూ తరుచు మారిపోతున్నవి. శరీర పరిస్థితు

[illegible]
కొని, వయస్సు, శరీరం బరువు, దృష్టిలో వుంచుకుని తగిన మోతాదులో కొంతకాలం వాడినప్పుడు ఈ వ్యాధి మళ్ళీ తలయెత్తకుండా పోవచ్చును. ఔషధములతో క్రిమి సంహారం చేయడం యెంత అవసరమో, శరీరంలో క్రిమినిరోధక శక్తి పెంపొందించడం కూడా అంతే అవసరం ఔషధ ప్రయోగానికి (1) వయస్సు (2) శరీరం బరువు (3) తగిన మోతాదు (4) నిర్దిష్టకాలం, ఈ నాలుగు విషయములు అతిప్రధానములు ఈ మందులు అనేక మంది ప్రాణాలు కాపాడినా, వాటికీ శరీరానికీ వుండే 'వైకట్యం' (Allergy) వైరుధ్యం (Incom Patibility) తెలుసుకోకుండా గుడ్డిగా వాడినప్పుడు కొందరిలో ప్రాణమోసము కూడాకలిగించవచ్చును ఈ కారణంచేత ప్రభుత్వంవారు వైద్యపట్టం పొందిన వైద్యులుగా రిజిష్టరు అయినవారి సంతకం లేకుండా యీ మందులు అమ్మరాదని శాసించారు మనదేశంలో పట్టంపొంది రిజిష్టరు అయిన డాక్టర్ల సంఖ్య జనాభాకు తగినట్లులేదు. గ్రామాల్లో నాగరిక జీవిత సౌకర్యములులేని ప్రదేశాల్లో అసలే అరుదు ఈ పరిస్థితుల్లో క్రిమి వ్యాధులు వచ్చినప్పుడు, అక్కడ లభించే యితర వైద్యవిధానములతోనూ లభించే ఔషధములతోనూ వారు నివారింపబడడమో నిర్మూలింపబడడమో జరుగుతుంది ఒక ఔషధం ప్రాణ మోసం కలిగిస్తుందా, ప్రాణరక్షణ కలిగిస్తుందా అన్న విషయం ఉపయోగించే వ్యక్తి, శరీర శాస్త్ర పరిజ్ఞానంమీదా, రోగ విజ్ఞానంమీదా ఆ ఔషధం, కలిగించే సత్ఫలితములు, దుష్ఫలితములు, ఉపయోగించవలసిన సమయం, వికటించినప్పుడు తీసుకోవలసిన చర్యలు, వికటించకుండా ముందే పడవలసిన జాగ్రత్తలు ఏ టన్నింటిమీదా ఆధారపడుతుంది. ఫిజిక్సు, కెమిస్ట్రీ (Chemistry) బయాలజీ (జీవశాస్త్రం) చదువుకుని, ఔషధవిజ్ఞానం (Pharmocology) తెలిసినవారికిగాని ఈశక్తి కలగదు అందుచేత ఆధునిక వైద్య విధానమేకాదు, ఆయుర్వేదం, హోమియోపతీ వంటి యితర విధానాల్లోనయినా సమగ్రమయిన విజ్ఞానం లేనివారు ఆ విధానాల్లో వుండే మందులు వాడడమూ ప్రమాదకరమే! అయితే ప్రస్తుతం ఎలోపతీ మందులు వాడడం విషయంలో వున్న నిషేధములు, నిబంధనలు ఇతర మందులు వాడడంమీద లేవు అందుచేత ఏ

(51-వ పేజీ చూడండి)

# హరివంశము

## సాందీపనిపర్వం - 25

గంగ ఒడ్డున అక్కడ రథాలు మరల ఆగినవి మరల అందరును దిగినారు చంద్రుడు ఉదయించగా, ఆ వెన్నెలలో గగనగంగ గోధుమ వన్నె త్రాచునుపోలి మిలమిలలాడిపోయినది శివుని శిరమునుండి వూడిపడినప్పుడు ఈ అందమును, ఈ ప్రకాశమును తనతో తెచ్చికొన్నదో! ఆ వెన్నెలలో వియద్వ్యాపిని పరమశివుని శరీరకాంతివలె, ప్రమథులయశస్సువలె, పార్వతీదేవి అనుగ్రహము వలె ప్రవహించుచున్నది ఆ వెన్నెలలో ఆ గంగను చూడగా శ్రీ కృష్ణదేవునకు ఆనందమైనది బలరామునకు ఆనందమైనది అందరును అక్కడ కొంచెముసేపు కూర్చుందమనుకొనినారు గంగ తునకలు తెల్లగా, పరమశివుడు దులుపుకొనిన విభూతి రేణువులను పోలి వున్నవి వామాక్షి అక్కడ పిచ్చుక గూడులు కట్టుకొన్నది శ్రీకృష్ణదేవుని 'అన్నా' అని పిలిచి, తన పిచ్చుకగూడులను చూడమని మెత్తని బలవంతము పెట్టినది ఆ పిల్లకు కాశికలో ఈ విహారము ఆనందదాయకముగ నున్నది ఇప్పుడు ఈ పిచ్చుకగూడులను కట్టుకొనుట మరియు ఆనందముగ నున్నది శ్రీకృష్ణదేవుడు దాని ఆ కట్టిన పిచ్చుకగూడులను చూడగా లేచినాడు బలరామునకు ఆ పసిపిల్లను చూడగా ముద్దయినది

"వామాక్షి! శ్రీ కృష్ణుడు నీకు అన్నగదా, నేనేమి యగుదునే" అనినాడు

"నీవు ఏమియుకావు అన్నది' వామాక్షి

"ఓసి! వామాక్షి! ఈయనయు నీకు అన్నయేనే. ఆయన శ్రీకృష్ణునకే అన్నగారు" అనినాడు మహానందుడు

"కాదు! కాదు నాకు ఒక్క అన్నయే వున్నాడు. శ్రీకృష్ణుడు నా పిచ్చుక గూడులను అన్నకుతప్ప మరిఒక్కరికి చూపించను" అన్నది వామాక్షి

శ్రీకృష్ణుడు మందహాసము చేసినాడు దాని పిచ్చుకగూడులను చూచినాడు "వామాక్షి! నీవు ఈ పిచ్చుక గూడులలోనే కాపురముచేయుదువే" అనినాడు

వామాక్షి శ్రీకృష్ణదేవునివంక విచిత్రముగా చూచినది "అన్న! నీవు అండగా వుండగా నేను ఎక్కడనున్న యేమి?" అన్నది

శ్రీకృష్ణుడు గల్లున నవ్వినాడు "మహానంద! నీ కూతురు మంచి ఆరిందాఅయ్యా! ఎంత ముద్దుగా మాటలాడుచున్నదో చూడు" అన్నాడు

మహానందుడు ఆలోచనాధీనుడైనాడు అంతలో "అవును అవును" అనినాడు. ఆ పిల్ల మాటయే అతనికి విచిత్రమనిపించినది.

"శ్రీకృష్ణ! దీనికి నేను పెండ్లిచేయుగలనందువా! పరమదరిద్రుడను" అన్నాడు. ఆ మాటయు అతనికి విచిత్రమనిపించినది తాను ఏమియు అక్కరలేనివాడు. ఏమియు పట్టించుకొనివాడు. ఇప్పుడు తనకు ఈ ఊహ వచ్చినది. అతడు శ్రీకృష్ణదేవునివంక విచిత్రముగా చూచినాడు శ్రీకృష్ణదేవునకు అతనిని చూడగా నవ్వు వచ్చినది

"మహానంద! మనము జ్ఞానవాపికవద్దకు పోవుదము అచ్చటనుండి ముక్తి మంటపమువద్దకు పోవుదము నీవు ఏమందువు"

"నీ యిష్టము ప్రకారము కానిమ్ముందును" అనినాడు మహానందుడు

మరల అందరును రథములను అధిరోహించినారు మరల రథములు కదిలినవి మరల శ్రీకృష్ణదేవుడు సారథ్యము వహించెను మరల అద్భుతములు జరిగినవి మొదటి అద్భుతము ఆ వెన్నెల ఆ వెన్నెల ఎప్పుడు అట్లులున్నది! మహానందుడు కాశికలో ఎన్ని రాత్రులను చూడలేదు! ఎన్ని వెన్నెలరాత్రులను చూడలేదు ఎప్పుడు వెన్నెల ఇట్లులుగాలేదు ఆ వెన్నెల సూర్యునికాంతిలోని వేడిమిని విరిగి, చల్లని తనమును తెచ్చుకొని కాలుచున్నట్లు వున్నది కాశిక చల్లని పట్టపగలును అనుభవించుచున్నట్లు వున్నది పాలసముద్ర



మును తరచగా జన్మించిన కలువల చెలిమికాడు అమృతమును గూడు కట్టించుకొని, ఇప్పుడు కాశికపై చల్లని వెన్నెలగా చిలుకుచున్నట్లు వున్నది. శ్రీకృష్ణదేవుని యశస్సు, కాశికలో వ్యాపించినట్లు వున్నది కాశికలో భగవంతుడు విహారముచేయుచుండగా ఆకాశము అన్న తెరను తొలగించి, ఆ విహారమును చూచుచున్న దేవేంద్రుని ముఖమువలె చంద్రబింబము కన్పించినది వేదమూర్తియయిన శ్రీకృష్ణదేవుడు ఆనందకాననమున సంచరించగా ఋషులు తమ మహత్వముచేత సృష్టించి ఆకాశమంతటి ఎత్తుగా పట్టిన ముక్కలతోటి వెల్ల గొడుగును పోలి ఆ బింబము తోచినది భగవంతుని రథము ఎంతదూరము ప్రయాణము చేసెను. అంత దూరమును ఆ చంద్రుడును వెన్నెలలను గిలకొట్టుచు ప్రయాణము చేసినాడు. ఎచ్చట ఆయన రథము ఆగెను అచ్చటను ఆ చంద్రుడు ఆగినాడు. రథము జ్ఞానవాపికదగ్గర ఆగగా, ఆ చంద్రుడు జ్ఞానవాపికలో ప్రవేశించినాడు జ్ఞానవాపిక యోగి మనస్సును పోలివున్నది. చంద్రుడు అందులో నివాత స్తిమితమైన దీపకళికనుపోలి ప్రకాశించినాడు

శ్రీకృష్ణదేవుడు ముందుగా రథమును దిగి వామాక్షిని దింపినాడు వామాక్షి శ్రీకృష్ణుని చేతులలో కిలకిలా నవ్వినది "అన్న! నేను దాని పిడుగునను ఈ చంద్రుని చూచుచున్నాను. నాకు గంగ ఒడ్డున నా పిచ్చుక గూడువలె వున్నాడు" అన్నది. శ్రీ కృష్ణదేవుడు మధురమందహాసము చేసినాడు. "మహానంద! ఏమో అనుకున్నాను దీనికి కవిత్వము గూడ వచ్చును" అన్నాడు

"నిన్ను చూడగా, నాకే పరమజడునకు కవిత్వముకన్న ఎక్కువైన ఆనందము కల్గగా, పసిపిల్లకు, దానికి, కవిత్వము వచ్చుటలో ఆశ్చర్యమేమున్నది" అన్నాడు మహానందుడు

అందరును జ్ఞానవాపిక ఒడ్డున కూరుచున్నారు బలరాముడు అనినాడు మహానంద! ఇందాకనుజ్ఞానవాపికను గురించిన మహాత్మ్యమును చెప్పుదునన్నావుకదా!"

"అవును! అవును!"

"కొంచెముసేపు ఇక్కడ కూరుచుండిపోవుదము ఈలోగా ఆ మహాత్మ్యమును వినిపించరాదా! నీవు చూడగా పండితుడవువలె వున్నావు"

"అట్లులన్నచో చెప్పనే చెప్పను నేను పండితుడనేమిటి? సాందీపని పండితుడు, నేనుకాను. ఏవో కొన్ని కథలు వారు చెప్పగా వీరు చెప్పగా విన్నాను" అంతియే

"అందుకేనాయేమి, మనము ప్రయాణమైన వేళ కథను వర్ణించినావు?"

"అది కథనా! అది నాకు తెలియదు సాందీపని శిష్యులకు పాఠములు చెప్పుచుండగా వినిన మాటలు అప్పుడు నాకు జ్ఞాపకము వచ్చినవి అని నేసినాను"

"ఇప్పుడు జ్ఞానవాపికా మాహాత్మ్యమును గూడ అట్లుకే అనినేయుము"

మహానందుడు అప్పుడు వారికి జ్ఞానవాపికా మాహాత్మ్యమును వినిపించినాడు.

"పూర్వము కాశిలో ఒక బ్రాహ్మణుడు వుండెడివాడు. ఆయన పేరు హరిశర్మ ఆయనకు ఒక్క కూతురు దాని పేరు సుశీల. రూపురేఖా విలాసములలో మూడులోకములలోను దానికి ఈడైన వారు ఎవ్వరులేరు. అది సాక్షాత్కరించిన లక్ష్మీవలె పోలివుండేది. దానికి శివునియందు భక్తి అధికము. ప్రతి దినమున ఉదయమున స్నానముచేసి, విశ్వనాథుని దేవళమునకుపోయి ఆయనకు సేవచేసి వచ్చెడిది. ఆ సేవ ఎట్టిసేవ! అనుదినమును విశ్వనాథుని కళ్యాణవేదియందు ముగ్గుపెట్టెడిసేవ. అవి ఎట్టి ముగ్గులు! ముజ్జగములను మోహింపజేయునట్టి ముగ్గులు. నెచ్చెలులతో అమె, ఆ సుశీల తెలి కన్నులతో, మొలక చన్నులతో, బొమ్మల మీద వ్రాలు ముంగురులతో శివవిభూషణుని పూజలకు పోగా, రాగా, జనములు ఆమె అందమును చూచి ఉవ్విళ్లూరుచుండెడివారు. ఆమె జనాళిభాగ్యలక్ష్మివలె వారికి కన్పించెడిది. నాడు

(52-వ పేజీ చూడుడు)

హారిత శివశర్మ



ఆలోచిస్తూ కూర్చున్న అరుణ స్మృతిపథంలో అక్కయ్య, నుగుణ శీలగా కనిపించారు. 'వాళ్లు ఎంత మారి పోయారు!' అనుకుంది తను. మరితనో ..

కదంబాల సుగంధాలు....

పట్టు చీరెల రెపరెపలు....

గాజుల గలగల ధ్వనులు..

మెత్తని కాలిజోళ్ళ చిరుసవ్వడులు....

కలకంఠుల కలకల స్వనాలు.

కంచెట్టే అన్నం అలాగే ఆపేసి అరుణ తలెత్తి చూసింది

కమల సావిత్రి సుందరి, కల్యాణి విజయ, శ్యామల, కోమలి, కాంత ...

"ఏమిటోయ్ అరుణా—ఇంకా ఇలాగే వున్నావ్?"

"పేరంటంమాట మరిచావా యేమిటి?"

"ఈ కత్తిపీటలు కాకరకాయలు ఎప్పటికి కడ తేరేనే నా చిట్టితల్లీ?"

"నీ స్నానం, నీ ముస్తాబు ఇంక ముగిసేదెప్పుడే ముద్దుచెల్లీ?"

ప్రశ్నమీద ప్రశ్న కురుస్తున్నది వాళ్ళందరి మొహాలవంకా ఒక్కసారిచూసి అదోలా ఒక్క చిరునవ్వు నవ్వి అన్నది అరుణ "ఇవ్వాళ నే రావటం లేదు సావిత్రి"

"అదేమిటే? వల్లకాదు"—ఖచ్చితంగా చెప్పింది సావిత్రి

"ఈ పనులు కాలేదనా?"— కోమలగా సుందరి కళ్ళు తిప్పింది.

"మేము కూడా తలా ఒక పని చేస్తాం"—తీరా సవరించేసింది కమల.

"ఈ కాకర కాయలు కూరకా? కావప కయ అలా? ముక్కలు తరగమంటావా?, పొట్టచీల్చి ఉప్పూ, కారం దట్టించమంటావా?"—గోడ కానించివున్న పీట వాల్చుకు కూర్చుని సిద్ధమయింది శ్యామల

కుంపటిమీది అన్నపు గిన్నె క్రిందకుదించి అన్నది అరుణ "మీరంతా క్షమించాలి"





అందరూ ఒక్కసారి నోళ్ళు తెరిచి చెవులు రిక్కించారు

ఈ ఒక్క రోజుకూ—"

కారణం?"

'ఉందిగా

'చెప్పకూడదూ?

మేం వినకూడదా?

'కాంతం ఎంత నొచ్చుకుంటుందో తెలుసా?"

'నువ్వురాకపోతే మేం కూడా వెళ్ళం

'ఇంకో నిమిషంవుంటే—కాంతం అమాంతం బయలుదేరివస్తుంది

మా తల్లివికదూ మీరు వెళ్ళండి.. "

సావిత్రి గడ్డం పట్టుకుంది అరుణ

తల్లీలేదూ జాబిల్లీలేదూ నువ్వు బయలు దేరడమే అవశ్యకర్తవ్యం సావిత్రి శాసించింది.

గుప్పెడు బొగ్గులుతీసి కుంపట్లోవేస్తూ 'ఇవ్వాల్టికి నన్ను క్షమిస్తే—మీ కాళ్ళు పట్టుకుంటాను —ప్రార్థనా పూర్వకంగా అన్నది అరుణ

కాళ్ళు పట్టుకున్నా కంఠం పట్టుకున్నా కదిలేదిలేదు అని చాప పరిచింది శ్యామల డిప్యూటీ లీడరు అందరూ కూర్చున్నారు అక్కడే పేరంటం లా

ఇవి చేతులుకావు యివ్వాల్టికి తప్పదు' అరుణ ముందుకు అడుగువేసి శ్యామల దగ్గరకు వచ్చి చేతులు పట్టుకుంది

ఛీ ఛీ—ఏమిటే అరుణా నీ మసిచేతులతో చిమ్మనలేక పొగపెట్టినట్లు— చేతులమీద ముద్రలు పడ్డ మసినిచూస్తూ మొహం ముడుచుకుంది శ్యామల

ప్చ్ ప్చ్ మరిచిపోయివానే శ్యామలా ' అంటూ బకెట్‌తో నీళ్ళు తెచ్చింది అరుణ

ఆ బక్కెట్లోనే చేతులు కడుక్కుని తన సెంటు పూసిన రుమాలుకు ఎక్కడ వాసన తరుగు

(44 వ పేజీ చూడండి)

# ఫ్రాకు డిజైనులు






1. కాలరు కుట్టటానికి మొదట దీర్ఘ చతురస్రాకారంలో వెడల్పాటి ముక్కలు రెండు కత్తిరించుకోవాలి తర్వాత అడుగుభాగంలో, ప్రక్కలా వంపుగా కత్తిరించి ఆ రెండు ముక్కలను క్రిందిభాగం తప్ప మిగతా అంతా అతికెయ్యాలి

2 'బౌ' కుట్టటానికి కూడా దీర్ఘ చతురస్రాకారపు ముక్కలు రెండు కత్తిరించుకోవాలి ఆ రెంటినీ అన్ని వేపులా అతికేసి, మధ్యభాగంలో దారంతో పోగుతీసి దగ్గరగా లాగాలి, మీదన చదరం ఆకారంలో చిన్న గుడ్డను మడచి 'బౌ' మధ్య భాగం మీదుగా పోనిచ్చి అడుగున ఆ రెండు కొసలు అతకాలి

3 '2' లో మాదిరిగా 'బౌ'ను కుట్టాలి క్రింద వ్రేలాడే వాటిని తయారుచేయటానికి మీది 'బౌ' అంతసైజులో కాని, అంతకన్నా పెద్దసైజులో కాని రెండు 'బౌ'లు కుట్టాలి తర్వాత ఆ రెండిటనీ 'బౌ' మధ్యభాగంలో అడుగున పెట్టి అతకాలి

# కర్ణాభరణాలు

మందరపు లలిత

స్త్రీలు చెవికి పెట్టుకొనే అలంకారాలను అవలోకించి చూస్తే చిన్న చెవికి ఎన్ని అలంకారాలో అనిపించకమానదు

సాధారణంగా చెవికి దుద్దులు పెట్టుకోని తెలుగు వనిత అరుదు ఆ దుద్దులు మాత్రం ఒక రకమా ? ఏడు రాళ్ల దుద్దులు వెనకటినుంచి వాడుకలో వున్నవే పోతే ఒంటిరాయి దుద్దులు, నక్షత్రం, కళావరు దుద్దులు, గుండ్రని రాళ్ల దుద్దులు ముద్దులొలుకుతూ ఉంటాయి చేప అక్కుల, మామిడిపింధె దుద్దులు చూడ ముచ్చటగా ఉంటాయి

రాళ్లదుద్దులు ధగధగ మెరుస్తూ మనసు మురిపిస్తూ ఉంటాయి రాళ్లలో కూడా రకరకాల రంగులవి ఉంటవి కెంపులు, వజ్రాలు, నీలాలు, రవ్వలు, ముత్యాలు మొదలైన ఖరీదైన రత్నాలు పొదిగిన దుద్దులు ఎంతో కాంతివంతంగా ప్రకాశిస్తూ ఉంటాయి

రాళ్లు లేకుండా కేవలం బంగారంతో, రకరకాల డిజైన్లతో దుద్దులు చేయించుకోవచ్చు

సర్పాకృతిలోని నాగపత్తులు చెవికి సొగసు చేకూరుస్తాయి

బెంగాలీ రింగుల్లో హుందాతనం తొంగి చూస్తూ ఉంటుంది పేరు బెంగాలీకి చెందినవే అయినా బెంగాలీ వనితలకు మాత్రమేనని బెంగ పెట్టుకోకండి ! మనసున్న మగువలంతా రింగులు సింగారించుకోవచ్చు సాదా రింగులు, మువ్వలు చెక్కిన రింగులు, రాళ్ల రింగులు, ఫోల్డెడ్ రింగులు మొదలైన సాటిలేని రకాలెన్నో ! చెవిని యీ రింగులు వూగిసలాడుతుంటే చూడ సొగసుగా ఉంటుంది ఫాషనుగా కూడా ఉంటుంది

నెల్లూరువేపు వాళ్లు బంగారంతో కాళీ మట్టెల్లాగ రెండు, మూడు చుట్టలు చుట్టించుకుని చెవులకు పెట్టుకుంటారు అవి ఎంత బరువో చెప్పలేం ఆ బరువుకు చెవి కన్నాలు విపరీతంగా సాగిపోతాయి ఒకోసారి చెవి తమ్మి తెగిపోతూ ఉంటుంది కూడా

చెవి కన్నాలులేని వాళ్లు దుద్దుల సరదా తీరే మార్గం లేదని విచారించ నక్కరలేదు వరికోసమే స్టడ్స్ అవతరించాయి వెనకాతలి క్లిప్పు చెవి తమ్మిమీద పెట్టి నొక్కితే గట్టిగా పట్టుకుని నిలబడుతుంది

చెవికి తగిలించుకునే మరో ఆభరణం లోలకు దానిని మొదట్లో ఇంగ్లీషువారు 'లవ్—లాక్' అని నామకరణం చేశారట అది రానురాను లోలకుగా మారింది. ప్రేమకు దానికీ ఎలాంటి సంబంధమున్నా, లోలకులు పెట్టుకున్న లలన మాత్రం లేడీగా ఉండటం నిజం అయినా ఎందుకో వాటిని ప్రస్తుతం ఫాషను కాదని వెనక్కి నెట్టేశారు

ఎనామిల్ లోలకులు, చక్రాల లోలకులు, వేపకాయ లోలకులు, రాళ్ల లోలకులు — ఎన్ని రకాలో ! ఏడాది లోపుగా ఆడపిల్లలకు రాగి కాడలు పెట్టి చెవులు కుట్టిస్తారు బంగారంతో తేలిగ్గా చిన్న లోలకు చేయించి పెట్టడం కూడా ఉంది వేపకాయ లోలకులు చిన్న పాపల చెవులను వ్రేలుతూ ఉంటే చూడ ముద్దొస్తాయి

ఈ లోలకులన్నీ ఒకెత్తు, జూకాలు మరో కెత్తు వాటిలో అందం దోబూచులాడుతూ ఉంటుంది ఛత్రంలాంటి ఆకారానికి క్రింద మువ్వలు చిత్రంగా శోభిస్తుంటాయి క్రింద వ్రేలాడే మువ్వలను ముత్యాలతో చేయించుకుంటే మనోహరంగా ఉంటుంది మధ్యలో బుట్టమీద రకరకాల డిజైన్లు చెక్కుతారు ప్రతిదానిలోనూ చక్కని శిల్పం, సౌందర్యం వెల్లివిరుస్తుంది. మరొక రకంలో, మధ్యలో పెద్ద రాయిని ఉపయోగించి చేస్తారు మరి కొన్నింటిలో ఒకదాని క్రింద మరొకటి చొప్పున రెండు మూడు పిల్ల జూంకీలు ఉంటాయి

ముఖ్యంగా లోలకులు రెండు రకాలు

ఎపుడూ ఇంతే—16

శంకర్









## కర్ణాభరణాలు

లోలకు రింగు దుద్దులో దూర్చి పెట్టుకునేవి దుద్దు అవసరం లేకుండా చెవి కన్నంలో కొక్కెం దూర్చుకునేవి కొన్ని చిన్నపిల్లలు వస్తువులు పోగొట్టుకుంటారనే భయంతో ఆ కొక్కెలను రాకుండా చుట్టించేస్తారు

లోలకులు మరీ పొడుగ్గా ఉండటం కూడా ప్రస్తుతం ఫాషనులాగే తోస్తున్నది. ఇటీవల ఒక సినిమా నటి భుజాలను తాకే లోలకులు పెట్టుకుని వచ్చింది అతిశయోక్తికాదు సుమండీ, అక్షరాలా నిజం ! ఆ నటీమణి తల అటూ, యిటూ తిప్పుతుంటే తలతోపాటు అంతలేసి లోలకులు వింతగా వూగుతూ ఉంటే ఎంత బాగుందను కున్నారు ! పోనీ ఆవిడ అడుగుజాడల్లోనే నడిచి అలాటి పొడుగుపాటి లోలకులు చేయించు కుందామన్నా కాస్త కూస్త అవుతుందా ? ఎలాగో యాతనపడి చేయించుకుని పెట్టుకున్నా ఎవరూ హర్షించరు అందుకే మామూలువాళ్ళు ఎవరన్నా లోలకులు పెట్టుకో దలుచుకుంటే ఒక అంగుళం పొడవు దాటనివ్వగూడదు.

ఎంతో పొట్టిగా పెట్టుకోవటం కూడా ఒక ఫాషను ఆమధ్య ఎవరు చూసినా జూకాలు, మీదన అట్టే రింగులు లేకుండా పొట్టిగా పెట్టుకునే వారు

ఇదివరలో మగపిల్లలు కూడా తప్పనిసరిగా చెవులు కుట్టించుకునేవారు చెవులకు కొందరు దుద్దులు పెట్టుకుంటే, మరికొందరు కాడలు పెట్టుకునేవారు మనం రింగులంటే, వాళ్ళు పోగు లనేవారనుకోండి !

చెంపస్వరాలు ఇదివరలో వాడుక చేసేవారు ఇప్పటికీ వాటిని పాటకపుజనం పెట్టుకుంటూనే ఉన్నారు అవికాకుండా చెవి చుట్టూరా చిల్లులు పొడిపించి చిన్న చిన్న కాడలు తగిలించుకుంటారు

ఈ ఆభరణాలన్నింటికీ ఖరీదైన బంగారాన్నే ఉపయోగించాలనే నియమం ఎక్కడా లేదు ఇత్తడి, వెండి, గిల్టువి— శక్త్యానుసారం వీటితో వేడుక తీర్చుకోవచ్చు దుద్దుల సీలలు సాధారణంగా తిరిగిపోయి ఎక్కడో పడిపోతూంటాయి అందుకే చాలామంది ముందు భాగాన్ని బంగారంతో చేయించి, వెనక సీలను ఏ వెండితోనో చేయించి పడేస్తారు అది పోయినా అంత బాధపడ నక్కర లేదు

అన్నింటికన్నా చవగ్గా ఫ్యాన్సీ వస్తువులతో సరదా తీర్చుకోవచ్చు వాటిల్లో ఎన్నో అందమైన రకాలుంటాయి కాస్త ఖరీదు ఎక్కువైనా దంతపు దుద్దులు చెవులకు వింత కాంతి నిస్తాయి బంగారంకన్నా తక్కువ రకమే అయినా, అందంలో చెక్కు చెదరనివి ఫ్యాన్సీ సరకుల్లో కనపడే లాలిత్యం నాజూకుతనం బంగారపు వస్తువుల్లో కూడా కనపడవు అక్క వెనకోమాటు వెగ్గిబిషన్‌లో కొనుక్కున్న వెండి సాలెపురుగు లోలకుల్లో ఎంత నాజూకుతనం ఉట్టిపడుతున్నదో ఇప్పటికీ కళ్ళకు కట్టినట్టు కనపడుతుంది ★



# వనితా వాణి

## ఎడ్వాన్సు బుకింగు

పద్మశ్రీ గారు వ్రాసిన "ఎడ్వాన్సు బుకింగ్" చదివాను చాలా బాగుంది. ఆవిడ అన్నట్లు అడ్డాలలో బిడ్డలనే కాదు గర్భంలో పెరుగుతూన్న బిడ్డలనూ, యింకా కొన్ని యేళ్లకి పుట్టబోయే శిశువులను కూడా ఎడ్వాన్సు బుకింగ్ చేసేస్తారు మన పెద్దలు దీని ఫలితం మాత్రం ఎక్కడో తప్ప అంతా పద్మశ్రీగారు చెప్పినట్లే అవుతోంది అదీకాక చిన్నప్పుడే మొగుడూ—పెళ్లాం బుకింగ్‌లు చేసేస్తే వాళ్లు పెద్దయిన తర్వాత కొన్ని అనర్థాలు కూడా కలుగుతాయి ఆ పిల్లలు పెద్దవాళ్లయిన తర్వాత పరిస్థితులు అనుకూలించక ఆ పెళ్లిళ్ల జరుగకపోవచ్చు ఇహ అప్పుడు రెండు కుటుంబాల మధ్య శత్రుత్వమే మిగుల్తుంది ఒకవేళ జరిగినా "దగ్గర వాళ్లకే దగ్గులు జాస్తి" అన్నట్లు తయారవుతుంది మేనరికమే జరిగిందనుకోండి ఒకవేళ ఆ పిల్లవల్ల ఏద్తైనా పొరబాటు వస్తే యింక అత్తగారు "అసలు దీని సంగతి తెలియదా ? దీని తల్లి సంగతి తెలియదా? అన్నీ ఆ తల్లి గుణాలేనూ ! మనకు తెలిసే ఏట్లో దూకాం" అని మొదలుపెడ్తుంది కొన్నిచోట్ల ఎదురు మేనరికాలు (మేనమామ కొడుక్కి ఆడబిడ్డ కూతురికి) కూడా అవడం కద్దు అక్కడ అత్తగారి వరస "నీ తల్లీ, నీ అమ్మమ్మా నన్ను పట్టుకు కాల్చుకు తిన్నారు నానా అగచాట్లూ పెట్టారు కాబట్టే నువ్వు నాచేత పడవలసిందే" అని శంకామీద దెబ్బకొట్టి మరీ చెప్తుంది సన్నిహిత బంధువర్గాలవల్ల వాళ్ల వాళ్ల విలువలు నశిస్తాయి ఒకరిలోపాలు ఒకరు వేలెత్తి చూపించుకుంటారు మేనరికపు దంపతులు అన్యోన్యంగా ఉన్నా (కొన్ని కుటుంబాలలో) వియ్యాలవారి యుద్ధాలు మాత్రం ఘోరంగా ఉండి దంపతులకు మన శాంతి లేకుండా చేస్తాయి.

నాకు తెలిసినవాళ్లు ఉన్నారు వాళ్లబ్బాయికి యిష్టం లేకపోయినా తల్లితండ్రులు బలవంతంమీద ఆ అబ్బాయికి మేనరికం చేసేశారు కానీ ఫలితం ఆ అబ్బాయి ఒక క్రిష్టియన్ అమ్మాయిని అట్టే పెట్టుకున్నాడు మరోచోట ఒకబ్బాయికి బలవంతంమీదే మేనకోడలికి కట్టబెట్టారు కానీ దాంపత్యం ఏమీ బాగులేదు ఎడమొహం పెడమొహం అబ్బాయి మేడమీద, అమ్మాయి క్రింద హాల్లో అబ్బాయిగా రంటేనే అమ్మాయికి హడల్ ఎందుకు వచ్చిన రగడ చెప్పండి యిదంతా

అసలు మన యీ మేనరికపు వివాహాలను బెంగాలీవాళ్లు విని ఎంతో ఆశ్చర్యపోయి, పరిహసిస్తారు కూడా వాళ్లలో మేనరికాలూ, సన్నిహిత బంధువర్గాలలోనే కాక, తమ వూరిలోని సంబంధమైనా సరే చేసుకోరు ఎంతో దూరసంబంధాలే చేసుకుంటారు అంటే పెళ్లిచూపుల వరకూ ఒకరి మొహాలు ఒకరికి తెలియవన్నమాట పెండ్లయిన తదుపరి ఆ దంపతులూ, వియ్యాలవారూ (ఒకరి లోటుపాట్లు ఒకరికి తెలియవు కనుక) ఎంతో అన్యోన్యంగా, ఆప్యాయంగా ఉంటారు మేనరికపు దంపతులు అత్రోవన వెళ్తుంటే చూసి ముసిముసి నవ్వులు నవ్వుకుంటారు

ఉ విమలా పట్నాయక్ (ఖర్గపూర్)

*   *   *

నేటి 'సమాజం' లో మేనరికాలవల్ల జరిగే కష్టనష్టాలు గురించి పద్మశ్రీ గారు ఎడ్వాన్సు బుకింగు వ్యాసములో చక్కగా తెలిపారు మేనరికాలవల్ల అనేక సాధకబాధకాలు ఉంటాయి ఈమాటతో నేను తప్పక ఏకీభవిస్తాను 'నేరేడుపండ్ల' లో పుర్గుగులున్నాయి, మేనరికంలో గతుకు లున్నాయి, అనే సామెత అక్షరాలా యదార్థం మేనరికంవల్ల చెడ్డ మా బాబాయి గురించి వ్రాస్తాను మా బాబాయికి ఒక్కర్తే కూతురు చిన్నప్పట్నుంచీ మేనత్త కొడుకుకి ఇద్దామని అనుకొనేవారు మా మేనత్తగారిల్లు కూడా ఆ ఊళ్లోనేలెండి రెండు కుటుంబాలు ఒకే కుటుంబంలాగా మెలిగేవారు కాని మా బాబాయి కూతురు పెళ్లీడు కొచ్చాక బాబాయికి కొడుకు పుట్టాడు తరువాత మా మేనత్తగారి మనసు మారిపోయింది ఒకరోజు మాటలసందర్భంలో 'అన్నయ్యా ! నీ కూతురికి ఏన్తైనా సంబంధాలు చూస్తున్నావా ?' అంది బాబాయి తెల్లబోతూ ! అదేమిటి చెల్లెమ్మా అలాగ అంటావ్ సుగుణ పుట్టినప్పటినుంచీ నీ కోడలని కదా అనుకొన్నాం' అని తిరిగి ప్రశ్నించాడు 'దానికేముందిలే అనుకొన్నవన్నీ జరగాలని లేదుగా నాకుమాత్రం మేనగోడలని చేసుకోవాలని లేదంటావా ? మీ మేనల్లుడేమో చదువుకొన్న పిల్లనే చేసుకోవాలని ఒక పంతం పట్టాడు నన్నేమి చేయమంటావు అన్నయ్యా !' అంది కొడుకుమీద భారంవేస్తూ ఆ మాటకు బాబాయి చర్రుమంటూ లేచాడు 'నీవే కదా సుగుణ చదువు మాన్పించింది లేకపోతే సుగుణ బి ఏ ప్యాసు అయ్యేదికదా' అన్నాడు నాకేం తెలుసురా అన్నయ్యా వాడి బుద్ధి ఇలా మారుతుందని వాడి కిష్టంలేని పెళ్లి నే నెలా చేసేది' అంది దానికి బాబాయి మండిపడుతూ ఛీ. ఎంతపని చేశావు. నీపాటి సంబంధం రాకపోదులే అనవసరంగా అమ్మాయి చదువు పాడుచేశావు అని నాలుగు చివాట్లు పెట్టాడు ఇరువురికీ మాటా మాటా పెరిగి 'ఛీ! నీ గడప తొక్కితే ఒట్టు' అంటూ వెళ్లిపోయింది నాటికీ నేటికీ ఆ రెండు కుటుంబాల మధ్య రాకపోకలు లేవు తరువాత మేనత్తగారి కొడుకుకి వివాహం అయింది. వివాహానికి వచ్చిన ఒకాయన, మా బాబాయితో 'మీ సంబంధం తప్పిపోవడానికి కారణం మీ అబ్బాయి జననం' అని చెప్పాడు ఇలా ఉంటాయి మేనరికాలు వారి స్వార్థంకోసం ఒక అమ్మాయి జీవితం పాడుచేశారు వారికేం చక్కగా కొడుకికి వివాహం జరిపించారు మా బాబాయిమాత్రం అతి కష్టంమీద కూతురువివాహం అయింది అనిపించాడు మేనరికం ఉందికదా అని సంబంధాలు తిరగ్గొట్టి తుదకు కాకపోతే అనేకబాధలుపడి వివాహం జరిపించాడు బాబాయి ఇంతకీ నే చెప్పొచ్చే దేమిటంటే మేనరికం ఉందికదా అని సంబంధాలు చూసుకోకపోతే ఇలాంటి అనర్థాకాలే జరుగుతాయి

డి సుభద్రా క్రిష్ణవేణి (చిట్టివలస)

*   .   *   *

పద్మశ్రీ గారు వ్రాసిన 'ఎడ్వాన్సు బుకింగు' చదివేను బాగుంది కాని, "సాధారణంగా ప్రతి ఇంట్లోను ఆడపిల్లలపాలిట ఎవరో ఒకరు దాపురించే వుంటారు" అని వ్రాశారు తన అదృష్టం కొద్దీ—తనకు దొరికిన 'మామయ్య' ను ఆధారంగా తీసుకొని, ఆ అభిప్రాయాన్ని సమాజంమీద రుద్దటం—సమంజసంగా లేదు

అడవి నాగమణి (ఏలూరు)

## గారాబం

'గారాబం' అనే శీర్షిక క్రింద-టి వి సీతారామమ్మ గారు వ్రాసిన అనుభవపూర్వకమైన విషయాలు చాలా ఉత్తమంగా ఉన్నాయి పిల్లల పెంపకంలో తల్లిదండ్రుల అశ్రద్ధవల్ల ఏవిధంగా వృద్ధిలోకి రాక చెడిపొయ్యేది, వారిని మంచి త్రోవలోకి తీసుకొచ్చుటకు ఎటువంటి ప్రయత్నము చేయవలసినది బాగా వ్రాశారు నిజంగా ఆమె వ్రాసిన రీతిగా పిల్లలయందు శ్రద్ధచూపించినట్లయితే వారు అత్యుత్తములుగా తయారవుతా రనుటలో సందేహము లేదు

కె అంబుజమ్మ (హైద్రాబాదు)

## గృహపరిశుభ్రత

జయశ్రీ గారు వ్రాసిన "గృహపరిశుభ్రత" అనే వ్యాసములో చెప్పినట్లుగా ఎవరిఇల్లు వారు పరిశుభ్రముగా వుంచుకొంటే చూడడానికి హాయిగా ఉంటుంది ఇంటిలోని ప్రతి వస్తువు ఎక్కడ తీసినది, అక్కడే వదిలేయకుండా, యథాస్థానములో వుంచి రోజు రోజుకి శుభ్రముగా ఉంచడము ఇంటిల్లపాదికి ఆచరణలో ఉండేటట్లుగా చూసుకోవాలి

డి శారద (భిలాయ్)



"నాకు ప్రియమైనపండు — మామిడిపండు నా ప్రియమైన పండ్లరస పానీయం ఫ్రూట్‌నిక్ ఒక్కటే!"

— పద్మిని




ఫ్రూట్‌నిక్ పరిశుద్ధమైన తాజా పండ్లరసం. అది రుచికరముగానూ మనోహరంగానూ, త్రాగుటకు ఎంతో ఉత్సాహంగానూ వుంటుంది చల్లబరచి త్రాగితే ఇంకా బాగుంటుంది.

మామిడి, ద్రాక్ష, పైనాపిల్, ఆరంజి, ఆపిలు — అన్నీ ఎంతో రుచిగా ఉంటవి

# fruitnik




ఫ్రూట్‌నిక్‌లో గ్యాసులేదు

ఫ్రూట్ నిక్ ప్రాడక్ట్స్, పూనమల్లి హైరోడ్డు, మదరాసు - 10

EP

* కే. ఎ. నటరాజన్, ప్రొప్రయిటర్, కళా పబ్లిసిటీస్, శెవాపేట, సేలం-2 * కే ఎ అబ్దుల్ హమీద ఖాన్, 9, బజార్ వీధి, చిదంబరం. * ఎ వి సత్యనారాయణ, మిథిల మెటాలిక్ ఇండస్ట్రీస్, కుంభకోణం * ఎమ్మెల్ & కంపెనీ, 6/88, ట్రిచిరోడ్, కోయంబత్తూరు * ఎస్ ఎస్ బాలకృష్ణన్, "శెల్వమళిగై" సౌత్ అవనిమూల వీధి, మధురై * టి ఆర్. శ్రీరాములు చెట్టియార్, కృష్ణభవన్, ట్రిచ్చి * ట్రెడ్స్, 55, అమ్మన్ సన్నిధి, కారైకుడి-1




సాయంకాలం కాళిదాసు వంచలో కుర్చీ వాల్చు కుని కూర్చుని వున్నాడు అతని చేతిలో దిన పత్రికవుంది కాని అతని మనస్సెక్కడోవుంది. ప్రహారీ గోడమీద ఒక కాకి కూర్చుని అరుస్తున్నది. వంచలోనుంచి కనిపిస్తున్న ఆకాశభాగంలో మొగలి పొద ఆకారంలోవున్న దొక మబ్బు

వంచలో చివరగా నుంచుని ఒక పదమూడేళ్ళ కుర్రవాడు 'మేష్టారూ' అని పిలిచాడు కాళిదాసు తలత్రిప్పి చూసేసరికి ధర్మ వైద్యశాలలో పని చేసే సుబ్రహ్మణ్యంకొడుకు చేతిలో పుస్తకాలతో నిలబడి వున్నాడు కాళిదాసు వాడితో "చదువు కునేందుకు వచ్చావా? ఆ ముందు గదిలో చాప వుంది తీసుకురా" అన్నాడు వాడు వెళ్ళి చాప తీసుకునివచ్చి వరండాలో పరుచుకుని కూర్చున్నాడు. కాళిదాసు "నీ పేరేమిటి?" అని అడిగాడు వాడు తలవంచుకుని "గోవిందు" అని జవాబు చెప్పాడు.

కాళిదాసు తర్వాత కొద్దిసేపు వాడికి యింగ్లీషు పాఠం చెప్పాడు పొద్దుగూకుతూవుండగా అతడు పాఠంఆపి గోవిందుతో "నేను అలావెళ్ళి ఒక చిన్న పని చూసుకుని త్వరగా వచ్చేస్తాను అందాకా యీ పాఠం చదువుకుంటూ ముందు గదిలో కూర్చో. కాస్సేపట్లో మరో యిద్దరు పిల్లలు వస్తారు. నేను రావడం ఆలస్యమైతే వారు వచ్చిన వెంటనే నువ్వు యింటికి వెళ్ళు మళ్ళీ భోజనంచేసి రాత్రికి రా" అంటూ ముందు గదిలోకివెళ్ళి దీపం వెలి గించాడు గోవిందు పుస్తకాలూ చాపా తెచ్చుకుని ముందు గదిలోకి వచ్చాడు

కాళిదాసు దుస్తులుధరించి వీధిలోకివచ్చి శంకరశాస్త్రిగారియింటివైపు నడిచాడు అప్పుడే వీధుల్లో దీపాలు వెలిగాయి చలిగాలి 'రివ్వు'న వీస్తున్నది ఎవరో బిచ్చగాడు ఒక చిన్న పిల్ల చెయ్యి పట్టుకుని నడిపిస్తూ వుండగా, చేతిలో కర్రను నేలమీద తాటించుకుంటూ నడుస్తూ "పుట్టు గుడ్డిని బాబూ ఒక్క కబళం వెయ్యి తల్లీ" అని అరుస్తున్నాడు

శంకరశాస్త్రి వంచలో కూర్చునివుండి చిన్న పిల్లకు పాఠం చెబుతున్నాడు కాళిదాసునుచూసి "రావయ్యా! ఇలా దోవతప్పి వచ్చినట్టున్నావే" అన్నాడు కాళిదాసు కూర్చుంటూ నవ్వి "లేదు! అను కున్న చోటికే అనుకున్న దోవనే వచ్చాను ఇంట్లో కూర్చుంటే తోచడంలేదు వంటా వార్పూ యిందా కనే అయిపోయింది ఒక కుర్రవాడొస్తే వాడికి పాఠం చెప్పి చదువుకుంటూ కూర్చోమని యిలా వచ్చాను" లన్నాడు

ఆయన దీపం మరి కాస్త పెద్దదిచేస్తూ, "నేను చెప్పిన విషయం ఏమైనా ఆలోచించావా?" అని అడిగాడు

"అది చెబుదామనేకదా నే నిలా బయలుదేరి వచ్చాను? ఏదీ మీ రుక్మిణిని కేకవేసి ఫిడేలు తీసుకు రమ్మనండి ఎక్కువసేపు వద్దు నాలుగు కీర్తనలు చాలు" అన్నాడు కాళిదాసు

శంకరశాస్త్రి నవ్వి "మొత్తానికి అంచగాండివే నువ్వు అలా ఆ గదిలోకిపోదాం ధా" అంటూ లేచి "అమ్మాయ్! ఆ ఫిడే లిలా పట్రా అమ్మా" అని కేక వేశాడు

(40-వ పేజీ చూడండి)

## జరిగిన కథ

కాళిదాసు ఇంటి వరండాలో ఆ తెల్లవారుజామున ఎవరో నెలన్నా నిండని పసిపిల్లవాణ్ణి విడిచి వెళ్ళారు. భార్య మరణంతో, వృద్ధురాలైనతల్లి తప్ప వేరే ఆపెదిక్కూ లేని కాళిదాసు ఆ అనాథ బాలుణ్ణి పెంచడానికి ముందు సంకో చించినా, తరువాత సిద్ధపడి పని మనిషి అప్పలమ్మకు ఆ బాధ్యత అప్పగిస్తాడు. స్నేహితుడు పట్టాభి, మామగారు ఎంత చెప్పినా కాళిదాసు రెండో పెళ్ళి చేసు కునేందుకు ఇష్టపడడు. శంకరశాస్త్రి తనకూతురు రుక్మిణికి సంబంధం చూసి పెట్టమని కాళిదాసును అడుగుతాడు జానకీ రామారావు కాళిదాసు చిన్న నాటిస్నేహితుడు. దొంగనోట్లుఅచ్చువేసిన నేరానికి అతణ్ణి పోలీసులు అరెస్టుచేస్తారు.



మహేశ్వరీ పిక్చర్స్‌వారి “అమూల్యకానుక”లో పద్మిని.



సావిత్రీ ఫిలింసువారి చిత్రంలో గుమ్మడి.



“వరలక్ష్మీవ్రతం”లో కృష్ణకుమారి.



ఎం. ఎస్. ఎం. మూవీస్ “కొరడావీరుడు”లో జానకి.

## సంక్షిప్త వార్తలు

### క్రీడా చిత్రోత్సవంలో పాక్‌కు బహుమతి

పాకిస్థాన్ చలనచిత్ర శాఖ నిర్మించిన 'ఫోకస్ ఆన్‌స్పోర్ట్' అన్న క్రీడా చిత్రానికి ఇటీవల రోమ్‌లో జరిగిన అంతర్జాతీయ క్రీడా చిత్ర ప్రదర్శనలో ప్రథమ బహుమతి లభించింది

### బాలరామాయణంమీద డాక్యుమెంటరీ

బాలరామాయణాన్ని డాక్యుమెంటరీ చిత్రంగా రూపొందించటానికి ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం ప్రయత్నిస్తోంది ఈ చిత్రం షూటింగు అలహాబాదులో జరుగుతుందట ఈ చిత్రంలో నటీనటులు అందరు పదునాలేళ్లకులోపు వయస్సువా



'వరలక్ష్మీ వ్రతం'లో సత్యనారాయణ



మాతృశ్రీ పిక్చర్స్ దేశద్రోహి లో బి యస్ సరోజ, ప్రేమ్‌నజీర్



రాజకమల్ వారి పూల్ ఔర్ కలియాఁ లో ఒక దృశ్యం

లు. ప్రసిద్ధ దర్శక నిర్మాత అనుకూల బనర్జీ పర్యవేక్షణ క్రింద ఈ చిత్ర నిర్మాణం జరుగుతుంది

## విదేశాలకు పంపే చిత్రాలు: మహబూబ్ ఖాన్ సలహా

వ్యాపారరీత్యా విజయవంతమైన చిత్రాలను అంతర్జాతీయ చిత్రోత్సవాలకు పంపటం భారతదేశం తన పరువు ప్రతిష్ఠల దృష్ట్యా మానుకోవాలని ప్రముఖ దర్శకుడు నిర్మాత శ్రీ మహబూబ్‌ఖాన్ ఇటీవల బొంబాయిలో అన్నారు మాస్కోలో జరిగిన అంతర్జాతీయ చిత్రోత్సవాలలో న్యాయ నిర్ణేతగా ఉండి ఇటీవల బొంబాయికి తిరిగివచ్చిన సందర్భంలో ఆయన ప్రసంగిస్తూ అన్నారు

అంతర్జాతీయంగా మన్ననల పొందగలందులకు తయారుచేసిన చిత్రాలనే ఎన్నిక చేయాల్సి ఉంటుంది ఈ విషయం చిత్రోత్సవాలకు చిత్రాల ఎన్నికతోను సంబంధంగల నిర్మాతలు గ్రహించాలి కూడా శ్రీ మహబూబ్‌ఖాన్ అన్నారు

మాస్కో చిత్రోత్సవంలో ప్రదర్శితాలైన వివిధ చిత్రాలపై తమ అభిప్రాయం వివరిస్తూ శ్రీ మహబూబ్‌ఖాన్ భారతీయ చిత్రాల్లో నటనానైపుణి, సాంకేతిక నైపుణ్యం ఉన్నతమని అన్నారు.

చిత్ర విజయానికి నటీనటులు అవసరం లేదని మాస్కోలో ప్రదర్శితాలైన వివిధ చిత్రాలు నిరూపించాయని కూడా శ్రీ మహబూబ్‌ఖాన్ అన్నారు

## డాక్యుమెంటరీ చిత్రోత్సవం

ద్రిబూఘర్‌లో డాక్యుమెంటరీ చలన చిత్రోత్సవం ప్రారంభం కానున్నది సెప్టెంబరు 2 3 తేదీల్లో జరుగబోయే ఈ ఉత్సవాన్ని కేంద్ర సమాచారశాఖ మంత్రి డా బి వి కేస్కర్ ప్రారంభిస్తారు

ఈ సందర్భంలో రాష్ట్ర సమాచారశాఖ ఆధ్వర్యాన డాక్యుమెంటరీ చిత్రాల ప్రచారం అన్న విషయంపై ఒక చర్చా సదస్సు కూడా ఏర్పాటవుతోంది ఈ సదస్సుకు అధ్యక్షులుగా ఉండవలసిందిగా ప్రముఖ నటులు శ్రీ బాలరాజ్ సహానీ ఆహ్వానితులైనట్లు తెలిసింది

## బాలల చిత్రంలో శ్రీ మొరార్జీ దేశాయ్

కేంద్ర ఆర్థికమంత్రి శ్రీ మొరార్జీ దేశాయ్ బాల చలనచిత్ర సంఘం నిర్మిస్తున్న 'బాపూనేకహాథా' అన్న చిత్రంలో కన్పించబోతున్నారు

ఈ చిత్రంలో పోలీసుల బారినుండి తప్పించుకోవాలని ప్రయత్నించె తుంటరి బాలులకు గాంధీజీని గూర్చి శ్రీ దేశాయ్ ఉపన్యాసం ఇస్తారట. దాంతో ఆ పిల్లకాయలు బుద్ధిమంతులౌతారట

## చలనచిత్ర గాయకులకు రాయల్టీ

నేపథ్య గాయకులందరికీ వారి రికార్డుల అమ్మకంపైన విధిగా కొంత ప్రతిఫలం ఇవ్వాల్సిందిగా నేపథ్యగాయక సంఘం ఇటీవల బొంబాయిలో జరిపిన సర్వసభ్య సమావేశంలో తీర్మానించింది దేశం మొత్తంమీద ఉన్న 75 నేపథ్య గాయకులలో 35 మంది ఈ సంస్థ సభ్యులట

## లండన్‌లో భారతీయ చిత్రోత్సవం

లండన్‌లో ఈ నెల 12 వరకు వారం రోజుల పాటు జరిగిన భారతీయ చిత్రోత్సవానికి రాజకీయ నాయకులు దౌత్యశాఖల ప్రతినిధులు పలువురు హాజరయ్యారు

ఎక్కువ సంఖ్యలో భారతీయ చిత్రాలు ప్రదర్శితమైన కొద్ది ఉత్సవాలలో ఇది ఒకటే భారతీయ చిత్ర సంఘం ఆధ్వర్యాన హంగ్రీ స్టోన్స్ నజరానా ఇన్సానియత్ 'అమరదీప్'' ఛోటీ బహెన్ మెహందీరంగ్ లాగ్యో పరాఖ్ అను చిత్రపట్టాల్ని ఈ వారం రోజులపాటు రాత్రి ఆటలు, మేటనీలు వేసి చూపించారు

(48 వ పేజీ చూడండి)



# బియోవుల్ఫ్

స్వేచ్ఛానువాదం : 'నాగరాజ్'

## జరిగిన కథ

డేనిష్ మహారాజు హ్రోత్గార్ ఒక అపూర్వమైన భవనం నిర్మించి దానికి హియరాట్ అని పేరు పెడతాడు ఆ భవనంలో జరుగుతున్న ఆనంద కోలాహలం గ్రిండల్ అనే రాక్షసుడికి నచ్చక పోవటంవల్ల వాడు హియరాట్ భవనంపై సుమారు పన్నెండు సంవత్సరాలు దాడి జరిపి జనులను చంపితింటాడు వీడి దుండగాలను అరికట్టే ప్రయత్నంలో హ్రోత్గార్‌కు సహాయ్యపడేందుకు హైగ్లిక్ రాజు మేనల్లుడు బియోవుల్ఫ్ కొందరు యోధులతో డేనిష్ రాజ్యానికి వస్తాడు బియోవుల్ఫ్ గ్రిండల్‌తో పోరాడి వాణ్ణి చంపివేస్తాడు.

తెల్లతెలవారుతోంది తూర్పు కొండవైపు నుండి ఉదయభానుడు విజయోత్సాహిని ఆలింగనం చేసుకోటానికి వస్తున్నాడా అన్నట్లు పైకిపైకి వస్తున్నాడు. డేనిష్‌రాజధాని అంతా సూర్యుడితో పాటు ఆనందకోలాహలంతో పొంగిపోతోంది దూరప్రాంతాలనుంచి వీరాధివీరులు గ్రామ గ్రామప్రజలు రాజధానికి తరలివస్తున్నారు

అందరూ హియరాట్‌భవనం చుట్టూ మూగి నుంచున్నారు ఆ రాక్షసు డెలా ఉంటాడో చూడాలని, ఎక్కడికి పారిపోయాడో తెలుసుకోవాలని అందరికీ ఉబలాటంగా ఉంది విజేత బియోవుల్ఫ్, రాక్షసుడి చేతిని, గోళ్లను అందరికీ కన్పించేలాగున ఒక ఎత్తయిన చెట్టుకు వేలాడదీయించాడు భవనం వెలుపల గ్రిండల్ అడుగుజాడలు కన్పించాయి అందరూ ఆ అడుగుజాడలవెంబడి వెళ్లారు ఆ జాడలు అలా పోయిపోయి చిన్నగా ఒక కోనేరుదగ్గరకు తీసుకుపోయాయి ఆ కోనేరంతా ఎర్రగా చూచేందుకు చాలా భయంకలిగించేదిగా ఉంది అక్కడ మాంసపుముద్దలు కూడా తేలుతూ ఉన్నై అది చూచినవారందరికి ఈ భావం తోచింది దుష్టుడు 'గ్రిండల్' నరక యాతన పడి తన పాప ఫలాన్ని అనుభవించేందుకు ఇంకోలోకానికి పోయాడు అతని శరీరం మాత్రం ఖండితహస్తాలతో వివిధగాయాలతో దయ్యాల కూపంలాంటి ఈ అగాధ సరస్సులో ఏమూలో దీర్ఘ విశ్రాంతి తీసుకుంటోంది

ఆరోజుతో తమకు పీడ విరగడైనట్లుగా డేనిష్ పౌరులు సంతోషించారు బియోవుల్ఫ్ సాధించిన ఘనవిజయం అందరికీ తెలిసిపోయింది అందరూ ఆనందోత్సాహాలతో బియోవుల్ఫ్‌ను స్తుతిస్తున్నారు పాటలతో కొంతమంది, మాటలతో కొంతమంది, ఈ రెండూ చేతగానివారు చేతలతోటీ.

'హ్రోత్గార్' మహారాజు బియోవుల్ఫ్ విజయం పట్ల అభినందన సూచకంగా ఒక విందును హియరాట్ భవనంలో ఏర్పాటుచేయాలని ఆజ్ఞాపించారు పనులన్నీ చకచక జరిగిపోతున్నాయి. భవనం చుట్టుపట్ల దారులు శుభ్రం చేశారు మహారాజు వచ్చే దారి కిరుప్రక్కలా డేనిష్ గీట్ జాతి ధ్వజాలను ఎగురవేశారు బియోవుల్ఫ్ గ్రిండల్‌ల పోరాటంలో పాడైపోయిన సామాన్ల స్థానే కొత్తవాటిని ఏర్పాటుచేసి శోభాయమానంగా అలంకరించారు మహారాజుకు తదితర ముఖ్యులకు కూర్చునేందుకు తగిన ఆసనాలు ఏర్పాటు చేశారు

నిర్ణీతసమయానికి మహారాజు హ్రోత్గార్, మహారాణి వెల్తియోవ్, తదితర రాజకుటుంబీకులు, బియోవుల్ఫ్, అతని గీట్ బృందం, పురప్రముఖులు,పలువురు డేనిష్ యోధులుహాజరయ్యారు

మహారాజు హ్రోత్గార్ ఇలా అన్నారు : "మమ్మ ఈ ఆపదనుంచి, దయామయుడైన ఆ భగవంతుడు రక్షించాడు ఆయనకు మన నమోవాకములు బియోవుల్ఫ్ ! నీకు డేనిష్‌జాతి, మేము ఎంతో ఋణపడి ఉన్నాం దాదాపు పన్నెండు సంవత్సరాలుగా మేము, మా డేనిష్‌జాతి దుర్మార్గుడు గ్రిండల్‌మూలంగా ఎన్నోవిధాల కష్టాలు అనుభవించాం కృపాకరుడైన ఆ భగవంతుడు నీరూపంలో మాకు సాయపడినట్లున్నాడు లేకపోయినట్లయితే ఒక మానవునకు ఇంత బలం ఉంటుందా ఈ బలవంతుని గన్న మీ తల్లిగారు నిజంగా ధన్యజీవి ఈరోజునుంచి, నీకూ మాకూ మధ్య వర్ధిల్లుతున్నట్లుగానే, గీట్ జాతికి, డేనిష్ జాతికీ మధ్య సత్సంబంధాలు పెంపొందుతాయని ఆశిస్తున్నాను నీలాంటి దృఢశరీరునికి ఉత్తమోత్తమునకు అవక్రవిక్రమునకు ఆ సర్వరక్షకుడు సకల సౌభాగ్యాలు కలిగించాలనీ, పది కాలాలపాటు కృపాదృష్టితో చూడాలని ప్రార్థిస్తున్నాను భగవంతుడు సంపూర్ణాయువు నిచ్చి దీవించుగాక "

బియోవుల్ఫ్ ఇలా అన్నాడు "మహారాజుల ఔదార్యమే తప్ప నేను పెద్దగా సాధించిందేమీ లేదు ఒకదేశానికి సహాయపడాలని వచ్చిన నేను నా విధ్యుక్తధర్మాన్ని సఫలంగా పూర్తిచేసుకోగలిగాను కాని, ఆ దుర్మార్గుడు గ్రిండల్‌ను ఇక్కడే చంపివేయలేకపోయానన్న విచారంమాత్రం కొంచెంగా నన్ను కించపరుస్తున్నది వాడిక్కడ నుంచి సజీవంగా పోకుండా వుండాలని నా శాయశక్తులా ప్రయత్నించాను కాని దైవ ప్రాతికూల్యంవల్ల, అతడు పారిపోవటాన్ని నిరోధించలేకపోయాను ఐతే ఆ దుర్మార్గుడు ఈపాటికి మరణించిఉంటాడనటంలో సందేహం ఏమీ లేదు అతనికి తగిలిన గాయాలు అలాంటివి చెడుమార్గాన పోయేవారు ఎప్పుడో ఒకప్పుడు తమ పాపాలకు శిక్ష అనుభవించక తప్పదుకదా ! వీడికి అదేగతి పట్టిఉంటుంది ఈరోజునుంచి డేనిష్ రాజ్యానికి గ్రిండల్ పీడ ఉండదు ఈమాత్రం

సహాయపడగల్గినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది''

మహారాజు బియోవుల్ఫ్‌కు విలువైన వజ్రాలు, వస్తువులు, మేలుజాతి గుర్రాలు (బంగారు కళ్లాలతో) ఇంకా ఎన్నో బహుమతులు ఇచ్చాడు

ఈ శుభసమయానికి సూచకంగా విందు జరిగింది చిన్నా పెద్దా భేదంలేకుండా డేనిష్ రాజధాని పౌరులు, యోధులు, అధికారులు విందులో పాల్గొన్నారు ఈ కోలాహలం జరుగుతుండగానే తూర్పుకొండనెక్కిన సూర్యుడు పడమట కొండను పవ్వళించాడు

అమావాస్య వదిలిన చంద్రునికి మళ్లీ అమావాస్య వస్తుందని హెచ్చరికచేస్తున్నట్లుగా తారకలు తళుక్కు తళుక్కుమంటున్నాయి తారకల హెచ్చరిక లెక్కచేయనివిధాన రేరాజు పరుగెడుతున్నాడు ఆనందకోలాహలాలు అణిగిపోయాయి హ్రోత్గార్ మహారాజు, రాణి వెల్త్యోవ్ తమ మందిరాలకు వెళ్లిపోయారు బియోవుల్ఫ్ మహారాజు తన కేర్పరచిన అతిథిభవనంలోకి వెళ్లిపోయాడు గీట్ వీరులకు సాయంగా కొందరు డేనిష్ పౌరులు ఆ రాత్రి హియరాట్‌భవనంలో నిద్రించారు రాత్రే ఇంకొక ఘోరం జరిగింది

* * *

గ్రిండల్‌కు తల్లి ఉంది ఆ రాక్షసికూడా ఈ మారణహోమంలో ఆరితేరినదెయ్యే! అగాధ సరోవరాల అట్టడుగున నివాస మేర్పరచుకొని ఉంది ఎంత రాక్షసి అయినా, దానికి తన సంతానంపైన మమత ఉండటం సహజమేకదా! అతిబల సంపన్నుడైన తనకుమారుని, అందులోను పద్నాలుగేళ్ళ ప్రజాపీడనలో పేరుపొందినవాణ్ణి, ఎవడో తుచ్ఛమానవుడు గాయపరచటం దాని ఫలితంగా గ్రిండల్ సరోవరంలో దిక్కులేకుండా చావటం, ఇవన్నీ కడుపు కోతపెట్టినై ఆ తాపం కార్చిచ్చులాగా వ్యాపించి గంగవెర్రు లెత్తించింది తన కుమారుని మరణంపట్ల ప్రతీకారవాంఛ క్షణక్షణానికి పూరటలేని ఆరడిని ఎక్కువచేసింది ఎలాగైనా ప్రతీకారం సాధించాలన్న కక్షతో 'హియరాట్' భవనంపైకి దండయాత్ర బయలుదేరింది

ఆ రాకాసి మెల్లగా 'హియరాట్'భవనం సమీపించింది ఆ భవనం దగ్గరపడుతున్నకొద్దీ దానికి ఆవేశం పెరగసాగింది భవనంలోపల కొద్దిమంది డేనిష్ సైనికులు, గీట్ వీరులు నిద్రిస్తున్నారు వెంటనే భవనద్వారాలు తెరుచుకొని ఆ రాకాసి లోపల ప్రవేశించింది హాల్లో ఉన్న కత్తులన్నీ మాయం చేసింది డాళ్ళు దాచివేసింది ఈ హడావిడిలో అందరూ లేచారు దీని భయంకరాకృతి చూడగానే అందరు తమ కత్తులు, కటార్ల సంగతే మర్చిపోయారు అందరు దాన్ని తుదముట్టించాలనే ప్రయత్నంలో మాత్రం ఉన్నారు ఎవరికి తోచినవి వారు తీసుకొని ఆ రాకాసి మీదకు విసిరివేస్తున్నారు

ఇప్పు డారాక్షసి తన ప్రాణాలకే ముప్పం వచ్చే స్థితి ఏర్పడింది. తప్పించుకొని పోతూ పోతూ చేతికందిన డేనిష్ సర్దారు నొకణ్ణి ఎత్తుకొని పారిపోయింది తనకొడుకు చేతిని (బియోవుల్ఫ్ చెట్టుకు వ్రేలాడదీయించినదాన్ని), విరిగిన గోళ్లను కూడా తీసుకుపోయింది

అంతకుముందు రెండుగంటలవరకు ఆనంద కోలాహలంతో వున్న భవనంలో, నిరాశ, నిస్పృహలు, భీతి ఆవరించాయి ఇన్నేళ్ళుగా తాము పడ్డ బాధలు తొలగిపోయా యనుకుంటే మళ్లీ దాపురించాయే అన్న విషాదచ్ఛాయలు అందరి ముఖాల్లోను అలుముకుంటున్నాయి ఇప్పుడు రాక్షసి ఎత్తుకుపోయిన వ్యక్తి సామాన్యుడు కాదు 'హ్రోత్గార్' మహారాజుకు విశ్వాసపాత్రుడైన మంత్రి ఎంతోకాలంగా రాజకుటుంబ సేవలో ఉంటూ తన ప్రతిభావిశేషంతో డేనిష్ రాజ్యాన్ని సుస్థిరంచేసిన వ్యక్తి అలాంటి విశ్వాసపాత్రుడు పోయాడన్న వార్త తెల్లవారేప్పటికి రాజప్రాసాదానికి చేరింది మహారాజు చిన్నపిల్లాడిలాగా విలపించసాగాడు

రాజప్రాసాదానికి రావలసిందిగా బియోవుల్ఫ్‌కు కబురు పంపారు బియోవుల్ఫ్ వెళ్లి సంప్రదాయం ప్రకారం "మహారాజుకు జయం" అన్నాడు

"మహారాజూ లేదు! జయమూ లేదు! క్షేమమూ లేదు! బియోవుల్ఫ్! ఆరోజులు ఎప్పుడో గడిచిపోయాయి పద్నాలుగేళ్ళుగా మా ప్రజలకున్న బాధ విరగడైపోయిందని ఎంతో ఆనందించాను కాని, ఆనందం ఈ రోజుతో తామరాకుమీది నీటిబొట్టువలె జారిపోయింది నా కుడిభుజమే ఈవేళ విరిగిపోయింది నా ముఖ్యానుచరుల్లో అతి విశ్వాసపాత్రుడు 'అస్ ఖేర్' ఈరోజు




బలి అయ్యాడు అతడి అస్తమయంతో నా రాజ్యశోభే అస్తమించింది నా కీరోజునుండి ప్రకృతి అంతా శూన్యం" అంటూ మహారాజు పసిబాలుని లాగ రోదించసాగాడు

కొంతసేపటికి తెప్పరిల్లాడు మహారాజు 'బియోవుల్ఫ్! మమ్మ ఈ ఆపత్సముద్రంనుంచి గట్టెక్కించగలవారు నువ్వుతప్ప ఇంకొకరు లేరు గ్రిండల్‌చావుతో మాబాధ తొలగిపోయిందనుకుంటే ఇప్పుడు వాడి తల్లో, ఎవరో దాపరించింది ఇదంతా చూస్తే గ్రిండల్‌ను నువ్వు చంపటంతో ఈ రాక్షసి దానికి ఈవిధంగా బదులుతీర్చుకుంది తరతరాలుగా రాజవంశానికి విశ్వాసపాత్రులుగా వుంటున్న వంశంవాడు, మా ముఖ్యమంత్రి, యోధుడు, 'అస్ ఖేర్' ఈ ఘాతుకి పాలబడ్డాడు అలాంటిమంత్రి నాకు ఇక దొరకడు" అంటూ మహారాజు మళ్లీ రోదించసాగాడు

"మహారాజా!" బియోవుల్ఫ్ సానునయంగా సంబోధించాడు "విచారించకండి, మహారాజా! మానవులందరు ఎప్పుడో ఒకప్పుడు ఏదోవిధంగా రాలిపోవలసినవారే! పుట్టిన ప్రతిమానవుడు గిట్టటం అనేదిప్రకృతి ధర్మం కనుక మీలాంటి వీరశిఖామణులు ఇలా శోకించటం భావ్యంకాదు మీ మిత్రుని, మంత్రి మరణానికి ప్రతీకారం సాధిద్దాం అప్పుడు ఆయనఆత్మకు శాంతిఅన్నా లభిస్తుంది ఇది విచారానికి సమయంకాదు మహారాజా! లేవండి! ప్రతీకారం సాధిద్దాం. ఈ ఒక్క రోజు ఓపిక పట్టండి ప్రపంచంలో ఏ మూరుమూలైనా ఆ రాక్షసి దాక్కోవచ్చు కాని, నా చేతిలో దానిమరణం తథ్యం" అన్నాడు బియోవుల్ఫ్

బియోవుల్ఫ్ ఓదార్పు మాటలకు ఎంతో నిగ్రహంతో దుఃఖాన్ని అణచుకొన్నాడు మహారాజు. సహాయం చేస్తానని బియోవుల్ఫ్ అన్నందుకు కృతజ్ఞతలు తెల్పాడు

హ్రోత్గార్ మహారాజు, బియోవుల్ఫ్ ఆరాకాసి జాడలు వెతకాలని నిశ్చయించుకున్నారు తనకూ, బియోవుల్ఫ్‌కు గుర్రాలను సిద్ధం చేయించాడు బాణాలు, బల్లాలు, కత్తులు, కటార్లు వగైరా ఆయుధాలు ధరించి ఒక సైనిక దళం వెంట రాగా వా రిద్దరు అడవులవైపు బయల్దేరి వెళ్లారు విశాల రాజమార్గాలు వదలి ఇరుకువీధులు, ముళ్ల త్రోవలు, నదులు, లోయలు కొండగుట్టలు, గుహలు అన్నీ గాలించ నారంభించారు అలా ఎంతోసేపు గాలించారు పోగా పోగా వారికి హఠాత్తుగా ఒక పర్వతశ్రేణి, దానికి చుట్టూ ఆవరించిన కీకారణ్యం కన్పించాయి అలాంటి విచిత్రప్రదేశాన్ని హ్రోత్గార్ ఎప్పుడూ చూడలేదు ఆ కొండప్రాంత వింత సోయగానికి హ్రోత్గార్ ప్రభృతులు ఆశ్చర్యపడుతూ, ఇంకా లోపలికి చొచ్చుకుపోయారు. ఆ ప్రకృతి అంతా విచిత్ర రమణీయంగా ఉంది పసుపుపచ్చని పర్వతశ్రేణులు లేయెండకాంతికి అందగించి బంగారుభ్రాంతిని కొల్పుతున్నాయి. పర్వతాలచుట్టూ ఉన్న అరణ్యం పెట్టని కోటలాగా ఉంది వారు ఇంకా ముందుకు చొచ్చుకుపోయారు అక్కడ ఒక దృశ్యం ఏదో వార్ని చకితుల్ని, భయభ్రాంతుల్ని కూడా చేసింది

అక్కడ ఒక పెద్ద చెరువుంది ఆ చెరువంతటా నాచుతో సహా అంతా ఎర్రగా ఉంది జలచరాల ఆవాసాన్ని తెలుపుతూ నీరంతా బుడగలమయంగా బుడుక్కు బుడుక్కుమనే శబ్దాలతో ఉంది ఆ సరస్సులోనే కొద్దిగా ఎత్తుగా ఉన్న మిట్టమీద ఒక మానవుని శిరస్సు ఉంది అది చూడగానే అదిరి గుండెలు ఝల్లుమన్నాయి ఏ వ్యక్తి మేధాసంపత్తిపైన హ్రోత్గార్‌రాజ్యం సుభిక్షమైనదో, ఎవరి మంత్రాంగం రాజ్యానికి క్షేమంకూర్చిందో, ఎవరి మరణంపట్ల 'హ్రోత్గార్' పసిబాలుడివలె విలపించాడో ఆ వ్యక్తి ఆ అస్ ఖేర్ శిరస్సు అది ఇది చూచిన మహారాజు హ్రోత్గార్‌కు కాలుచేతు లాడలేదు మంత్రి శిరస్సు కనబడిందిగనుక ఆ రాక్షసి కూడా ఇక్కడే ఉందని నిశ్చయించుకున్నాడు బియోవుల్ఫ్

బియోవుల్ఫ్ హ్రోత్గార్‌తో ఇలా అన్నాడు "మహారాజా! నేను ఇప్పుడు ఈ కొలనులో ఉన్న ఆ రాక్షసి పైకి బయల్దేరటానికి సిద్ధంగా ఉన్నాను ఈ పోరాటంలో నాకు ఏదైనా అపాయం సంభవించే పక్షంలో నా అనుచరుల్ని, నాపై ఆధారపడిన వారిని పోషించవలసిందిగా అర్థిస్తున్నాను అంతేగాక మీరు లోగడ నాకు బహూకరించిన వస్తువులు మా మామకు పంపవలసిందిగా కూడా అభ్యర్థిస్తున్నాను" ఈమాటలంటూ జవాబుకోసం కూడా నిరీక్షించకుండా ఆ కొలనులోకి దూకేశాడు.

—(ఇంకా ఉంది)




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**30-8-1961 బుధవారము మొదలు**
**5-9-1961 మంగళవారము వరకు**

### మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

మీరు కొంచెం శ్రద్ధ వహిస్తే వ్యవహార విషయాలలో లాభం పొందగలుగుతారు వృత్తిలో క్రొత్త మనుష్యులతో సంబంధాలు పెట్టుకోవలసి వస్తుంది మీరు ఏ విధమైన సలహా కోరకపోయినా మీ క్షేమం కోరినట్లు నటిస్తూ, మిమ్ములను నిరుత్సాహపరిచేవారు ఉంటారు జాగ్రత్తగా ఉండటం అవసరం అయితే శక్తికి మించిన పనులను పైనపెట్టుకోవద్దు పిల్లల శుభకార్యాలు అనుకూలిస్తవి విద్యార్థులకు ఈవారం అనుకూలంగా ఉంటుంది దేహసౌఖ్యం మాత్రం సాధారణం కుటుంబంలో ప్రత్యేకంగా చికాకులు ఏమీ ఉండవు కాని మీ మాటకు పనులకు ప్రోత్సాహం అంతగా ఉండకపోవచ్చు మిమ్ములను గురించి మీ మిత్రులు కొందరు చాటుగ పరిహాసం చేస్తున్నట్లు తెలుస్తుంది తొందరపడవద్దు 1, 2 తేదులు శుభవార్తలు, ఆకస్మాద్ధన లాభం

* * *

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ప్రారంభంలో కొద్ది పని అనుకుని మొదలు పెడతారు కాని, క్రమక్రమంగా పెరుగుతూ పోతుంది. దైవబలంతో ఏవిధంగానూ నలుగురిలో మీ పేరుకు భంగం రాకుండా చూచుకోగలుగుతారు ఇతరులకు మీ వాగ్దానాలు చెల్లించుకొనవలసిన సమయంలోనే స్వంత కార్యక్రమాలు కూడా సాగించుకొనవలసిన అవసరం ఏర్పడుతుంది వృత్తిలో ధైర్యంతో మీ ధర్మాన్ని నిర్వర్తించుకోగలుగుతారు బాహ్య ఆడంబరాలు, పౌరుషాలు మొదలయినవి పెట్టుకోతగిన సమయంకాదు మీ ఆలోచనలవల్ల కాలయాపన కనుపించినా చివరకు అన్ని విధాలా సంతృప్తికరమైన మార్గాన్ని అనుసరించగలుగుతారు సంగీత సాహిత్యాలు మొదలయిన కార్యక్రమాలలో పాల్గొంటారు ఖర్చులు అధికంగాఉన్నా శుభసంతోషాలలో కష్టం తోచదు వృత్తికి సంబంధించిన వార్తలు ఆలస్యంగా వచ్చినా కంగారు పడవద్దు 3, 4 తేదులలో బంధువుల రాక, సాటివారిలో గౌరవలాభం, దేహశ్రమ

**గ్రహస్థితి**

కర్కాటకంలో శుక్రుడు, సింహంలో సూర్య రాహువులు, సింహ కన్యలలో బుధుడు కన్యలో అంగారకుడు, మకరంలో గురు, శనులు, కుంభంలో కేతువు, మేష, వృషభ, మిధునాలలో చంద్రుడు

* * *

### మిధునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

"నేను పట్టిన కుందేటికి మూడే కాళ్ళు" అనే రకం మనుష్యులతో వాదోపవాదాలు జరుపవలసి వస్తుంది ఆ సమయంలో మాటలు పెరగకుండా చూచుకొనటం మీ వంతు ముందు ఖర్చులు, పిమ్మట ఆదాయము, మొత్తంమీద రెండూ అధికంగానే ఉంటవి కుటుంబంలోనివారిలో ఒకరి కొకరికి అభిప్రాయాలు స్వల్పంగా భేదిస్తూఉన్నా, జరుగవలసిన పనులు మాత్రం ఆగవు ధర్మ కార్యాలలో బాధ్యతలు పైన వేసుకొనవలసి వస్తుంది అధికారుల వల్ల మాట వస్తుందని మొదట్లో తోస్తుంది కాని చివరకు అన్ని పనులు సౌమ్యంగా, సుఖంగా జరుగుతవి ఆభరణాలు మొదలయిన విలువగల వస్తువులు కొందామనే అభిలాషఉన్నా, ఆటంకాలు వస్తవి ప్రయాణాలు సుఖంగా జరుగుతవి. యంత్ర సంబంధమైన పనులలో చాలా జాగ్రత్తగా ఉండతగిన సమయం 4, 5 తేదులలో ఆదాయవృద్ధి, సంఘంలో గౌరవం

* * *

### కర్కాటకం .

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

బాధపడుతున్నామని చెప్పుకోటానికి అవకాశం లేకుండా బాధ పడవలసిన సమయం అనేక సందర్భాలలో పండు వలిచి చేతిలో పెట్టినట్లు మాట్లాడుతూ క్రియలో మొండి చేయి చూపేవారు తటస్థపడతారు శ్రమకు తగిన ప్రతిఫలం కనుపించదు ధైర్యంతో నిలబడితే నిదానంగా కార్యం సాధించుకోగలుగుతారు వృత్తి, ఉద్యోగాలలో ఇతరుల బాధ్యత కూడా మీపైకి రాగల సమయం పిల్లల మూలంగా మన స్సంతోషము, సుఖము లభిస్తవి మీ చుట్టుఉండే మనుష్యులే మిమ్ములను నిరుత్సాహపరుస్తు అవకాశాన్ని తాము వినియోగించుకొనటానికి చూస్తారు దైవికంగా తటస్థపడే ఒకానొక పెద్ద మనుష్యునివల్ల మీరు పైకి పోగలుగుతారు పుణ్య కార్యాలకు ఆటంకాలు రాగల సూచన లున్నవి ముందు ఎప్పుడో మీ పని చేస్తామని ప్రస్తుతం ప్రతిఫలాన్ని కోరే మనుష్యులను నమ్మవద్దు 2, 3 తేదులలో ఆదాయవృద్ధి, పయ్యాణ సూచనలు, ఇష్ట వస్తు ప్రాప్తి

* * *

### సింహం

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా )

అనేక సందర్భాలలో ముఖ్యంగా రహస్యము, బెట్టుసరి ఇవి అవసరం, అవుతవి ఆడంబరంతో పెద్దమనిషిగా చెలామణి అవుతారు కాని మీ అంతరంగంలో ప్రశాంతత మాత్రం లోపిస్తుంది అధికారం పెరుగుతుంది ఏ విషయంలోనూ మాటలలో తీవ్రత కనుపించకుండా చూచుకొనటం అవసరం మీ ఆలోచనలు పరిపరి విధాలపోతూ ఉంటవి ధనా దాయం బాగుంటుంది కుటుంబంలోని వారి ఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండటం అవసరం మొదట్లో అనుకున్న కార్యక్రమాలు సమయానుకూలంగా తగ్గించుకుంటారు ఇతరుల వద్దనుంచి రావలసిన డబ్బుకు తొందరపడితే ప్రయోజనం ఉండదు వృత్తిలో శ్రమ, అధికంగానే ఉంటుంది కాని, గాంభీర్యంతో బాధ్యతలను నిర్వర్తించుకుని గౌరవం పొందగలుగుతారు 30, 31 తేదులలో సంఘకార్యాలు, లాభ వార్తలు.

## కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా)**

కష్ట నష్టాలు రావచ్చునని అనుకుంటూ తిరిగి ఆపనినే చేయవలసిన సమయం శక్తికి మించిన పనులు ప్రారంభించి కొనసాగించటానికి అవకాశం లేక చిక్కుపడవలసి వస్తుంది ఆలోచన సరిగా తోచదు కుటుంబంలోని పరిస్థితులు కొంత వరకు మేలుగా ఉంటవి వృత్తి, ఉద్యోగాలకు సంబంధించిన లాభ వార్తలు వింటారు అధికారుల వల్ల అపకారం జరిగేటట్లు తోస్తుంది కాని పర్యవసానంలో మీకే జయం లభిస్తుంది స్వల్ప ప్రతిఫలంతో తృప్తిపడుతూ గౌరవాన్ని కాపాడు కోవలసిన సమయం వారం రెండవ భాగంలో ముందు ముందు మీరు అనుసరించదగు మార్గాన్ని యోచించుకోగలుగుతారు విద్యా వినోద ప్రసంగాలలో పాల్గొంటారు సుబ్రహ్మణ్య పూజా, స్తోత్ర పారాయణము వాటివల్ల క్షేమారోగ్యములు పొంద గలుగుతారు కార్యసిద్ధి, గౌరవం లభిస్తవి 31, 1 తేదులలో దక్షిణ దిక్కునుంచి ధనలాభము, ప్రయాణాలు, బంధుదర్శనం

* *

## తుల

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

ఎంత పట్టుదలగలవారైనా మీ మాటను ప్రత్యేకంగా గౌరవిస్తారు వృత్తిలో ప్రోత్సాహ కరంగా ఉంటుంది రాజకీయాలలో మీ శ్రమ ఫలిస్తుంది ఈ సమయంలో ఆదాయంతోపాటు ఖర్చు కూడా పెరగటంవల్ల అనుకున్న ప్రకారంగా క్రొత్తకార్యక్రమాలు ఏమీ ప్రారంభించలేక పోతారు సభా గౌరవం లభిస్తుంది ప్రయాణాలు సుఖంగా జరిగి తృప్తికరమైన ఫలితం పొంద గలుగుతారు స్థిరాస్తులుకొనే ప్రయత్నాలు సుము ఖంగా ఉంటవి లోగడ చేసిన వాగ్దానాలు ఈ సమయంలో నెరవేర్చుకోవలసిన అవసరం కలుగు తుంది వారం రెండవభాగంలో అకస్మాత్తుగా దేహబాధలు కలుగవచ్చు కుటుంబ సంబంధ మైన చికాకులు తొలగిపోతవి, చాలా జాగ్రత్తగా ఉందామని అనుకుంటు ముఖ్య విషయాలనే మరచి పోతారు 1, 2 తేదులలో వ్యవహార పరిష్కా రాలు, కారణంలేని ఆందోళన, సంచారము

* * *

## వృశ్చికం.

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

అన్ని రంగాలలోను మీ శక్తి సామర్థ్యాలను చూపగల అవకాశాలు లభిస్తవి లోగడ పెట్టు బడి పెట్టిన ధనం సకాలంలో చేతికి అందు తుంది కార్యభారం విశేషంగా ఉన్నా, తగినంత విశ్రాంతి లభిస్తుంది ఇతరుల సహాయంతో నూతన ధనాదాయమార్గాలను అనుసరించ గలుగుతారు న్యాయం నిమిత్తం పట్టుదలతో కృషి చేయగలుగుతారు అందులో ఒక రిద్దరు పెద్ద మనుష్యులు మీకు వ్యతిరేకం కాగల అవకాశా లున్నవి స్థిరాస్తులు మార్పు లు చేయటంవంటి పనులలో మీ కోర్కె ఫలిస్తుంది కుటుంబంలో శుభకార్యాలు సుఖంగా జరుగుతవి మీ అశ్రద్ధ వల్ల దేహ సౌఖ్యం లోపిస్తుంది మీతో ఉంటూ మీవల్ల సహాయంపొందేవారే ఈ సమయంలో మీతో పోటీచేసి గౌరవం పొందటానికి ప్రయత్ని స్తారు ఆదాయం మామూలుగా ఉంటుంది 3, 4 తేదులలో శ్రమవల్ల ఫలితము, పెద్ద మొత్తాలు పైకం అవసరం కావటంవల్ల ఇతరుల సహాయం కోరవలసి వస్తుంది

* * *

## ధనుస్సు.

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)**

తోటివారు మిమ్మలనుగురించి ఈ సమ యంలో నిరసనభావంతో మాట్లాడుతారు అందుకని అనవసరమైన భారం పైన వేసుకోవటం మంచిదికాదు ముందు మీ ఆరోగ్యం సరిగా చూచుకొనండి మాట మంచితనంతో గౌరవాన్ని కాపాడుకొనవలసిన సమయం బయట చెప్పుకొన టానికి అవకాశంలేని కొన్ని చిక్కులువచ్చే సూచన లున్నవి పడమర దిక్కునుంచి ధనలాభం ఉంటుంది ఒకానొక పెద్దమనుష్యుని సహాయంతో ముందు జాగ్రత్త పడటంవల్ల సంఘంలో చెడ్డపేరు రాకుండా నిలబడగలుగుతారు సాధ్యమైనంతవరకు ఖర్చులు తగ్గించుకుని, గొప్పదనం లేకపోయినా ప్రశాంతం గా ఉండటానికి మార్గం చూచుకొనండి విద్యావ్యాసం గాదులలో ఉత్సాహం తక్కువ వారాంతంలో బంధువులవద్దనుంచి శుభవార్తలు వస్తవి 30, 31 తేదులలో స్వల్ప ఆదాయం, సందేహ వార్తలు తెలుస్తవి చిన్న చిన్న పనుల నిమిత్తం విశేషంగా శ్రమ

* * *

## మకరం.

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

మీ ఆలోచనలకు బంధుమిత్రులు కొంతవరకు ఉత్సాహాన్ని కలిగిస్తారు ధన విషయంలో ఇంతకు ముందు ఉన్నంత శ్రమ ఉండదు అవతలివారి అభిప్రాయాన్ని అనుసరించి సమయంలో కార్యం సాధించుకుంటారు ముందు ఎప్పుడో విశేషంగా లభిస్తుందనే ఆశ పెట్టుకోకుండా తాత్కాలికంగా కనుపించిన అవకాశాన్ని ఉపయోగించుకొనటం మంచిది కుటుంబంలో మీ అభిప్రాయాలకు విలువ, ప్రోత్సాహము లభిస్తవి వృత్తిలో మీతో పోటీ చేయటానికి ప్రయత్నించేవారు ఉంటారు అంతమాత్రంచేత మీరు తొందరపడి వృధా శ్రమ, ఖర్చులు పైన వేసుకోవద్దు, వృత్తి, వ్యాపారాలలో మీరు అనుసరించే మార్గం సాటివారి దృష్టిలో కూడా గౌరవప్రదంగా ఉంటుంది 3, 4, 5 తేదులలో అనారోగ్య సూచనలు, ఇతరుల నిమిత్తం ఖర్చులు, పెద్ద మనుష్యులతో సమావేశం.

* *

### ఈవారము ధరలు

బంగారు ధర కొంచెంగా తగ్గుతుంది వెండిధర వారం ఆరంభంలో తగ్గి 3 వ తేది నుంచి పెరుగుతుంది పసుపు ధరలో మందీ వస్తుంది కందులకు కొద్దిగా ధర పెరుగుతుంది వేరుశనగపప్పుధర మందీలో నిలుస్తుంది నూనె ధర గతవారంకన్నా తగ్గ వచ్చు నూవుల ధరలో పెరుగుదల వస్తుంది కాని నూవులనూనె ధర తగ్గే అవకాశాలున్నవి చింతపండు ధర కొద్దిగా తగ్గుతుంది గోధుమల ధర మందీలో నిలుస్తుంది మినుములకు గిరాకి వస్తుంది నూలు ధర పెరిగే అవకాశా లున్నవి

## కుంభం

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

"తన్నుఇంటి వాసాలు లెక్కపెట్టే" రకం మను ష్యులు తటస్థ పడతారు ప్రస్తుతం పదిమందిలో గౌరవం పొందవలెననే ఆశ పెట్టుకోకుండా, మీ స్వంతకార్యక్రమాలలో పొరపాట్లు రాకుండా చూచుకొనటం అవసరం అనుకున్న పని పూర్తి కాకపోయినా ఖర్చులు మాత్రం అంచనాకుమించి పోతవి పుణ్య కార్యాలనిమిత్తం శ్రమ, ధన వ్యయము ఉంటవి పిల్లల ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకొనండి ధన సంబంధమైన లావాదేవీలలో ఇంతకుముందున్న చిక్కులు తొలగిపోతవి ఒకానొక సమయంలో మీరు చేయలేక మానుకున్న పనినే ఈ సమయంలో సులభంగా నెరవేర్చగలుగుతారు ఇతరు లకు సలహా చెప్పటం, ఇతరుల వ్యవహారాలు చక్క పరచటం మొదలయిన సందర్భాలలో యుక్తిగా వ్యవహరించి మాట దక్కించుకొంటారు 1, 2 తేదులలో బంధుగౌరవం, ప్రయాణాలు

## మీనం

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

ఒకరిమాటకోసం ఎదురుచూడకుండా కార్య రంగంలో దిగ గలుగుతారు దైవబలం బాగున్నది పదిమందిలో ఉన్నత స్థితి లభిస్తుంది అధికారుల వల్ల మీ పనులు అనుకూలిస్తవి వాహనాలు కొన టం, భూములు, ఇండ్లు మొదలయినవి కొనటం లేక వాటివల్ల ముందు ముందు బాగా లాభించే ఏర్పాట్లు చేయటంవంటి పనులు సక్రమంగా జరుగుతవి వృత్తి, ఉద్యోగ లలో మధ్యవారి మాటను నమ్మి, మనస్పర్ధలు పెంచుకోవద్దు కుటుం బంలో ఖర్చులు పెరిగినా ఉపయోగము, మనశ్శాంతి ఉంటవి అనుకున్న ప్రయాణాలు మానుకోవలసి వచ్చినా బాధపడవద్దు పనుల హడావిడిలో ఉద్రేకం అధికం అవుతుంది తోటివారి మనస్సుకు బాధ కలుగకుండా చూచుకొనవలసిన సమయం 3, 4 తేదులలో వృత్తిలో అభివృద్ధి, గౌరవ ప్రాప్తి ★

# బంగారం - సింగారం - '[illegible]' చిత్రకథ -

అబ్బో! అంతా చీకటి...

మేం ఎప్పుడొచ్చినా ఇలాగే చీకటి - కొన్ని మాట్లు వెలుగు కనిపించేది - అప్పుడు ఆ నిధివద్ద ఓ పెద్ద నల్లటి భూతం గోడ మీద కాపలా! ఎప్పుడొచ్చినా ఇంతే - ఆ భూతం లేపోతే నిధంతా ఎప్పుడో తీసుకుపోయేవాళ్లం -

అబ్బీ - మనం భూతాల్ని కిరాయికి పెట్టుకోవల్సిందిస్మే కాపలాగా - ఈ బెడదుండేది కాదు - తప్పనే లేదు

తప్పద్దు తప్పద్దు

అందరూ మెల్లిగా విమానం దిగారు ..

ఆఁ! ఈమారు గదిలో వెలుగు లేదు - భూతం లేదు - భయం లేదు

సార్ (ట్రెజరు మాటట్టుంచి మా నెక్స్టు పిచ్చరుకి డైలాగులు రాయరాదూ?

ఆగండి - ముందో గది తలుపులు తీస్తా - నన్నరనన్నర నన్నరనాం - ఢాం ఢాం - తెరుచుకో -

ఏవిటి చెప్మా! తెలిసిన చోటులా వుంది

వార్నీ - బతేగా లంగేశావ్ - అమ్మో - ఇదే పెట్టయినా భోషాణా మైనా ఎంతేగా!

ఆ రెండూ ఇక్కడే వుండాలి - ఇదిగో తీస్తా చూడండి

ఆంధ్రుడు ఉద్రేకి అంటారు ఎవడా అన్నది? ఎవడా లింగనాధం - ఆంధ్రుల్లో ఉద్రేకం ఎక్కువని అన్నకుంత ఎవడటు? ఆఁ?

అయినా ఇదేం పిచ్చివాగుడా? పిచ్చివెధవా - నువ్ మాటాడింది మనకథకేదేనా సంబంధం వుందా అధి - ఇదేం 'టెలుగూ సినిమా' అనుకున్నావా - నీ ఇష్టం వచ్చిన సీను కథలో ఇరికించెయడానికి - ఆఁ?

నన్ను క్షమించు దేవుడా

నువ్వా కథ కానీవయ్యా

రైట్ సార్

ఇక్కడేదో స్విచ్చిలావుందే - నొక్కి చూస్తా

స్విచ్చివెయ్యగానే లైటు వెలిగింది...

బాబోయ్! నాయనోయ్! ఇది నా ఇల్లురోయ్! నాగయ్యగారిది కాదురోయ్! నా ఇంటికి నేనే దొంగతనానికి వచ్చానోయ్!

అరె! వండర్

ఆశ్చర్యం!

బాబోయ్ భూతం!!

మన విమానంలో వాళ్లు పారిపోదాం అనుకుంటే - వాళ్ల విమానంలో మనం పారిపోదాం - పద

19




అనగనగా ఒక వూరిలో పేరి శాస్త్రిలనే పేద బ్రాహ్మణు డుండేవాడు. పాపం' ఎలాగో యాయ వారం చేసి కాలం వెళ్ళబుచ్చు తుండేవాడు. పేదతనానికి తోడు పేరిశాస్త్రిలు ఒట్టి నోరులేనివాడు. అతనిభార్య గౌరి మాత్రం గయ్యాళి గంప. భర్తను ఎప్పుడూ తనకు మంచినగలు చేయించలేదని, చీరెలు కొనలేదని వేధించుకు తినేది. రెండు పూటలా భోజనం గడవడమే కష్టంగా వున్న పేరిశాస్త్రిలు గౌరి కోర్కెలు తీర్చలేక బాధపడుతుండే వాడు.

ఇలా వుంటుండగా, పేరిశాస్త్రి లొకనాడు ఆయవారం చేసి అలసి సొలసి ఒకయింటి అరుగుమీాద కూర్చున్నాడు అక్కడే అంతకు ముందెప్పుడో పెళ్ళి భోజనం చేసి వచ్చిన నలుగురు బ్రాహ్మణులు భుక్తాయాసం తీర్చుకుంటున్నారు. వారిలో వారు పెళ్ళిలో పెట్టిన పిండి వంట లన్నిటికంటె 'అరిసెలు' చాలా బాగా చేశారని తెగమెచ్చు కుంటున్నారు వాళ్ల మాటలు వింటున్న పేరిశాస్త్రికి, నోరూరి అరిసెలు తినాలనిపించింది. వెంటనే గబగబ యింటికివెళ్ళి, గౌరితో అరి సెలు చేసిపెట్టమని చెప్పాడు. గౌరి పేరి శాస్త్రిలను బజారుకు పంపించి, అరిసెలకు కావాల్సిన సామాన్లు తెప్పించింది. తర్వాత పేరిశాస్త్రి లను పిలిచి "మీారా అరుగుమీాద పడుకోండి. నేను అరిసెలు వండి పిలు స్తాను" అని చెప్పింది. పేరిశాస్త్రిలు "సరే" నని వీధి అరుగుమీాద కునుకు తీయసాగేడు

గౌరి పెనం దగ్గర కూర్చొని శుభ్రంగా బోలెడన్ని అరిసెలు వండింది. కాని అప్రయోజకుడైన భర్తకు ఒక్క అరిసెముక్కకూడా పెట్ట బుద్ధి పుట్టలేదు. తను ఒక్కతే తినదలచుకున్నది. అందుకని వండిన అరిసెలన్నీ ఒక గిన్నెలోపెట్టి దాచేసింది. అరిసెలు వండగా మిగిలిన బెల్లంపాకంలో కాసిని నీళ్ళుపోసి గిరగిరా త్రిప్పింది. అరుగుమీాద పడుకున్న పేరి శాస్త్రిని నుద్దేశించి, "అరిసెలు

(38-వ పేజీ చూడండి)

# ఆద్యంతాల మధ్య అతను

సింగరాజు రామచంద్రమూర్తి

**'ఈ అమ్మాయికి ఎంత పొగరు' అనుకున్నాడు అతను. ఆమె సముద్రపు అలల్లా తుళ్ళుకు తుళ్ళుకు నవ్వుతోంది ఎందుకో ?**



అందరికీ అలా యిలా తెల్లవారితే శంకరానికి భళ్ళున తెల్లవారింది. అక్కడికీ ఒంటిగంటకొకసారి, మూడు గంటల కొకసారి బయటికి పోయిచూశాడు తెల్లవారకపోయి ఉంటుందా అన్నఆశతో అల్లా కాకపోగా కన్ను పొడుచుకున్నా కానరానిచిమ్మచీకటి అతన్ని హడలకొట్టటంతో బిక్క చచ్చిపోయి మళ్ళీ మంచం చేరుకున్నాడు ఎప్పుడోసాయంత్రం ఆరున్నరకి పడిన చీకటి మరీ బొత్తిగా భయం భక్తీ లేకుండా మళ్ళీ అదే టైము దాకాఉండిపోవడం అతనికి నచ్చలేదు పోనీ మామూలురోజుల్లో అలాగే ఉండచ్చు కాని దాని దుంప తెగిపోనూ—ప్రాణంమీదికి వచ్చినంత పనయినా మారకపోతే ఎలా ? అతను మటుకు ఇన్ని రోజులు రాత్రికి కనీసం పద్దెనిమిది గంటలయినా ఉండాలిఅని వాదించినవాడే మరి ! కాని గత సాయంత్రంఅతని జీవితపధాన్నే మార్చేసింది

గత సాయంత్రందాకా అతనూ మామూలుమనిషే. రెండు పూటలా భోజనం, అన్నిసార్లు టిఫిన్, అంతకు రెట్టింపుసార్లు కాఫీ పుచ్చుకుంటూ అదే జీవిత పరమార్థమని, అలా జీవితాంతం గడిచిపోవడమే తన లక్ష్యమని భ్రమించినవాడే అటువంటిది ఒక శుభ క్షణాన

శంకరం వాళ్ళు ఉన్న ఇల్లు నాలుగు భాగాలుగాఉన్న పెద్ద మేడ అందులో ఒకానొక భాగం గతనెల్లాళ్ళుగా ఖాళీగా ఉంటోంది ఒకవారం క్రితం ఎవరో తాసీల్దారుగారు అది చూసి ఖాయపర్చుకున్నారని కర్ణాకర్ణిగా విన్న శంకరం సాయంత్రంపూట ఆయన మండీ మార్బలంతో దిగటంతోవెయ్యి ఏనుగుల బలం పుంజుకున్నాడు

ఆ మండీ మార్బలంతో అతగాడిని ఆకర్షించినది, బండిలోంచి తమలపాకులాంటి పాదానికి, చెప్పుకి అరవై డిగ్రీల కోణం ఉంచి అందంగా బయటికి చాచిన కాలు, ఆ వెంటనే అటువంటిదేమరొకటి, పాలనురగలాంటి పట్టుచీర, ఆపైనసన్నటి నడుము, వంపులు దిద్దుకున్న శరీరం, మెరమెరలాడే వెల్వెట్ జాకెట్టు, పచ్చటి మెడనిచుట్టుకుని సన్న జాజుల వెన్నెను, అందంగా కొనతేలిన గడ్డం, దొండపండుల్లాంటి పెదవులు, అందమయిన ముక్కు, రింగులకి అందాన్నిచ్చిన చెవులు, మీనాక్షి అవదగిన కండ్లు . బండిలోంచి దిగుతున్న ఆ అమ్మాయిని చూస్తూనేకొయ్యబారిపోయాడు శంకరం ఒక క్షణంలో సగంసేపు కనులచివరనుండి అతన్ని చూసి "నాన్నా మరచెంబుఎక్కడ పెట్టావు?" అనడిగింది తాసీల్దారుగారిని "పికో మీటినట్లుంది" అనుకున్నాడు శంకరంమనస్సులోనే

తండ్రి అందిచ్చిన మరచెంబు పుచ్చుకుని అడుగులో అడుగువేసుకుంటూ తమ భాగంవైపుకదిలిపోతున్న ఆ అమ్మాయిని చూస్తూ "హంసగమన" అని కూడా అనుకున్నాడు శంకరం

కాసేపు హడావుడిగా నలుగురి కంటా పడేట్టు తిరుగుదామనుకుని ఇంట్లోకి వెళ్ళి డ్రస్సు మార్చుకుని, తలకాయ తీరు నచ్చక—నచ్చనిది తలకాయ కాదనీ, తలమీద ఉన్న జుట్టనీ గమనించ ప్రార్థన—అర్ధంతో కుస్తీపట్టి బయట పడేంతలో కారుచీకట్లు కమ్ముకొచ్చాయి తనింత కష్టపడ్డానన్న జాలిమీద నయినా తాసిల్దారుగారమ్మాయి ఒక్కసారి బయటకు రాకపోతుందా అన్న ఆశతో బట్టలునలగకుండా తొమ్మిది దాకా కాంపౌండు గేటుదగ్గర తచ్చాడిన శంకరాన్ని నిరాశే వరించింది

"ఈ చీకటి ఒకటి నా ప్రాణానికి ! అయినాఏం కొంప మునిగిపోయిందని—ఇంకో గంటయాక పడకూడదూ ? నా తలకాయలా ఉంది ?"

# ఆద్యంతాలమధ్యఅతను

అనుకున్నాడు వినుగ్గా శంకరం అంతలోనే ఆ తలి
కాయ గురించిన నగ్నసత్యం ఒకటి స్ఫురించింది
అతనికి అది తనకి తల మాసిందని, తలమాసిన
వాళ్లని అందమయిన అమ్మాయిలు ప్రేమించక
పోగా కనీసం కన్నెత్తి అయినా చూడరని

"రేప్పొద్దున్న తెల్లవారగానే మొదటి పని అది, తలంటుకుని శుచి అయిన బట్టలు కట్టుకుని—అనుకుంటూ ఇంట్లోకి వెళ్లిపోయాడు అప్పటి ఆశాభంగాన్ని రేపటి ఆశగా మార్చుకుని

అక్కడా అక్కడా ఆకలయిన పిల్లకాకులు అరుస్తూంటే శంకరంకి మెలుకువ వచ్చేసి ఆపడాన సైకి లేసుకుని వీధినపడి మరో అరగంటకల్లా ఇంటికి చేరుకుని తలనిండా ఇంత నూనె పూసుకుని కుంకుడుకాయ రసం కలుపుకుని పంపుకింద చేరాడు

రాత్రి దిగిన తాసిల్దారుగారి అమ్మాయితో పరిచయం చేసుకుని, 'మీ అమ్మ లేకపోయినా ఆ లోపం కానివ్వకుండా చూసే బాధ్యత నాద' ని హామీ యిచ్చి ఏంలాంటి ఆ అమ్మడి అందాన్ని నెమరు వేసుకుంట వస్తున్న సావిత్రమ్మగారికి కొడుకు సత్ప్రవర్తన ఒక పట్టాన అర్థంకాలేదు తొమ్మిది గంటలకి గాని బెడ్ నోట్లో పెట్టని కులదీపకుడు ఇలా మంచి బాలుడిలా తలరుద్దుకుంటూ వుంటే కళ్ళు చెమ్మగిల్లాయి

"వెర్రినాగన్నా—తలంటుకుంటావని మాట మాత్రం అంటే వేడినీళ్ళు ఫెళ్లున కాచేదాన్ని దరా" అంటూ నురుగు పోద్దామని దగ్గరసా గబోయింది

అది పసిగట్టిన శంకరం—అమ్మల సహాయం పేక్షించే కొడుకులని కాలేజి అమ్మాయిలు ప్రేమించరన్న సూక్తి గుర్తు చేసుకుని ఆమెని అటకాయించాడు పోనీ నీళ్ళు పోద్దామంటే అందుకు - కూడా ఒప్పుకోలేదు ఆవిడకి వినుగు పుట్టి వెళ్లిపోయింది

పంపటం అయితే ఎంపేశాడు గాని అలవాటు లేని పని అవటంవలన కళ్లలోకి నురుగు పోయి కళ్ళు మండి ఆపైన ఒళ్ళు మండి చెంబుడు నీళ్ళు పోసుకుందామని హడావుడిగా చేతి కందినది పుచ్చుకోబోయాడు

"నూనెగిన్నె" అన్నది ఒక కోమలస్వరం—వెర పడిన నేలమీద తొలకరించినట్టు

శంకరం మనసు గిజగిజలాడింది "వెదకపోయిన ..హా వెయ్యేళ్ళు వర్ధిల్లు" మనుకుంటూ మరో వైపు చేయి జావాడు

"కుంకుడురసం" అంది అదే స్వరం దూకి వస్తున్న సెలయేరులా నవ్వు వినబడి గబుక్కున ఆగిపోయింది

బుద్ధి తెలిసినప్పటినుండి తపస్సులోనే గడిపిన వ్యక్తికి దేవుడు ప్రత్యక్షమయినపుడు ' అతను కళ్ళు తెరవలేకపోయినప్పటి పరిస్థితి ఎటువంటిది? కళ్ళు తెరవలేడు—తెరవకుండా ఉండలేడు ఈసారి శంకర. ఉక్రోషం వచ్చింది అయినా నిబ్బచుకుని మరి..ఇంగారుగా చేతికందిన శాల్తీ పట్టుకోబోయాడు

"పెసర కుడితి" !

ఈసారి నవ్వు నొపుకున్న ప్రయత్నమేమీ కనబడలేదు కిలకిల, గలగల నవ్వేసింది

శంకరంకి ఒళ్ళు మండిపోయింది చెట్టంత మగాడు కండ్లలో కుంకుడురసం, నూనె వగైరా పడి నానాయాతనా పడుతుంటే సాయం చేయక పోగా చోద్యం చూస్తుంది—పైగా నవ్వుతుంది ఆఫ్టరాల్ ఆడపిల్ల !" అనుకుని మనస్సులోనే చడమడా తిట్టుకుని ఆ కోపంలోనే కళ్ళు తెరిచెయ్యబోయాడు

కనుబొమలని దేముడు పెట్టింది చెమట వగైరా జారి కంట్లో పడకుండానేగాని కుంకుడురసం వంటి వాటిముందు అవి తమ అశక్తత ప్రకటిస్తాయి

"బాబోయ్ !" అని గావుకేక పెట్టి కళ్ళు గట్టిగా మూసుకుని కూలబడిపోయాడు శంకరం

ఆ క్షణంలోనే చల్లటినీళ్ళు అతని తలమీద

---

నేను హైస్కూలులో చదువుతున్నప్పుడు, క్లాసులో మా మాస్టరుగారు పాఠం చెబుతూ చెబుతూ కుర్రాళ్ళని "నన్ను చూసి నవ్వుతున్నారా ?" అన్నాడు.

"లేదుసార్ ! మిమ్మల్ని చూసి కాదు" అన్నారు కుర్రాళ్లు

"అయితే ఇంతనవ్వు తెప్పించేది ఇక్కడింకేముంది?" అని గర్జించాడు మా మాస్టరు.

ఘం లీలావతి, (మచిలీపట్నం)

---

ఒక బిందెడుదాకా పడకపోతే ఏమయేవాడో గాని నీళ్ళు పడ్డాయి కాబట్టి ఆ ప్రశ్న ఉత్పన్నంకాలేదు హడావుడిగా కళ్ళు నులుముకుని చూశాడు

కాళీ బిందెని పట్టుకుని పక్కన వున్న ఇంకో పంపు దగ్గరకు పోతూ ఒక్కసారి వెనక్కి చూసి సన్నగా నవ్విన అమ్మాయి కనబడింది అతనికి పంపుదగ్గర శంకరం తల్లి నిలబడిఉంది—"పోయకుండా ఉండాలిసింది పార్వతీ లేకపోతే ఇందాక నీళ్ళు పోస్తారా నాయనా అంటే బెట్టుచేశాడు నేను మర్చిపోయి ఆ చెంబు పట్టుకొచ్చేశాను" అంటోంది

బుద్ధిమంతురాలిలాగా చిన్నగా, వినయంగా నవ్వేసింది పార్వతి

"హు" అనుకున్నాడు శంకరం

శరీరానికి భోజనం చేయటం అవసరం కాబట్టి అది కాస్తా ముగించి వరండాలో కూర్చున్నాడు తరువాతి కార్యక్రమం గురించి బెంగపెట్టుకుంటూ

"అత్తయ్యగారూ !" అన్న పిలుపుతో జడత్వం వదిలి ఇహ లోకంలో పడ్డాడు శంకరం.

"రా పార్వతీ, నాన్నగారు ఆఫీసుకు వెళ్లారా ?" అంది సావిత్రమ్మగారు వంటింట్లో ఆ అమ్మాయి కోసం పీట వేస్తూ

నాకు పీట ఎందుకండీ మీరు పని చేసుకుంటుంటే —నేను తరుగుతా విటివ్వండి నిమ్మకాయలు పూర్తగాయకా" అని కత్తిపీట ముందేసుకుని కూర్చుంది

వంటింటికి రెండు గదులు అవతల కూర్చున్న శంకరంకి తనూ అసింటా వెళ్లి వాళ్ల ఇష్టాగోష్ఠి చర్చలో పాల్గొందామన్న సరదా కలిగింది కాని, తల్లి విషయం గుర్తుకొచ్చి సరదా చంపుకున్నాడు అతని కింకో అయిడియా వచ్చింది గబుక్కున లేచి వీధిలో గేటుదగ్గర ఏమీ తోచనట్టు తిరుగుతున్న ఒక కుర్రాడిని పట్టుకుని ఆమాటా ఈ మాటా చెప్పి వరండాలోకి లాక్కొచ్చాడు

"నాన్నగారు వెళ్ళి అప్పుడే గంటయింది మధ్యాహ్నం టిఫిన్ పంపించు అమ్మడూ రంగడ్ని పంపిస్తాను" అన్నారు ఏమయినా కొత్త టిఫిన్, చేయటం చెప్పండి అత్తయ్యగారూ" అంటోం పార్వతి

తనమీద అంత పెద్దరికం ఉంచినందుకు సావిత్రమ్మగారు ఉహు ఇదయిపోయి ఆ పిలుపు విని మురిసిపోతూ, "కాబేజి భాత్", అది చేయు విధము మీదా ఉపన్యసించసాగారు

మంచి విద్యార్థినిలాగా చేస్తున్నపని—నిమ్మకాయలు తరగటం—ఆపి గడ్డంకింద మణికట్టు పెట్టి వింటోంది పార్వతి

సరిగ్గా ఈ సన్నివేశం లోపల జరుగుతుంటే బయట శంకరం తను లాక్కొచ్చిన కుర్రాడితో తను చెప్పిన మాట లన్నిటిని జాగ్రత్తగా వినేట్టు, అలా విన్నందుకు తనదగ్గర అర్ధరూపాయ పుచ్చుకునేట్టు ఒప్పించి—

"ప్రభుత్వం ఈనాడు కళ్ళు తెరిచి దీనికి ఒక శాసనం పెట్టింది గాని నాలాంటివాళ్ళు ఏనాటి నుంచో దీన్ని గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నారు అసలు నామట్టుకు నాకు దాన్ని పుచ్చుకోవడం ఇష్టంలేదు మన వ్యక్తిత్వాన్ని కోల్పోయినట్టే మన్ని మనం అమ్ముకున్నట్టే మనలో ఏమాత్రం ఆత్మగౌరవం ఉన్నా దాన్ని పుచ్చుకోకూడదు. దేన్నయితే "

'అది, దాన్ని, దీన్ని" అని దేన్ని గురించి అంటున్నాడో అంతుపట్టని కుర్రాడు బిక్కముఖం పెట్టి "అసలు మీరు మాట్లాడుతున్నది దేన్ని గురించి మాస్టారూ ?" అనడిగాడు

వంటింట్లోంచి కిలకిల నవ్వు వినబడి అది కొంచెం శృతిమించి దూకివచ్చి శంకరం మతి పోగొట్టింది. నీరయిపోయాడు

"ఎందుకమ్మాయ్ అలా నవ్వుతావు ?" అనడిగింది సావిత్రమ్మగారు "క్యాబేజి ఉడకేసి వార్చి" అని తనన్నదాంట్లో అంత పెద్ద విట్టు ఎక్కడ ఉన్నదా అని విస్తుపోతూ !

ఊగిపోతున్న సన్నజాజి తీగలా నవ్వుతున్న పార్వతి బలవంతాన ఆపుకుని "అదికా దత్తయ్యగారూ, ఒకసారి క్యాబేజి కూర చేద్దామని వాడేస్తే అందులో నీళ్ళు లేక మొత్తం మాడిపోయింది అందుకని ఇక చెప్పండి !" అని వరండాకేసి వోరగా చూసి మళ్లీ నవ్వింది

కొంతవరకు కోలుకున్నా పూర్తిగా ఉత్సాహాన్ని పుంజుకోలేక పోయాడు శంకరం — "నాకు తెలుసోయ్ నీ కర్థంకాదని—అందుకనే నిన్ను పిలిచింది నీలో యింకా చైతన్యం కలగలేదు వరకట్నం అనేది మన సంఘానికి పెద్ద 'మెనేస్' వివాహ వ్యవస్థకి గొడ్డలిపెట్టు నా మట్టుకు నేను అందానికి ప్రాముఖ్యత నిస్తాను కాని కట్నం పుచ్చుకోను నువ్వూ పుచ్చుకోకు" అని ఇంకా ఆ వరసలో ఉపన్యసిద్దామనుకుంటుండగానే—

కుర్రాడు లేచి నిలబడి "మ్యాటినీకి టయిమయింది మాస్టారూ, మీ రిస్తానన్న అర్ధరూపాయిస్తే సినిమాకి వెడతాను" అన్నాడు సాధ్యమయినంత వినయంగా

వాడి వరస నచ్చకపోయినా ఈవాళ్టికి ఇది చాలులే అనుకుని దక్షిణ సమర్పించుకున్నాడు

"అక్కయ్యా, సినిమాకి వెడుతున్నా" అని అరిచాడు కుర్రాడు లోపల ఉన్న పార్వతి నుద్దేశించి

ప్రాణం ఎగిరిపోయింది శంకరంకి !

"మొన్ననే కదురా వెళ్ళింది—చదువూ సంధ్యా లేక అడ్డగాడిదలా తయారయావు ఛీ ఛీ!నే వొద్దంటే మట్టుకు ఆగుతావా" అని ఫక్కున నవ్వి, "అరగంట కష్టపడి సంపాయించుకున్నావ్" అంది తాజా బాణంగా !

వాడు పరుగెట్టు కెళ్ళిపోయాడు

"మీ తమ్ముడేం చదువుతున్నాడు పార్వతీ!" అనడిగింది సావిత్రమ్మగారు

"ఫోర్తుఫారం తప్పాడండీ వెధవకి వాడి చిన్నప్పుడే మా అమ్మ పోవడంతో బెంగెట్టుకుంటాడని గారాబంగా పెంచారు నాన్నగారు దాంతో ఇప్పుడు మేకయి కూర్చున్నాడు నేనంటే కూడా భయం లేదు ఎవరన్నా మంచివాళ్ళని చూసి ప్రయివేటు చెప్పిం- -ంది" అంది

-- నుంచి మావాడి దగ్గర కుదురుగా కూర్చున్నాడుగా—వాడినే చెప్పమంటాను వాడూ ఖాళీగానే ఉన్నాడు ప్రయివేటంటే డబ్బుకి కాదు సుమీ ! పొరుగువాళ్ళం ఆమాత్రం సాయం చేసుకో కూడదూ ? నీ కడుపు చల్లగా నాకు నిమ్మకాయలు తరిగిపెట్టావు పొద్దున్నుంచి బెంగెట్టుకున్నానంటే నమ్ము ! నాకు చేతిగోళ్ళ మంచివి కావు పులుపు, కారం తగులుతే మంటలెత్తిపోతుంది ఎవరింట్లో పడతావో గాని మీ అత్తగారు సుఖపడుతుంది" అంది మనస్సులోనే ఆశీర్వదించుకుంటూ

సిగ్గుతో బుగ్గలు ఎర్రపడ్డాయి పార్వతికి !

కోరని వరంలా వచ్చిన ఈ అవకాశం శంకరాన్ని బ్రహ్మానందపరిచింది "మొత్తానికి దేవతలు వస్తైరా పాపం మంచివాళ్ళే సుమీ" అనుకున్నాడు కాని అతనికి నచ్చనిదల్లా ఆ అమ్మాయి ప్రవర్తన తమ్ముడికి పాఠాలు చెబుతున్నాడు కదా—తను ఒక్కసారి వచ్చి "ఏమండీ మా తమ్ముడు ఎందులో వెనకబడ్డాడు, ఎలా చదువుతున్నాడు—ఏదో మీ చేతుల్లో పెట్టాం కాబట్టి నాకెంతో ధైర్యంగా ఉంది" అనటాని మంచి చెడ్డా మాట్లాడకపోగా తనవంక రోజుకి రెండో మూడో వోరచూపులు తప్పించి సరిగా కన్నెత్తి చూడదు ! ఆ అమ్మాయి పెంకెతనం శంకరానికి బావుండలేదు అందుకే తనకి తెలిసిన ఆంజనేయులు దగ్గరికి పరుగెత్తాడు.

ఆంజనేయులు పేరుమోసిన భగ్నప్రేమికుడు "అసలు ప్రేమ ఫలిస్తే థంజాలేదు భగ్నప్రేమలోనే ప్రేమ తత్వం బోధపడి వంట పడుతుంది" అన్నది అతని మోటో ! "నేను ప్రేమించి కోర్టింగు సాగిస్తున్న అమ్మాయి నన్ను ప్రేమించబోతోందని ముందుగా పసిగట్టితే వెంటనే ఆ అమ్మాయి పేరు చెరిపేసి మరో అమ్మడిపేరు రాసేవాడిని హృదయం మీద. అదేదో సినిమాలో నాగేశ్వరరావు అన్నట్టు "వివాహ ప్రేమనాశాయా" అంటాడు అంజనేయులు

"ఏడిశాడు పేరుకు తగ్గ రూపం" అంటారు కిట్టనివాళ్ళ

అతని ప్రేమకేసులు విని సలహాలిచ్చి తృణం, సహాయం చేసి పణం పుచ్చుకుంటూ ఉంటాడు తన విషయం సవిస్తరంగా మనవి చేసుకుని "అదిరా "అదిరా సంగతి" అన్నాడు శంకరం

వినటమే తడవుగా "ఆ అమ్మాయి మీ అమ్మగారిని 'అత్తయ్యగారూ' అని పిలిచి అటుమంచి నరుక్కొస్తోంది కాబట్టి నువ్వుకూడా ఆపిల్ల—

"ఒరేయ్ ?"

"సారీ, ఆ అమ్మాయి అడుగుజాడల్లోనే నడవాలి"

"అంటే ?" అన్నాడు అంటే ఏమిటో అర్థం కాని శంకరం

చనువుగా జేబులో చేయిపెట్టి సిగరెట్టుపెట్టి, లైటరు తీసుకుని అంటించి తన జేబులో పడేసుకుని, పొగలోంచి లైట్‌గా నవ్వాడు ఆంజనేయులు

"అంటే నువ్వు వాళ్ళ నాన్నని మచ్చిక చేసుకోవాలి"

"ఆయనకు కూడా సిగరెట్టుపెట్టె, లైటరూ కావియ్యాలా ?"

"చచ్చు పిట్లు వేయకు ఆయన కనబడినప్పుడల్లా నమస్కార బాణాలతో ఉక్కిరిబిక్కిరి చేసెయ్ నీ వినయం, వందనం చూసి ముగ్ధుడయిపోయి—"

వీధిలోకి పరుగెత్తాడు శంకరం — ఆయన ఎప్పుడు కనబడతాడా, కార్యాచరణంలోకి దిగుదామా అని గేటుదాటి లోపల అడుగు పెట్టబోయిన శంకరంకి గోడలాంటి శాల్తీ ఒకటి తలకి తగలటంతో దిమ్మతిరిగిపోయింది 'అబ్బ' అని నుదురు పుచ్చుకుని తల పైకెత్తిన అతనికి అదే పరిస్థితిలో గేటు కటుపక్కన నిలబడిన తాసిల్దారుగారు కనబడ్డారు — కళ్ళజోడు సరిజేసుకొంటూ

అంత బాధలోనూ గబుక్కున చేతులు పైకెత్తి "నమస్కారమండి" అనేశాడు సవినయంగా

"ఏడవలేకపోయావు దృష్టి సరిగా ఆనదా ? కనబడినవాళ్ళ నందరినీ డీడిక్కులు కొట్టకపోతే కళ్ళజోడు కొనుక్కోరాదూ ?" అని కోపంగా అనేసి బయటికి వెళ్ళిపోయా రాయన

నీరయిపోయాడు శంకరం

శిష్యుడికి పాఠాలు హెహారాహారీగా సాగిపోతున్నాయి కనబడినప్పుడల్లా వాళ్ళ నాన్నగారికి నమస్కారాలు దంచేస్తున్నాడు కోర్టింగు పెళ్ళనసాగిపోతోంది—

ఒకరోజు ఆరుబయట వెన్నెట్లో కూర్చుని ఉన్నప్పుడు—

"మీ దగ్గర ప్రయివేటు వలన నాకు పాఠాలు రాకపోగా పోసుకోలు కబుర్లు ఎక్కువయాయిట!" అన్నాడు శిష్యుడు శంకరంతో

శంకరం కొయ్యబారిపోయాడు కాని అంతలోనే అది సత్యమేనన్న నగ్నసత్యం స్ఫురించి పుంజుకుని




" . మీగుండె నిక్షేపంలావుంది మరి.. వాదో.. ?"

# ఆద్యంతాలమధ్య అతను

"జీస్ ఇంగ్రాటిట్యూడ్!" అన్నాడు "గిరీశం ఇటు వంటి సన్నివేశం ఎదురుక్కున్నప్పుడు ఏమన్నాడో తెలుసా ? ఎందుకు తెలుస్తుంది" అసలు నాతో మాట్లాడటమే ఒక ఎడ్యుకేషనోయ్" అనేశాడు ఇవనలు మంచికి రోజులు కావోయ్—'దీస్ ఆర్ నాట్ ది డేస్ ' దాకా అనేసి అక్కడ 'ఆఫ్, ఫర్, టు' ఈ మూడింటిలో ఏది వాడాలో తేలక తికమకపడి తేలిగ్గా వినబడీ వినబడకుండా తేల్చేసి" సిన్సియారిటీ మై బాయ్" అనేశాడు—వాక్యాన్ని పూర్తి చేయగలిగినందుకు ఉప్పొంగిపోతూ

కాసేపాగి "అనటం అంటే అనేశారు గాని ఇటువంటి ముక్కలు ఆ అన్నవాళ్లు చెప్పగలరా మీకు—ఇంతకీ ఎవరూ ఆమాట అంట ?" అనడిగాడు

"మా అక్కయ్యండీ" అన్నాడు శిష్యుడు వినయంగా

గొంతులో తీయటి వెలక్కాయ పడింది శంకరానికి—

"అక్కయ్య మీ అక్కయ్య యు మీన్ మీ సిస్టర్ ఏదీ—మీ అక్కయ్య ."

"అదుగోనండి మా అక్కయ్య" అన్నాడు కుర్రాడు మాస్టారిని మధ్యలోనే ఆపకపోతే డేంజరని గ్రహించి.

కుర్రాడు చూపించిన వైపు చూశాడు శంకరం ఇరుగు పొరుగు పిల్లలని పోగేసి వెన్నెట్లో మంచం మీద తన చుట్టూ కూర్చోబెట్టుకుని కథ చెప్పే పోజులో ఉంది పార్వతి అతన్ని ఒకసారి వోరగా చూసి ఫక్కున నవ్వుతామని సరదా పడుతున్న పెదిమల్ని వారించే ఉద్దేశంతో కింది పెదవిని మునిపంటితో నొక్కిపట్టింది.

పౌరుషం విజృంభించింది శంకరానికి—"తీయ హోయ్ సైన్సు పుస్తకం" అన్నాడు నిర్లక్ష్యంగా అమ్మడివైపు చూస్తూ

ఉన్నవాటిలో సైన్సు బుక్కు ఏదో తెలియక, తెలిసినవాటిలో ఎటూ తేల్చుకోలేక చేతికందింది అయుంటుందన్న నమ్మకంతో ఒకటి తీసి యిచ్చాడు శంకరంకి

గబుక్కున తెరిచి ఒక్కసారి చూసి మళ్లీ మూసేసి "టూకీగా పాఠం చెబుతాను విని తరువాత చదివి అనుమానాలు ఉంటే అడుగు" అని హెచ్చరించి ప్రారంభించాడు శంకరం అమ్మాయి వైపు చూస్తూ

" అప్పుడు ఆ బలిచక్రవర్తి వామనుడి వేషం వేసుకుని కృష్ణుడి దగ్గరకు వచ్చి మూడడుగుల నేల కావాలన్నాడు "

"అదికాదు మాస్టారూ " ఏదో చెప్పబోయిన శిష్యుడిని కోపంతో వారించాడు శంకరం

"పాఠం మధ్యలో అడ్డంవేస్తే 'ఫ్లో' పోతుంది అప్పుడేమయింది ఆ, మూడడుగుల నేల కావాలన్నాడు ఆల్‌రైట్ తీసుకోమన్నాడు కృష్ణుడు దాంతోటి బలిచక్రవర్తి ఏంచేశాడు—"

"మాస్టారూ" అరవబోయాడు కుర్రాడు

అంతకన్న బిగ్గరగా "నోరుముయ్" అని పార్వతి వంక చూస్తూ "ఏంచేశాడంటే ఒక పాదంతో ఆకాశాన్ని, మరో పాదంతో నేలని ఆక్రమించి" మూడవది ఎక్కడ పెట్టమంటావు?" అని అడిగాడు అందుకు కృష్ణుడు "మహాప్రభూ! నా తలమీద పెట్టండి" అన్నాడు దాంతోటి మూడవ అడుగు కృష్ణుడి తలమీద పెట్టి అతన్ని పాతాళంలోకి అణిచేశాడు బలిచక్రవర్తి" అంటూ పూర్తిచేసి 'హమ్మయ్యా' అనుకునేంతలో .

ఉప్పెనలా నవ్వు వినబడింది సముద్రపు అలలలా తల్పుకు తల్పుకు నవ్వుతోంది, పార్వతి చుట్టూ ఉన్న పిల్లలకి 'అక్కయ్య' ఎందుకు నవ్వుతోందో తెలియకపోయినా ఆమెను చూసి నవ్వటం మొదలెట్టారు

శంకరంకి ఒళ్లు మండిపోయింది "చెప్పకపోతే చెప్పలేదంటుంది—చెపుతే ఇలా నవ్వుతుంది ఈ అమ్మాయికి ఎంత పొగరు" అనుకుంటూ శిష్యుడి వైపు తిరిగాడు ఎంత పొగరో చెప్పేద్దామని

వాడూ నవ్వుతున్నాడు !

"అదికాదు మాస్టారూ, పాతాళంలోకి తొక్కేసింది కృష్ణమూర్తిని కాదండీ ! బలిచక్రవర్తిని

---

టీచర్:- 'జగమెరిగిన బ్రాహ్మణునకు జందేమేలా?' అంటే ఏమిటిరా?

గోపీ:-బ్రాహ్మణునకు జందె ముంటుందని జగమెరుగును ... అందుచే బ్రాహ్మణునకు జందె మనవసరమని భావము సార్!

—అవధానుల అప్పారావ్.
(విశాఖపట్నం)

---

వామనరూపంలో ఉన్న విష్ణుమూర్తి !" అన్నాడు బలవంతాన నవ్వు నాపుకుంటూ

శంకరం తప్పు తెలుసుకుని అవమాన భారంతో కుంగిపోయాడు

"మతులు సరిగా లేనప్పుడు కథలు చెప్పమని ఎవరు ఏడిచారో !" అని జనాంతికంగా అని మళ్లీ నవ్వసాగింది పార్వతి.

'కథ' అనే మాట వినేప్పటికి పిల్లలకి హుషారొచ్చింది. "ఏమన్నా కథ చెప్పక్కయ్యా" అని అంతా గోల చేయసాగారు బలవంతాన నవ్వు ఆపుకున్న పార్వతి వోరగా 'గురువుగారి' వంక చూస్తూ ప్రారంభించింది

" అప్పుడు ఏడు చేపలూ వేటకి వెళ్లి "

పరధ్యానంగా కథ వింటున్న శంకరం ఒళ్లంతా చెవులు చేసుకుని వినసాగాడు

" వెతికి వెతికి సాయంత్రానికి ఏడు రాజకుమారుల్ని చంపాయి "

ఫెళ్ళున నవ్వాడు శంకరం !

తెల్లబోయింది పార్వతి !

"నవ్వవోయ్ శిష్యా—పావలా ఇస్తాను" అనివాడితో సహా విరగబడి నవ్వసాగాడు

పార్వతికి చర్రున కోపం వచ్చేసింది "ఏదో ఆడపిల్లలు కథలు చెప్పుకుంటుంటే రౌడీలాగా "

"అదికా దక్కయ్యా, వేటకి వెళ్లింది చేపలు కాదు రాజకుమారులు ! చంపింది చేపలని !" సరిచేస్తూ చెప్పచూపింది ఒక చిన్నపిల్ల

పార్వతి నిలువునా సిగ్గుపడి పోయింది

"మతులు సరిగా లేనప్పుడు కథలు చెప్పమని ఎవ ఏడిచారో ?" అన్నాడు శంకరం

అవమానం కోపంగా మారి ముఖం ఎర్రపడగా, ముక్కుపుటాలు అదరగా "హు" అని హుంకరించి ముందుకు పడబోయిన జడని తీవ్రంగా మందలించి వెనక్కి పంపి విసురుగా ఇంట్లోకి వెళ్లిపోయింది పార్వతి

పిల్లలు తెల్లబోయారు

తన ప్రేమగాథ ఇలా అంతులేని సీరియల్ కథలా సాగిపోవటం మహా బాధగా ఉంది శంకరానికి అటుచూస్తే తాసిల్దారుగారు తను నమస్కారం పెట్టినప్పుడల్లా ఏదో దొంగని చూసినట్టు చూస్తాడు ఇటు అమ్మాయి కథలు చెప్పుకున్న రాత్రి నుంచి తన కంటికి కనబడినా ఇంకా కోపం పోనట్టే చూస్తోంది ఈ పరిస్థితుల దృష్ట్యా అతనికి మతిపోయినట్లయి ఆంజనేయులుని వెంటేసుకుని హొటలుకి బయలుదేరాడు

స్వీటుని విలాసంగా తింటూ మిత్రుడి గోడు విన్నాడు ఆంజనేయులు

"ఒక్క వారం లోపల ఎటోఅటు తేలకపోతే నే బ్రతకలేను గురూ !" అన్నాడు శంకరం ఆఖరి మాటగా కారం ప్లేటుని అతని ముందుకి తోసి

కాఫీ పూర్తయాక కిళ్లీ బుగ్గన తాటించి సిగరెట్టు వెలిగిస్తూ "వారంలోపల నిన్నొక ఇంటివాడిని చేసే బాధ్యత నాది" అని అభయముద్ర పట్టాడు ఆంజనేయులు

కొండ ఎక్కినంత పనయింది శంకరానికి ఎనిమిదవ రోజున పార్వతితో కలిసి ఏ సినిమాకి వెడితే బాగుంటుందా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు

"ఎల్లుండి సముద్ర స్నానాల రోజు—ఆరోజు మనం కృష్ణలో స్నానానికి వెడుతున్నాం మీ శిష్యుడ్ని వాడి స్నేహితులతో సహా వచ్చి రేవులో మన్ని కలుసుకోమను" అన్నాడు ఆంజనేయులు

"కలుసుకుంటే ?"

"తరువాతది కృష్ణాతీరం సెట్టింగ్‌మీద చూడుడు" అని నవ్వాడు ఆంజనేయులు

అతని ప్లాను ప్రకారం జరగవలసిన కార్యక్రమం మిది

రేవులో కలుసుకున్న శిష్యుడ్ని వాడి స్నేహితులతో సహా తనతో అంటే ఆంజనేయులు అండ్ శంకరంలతో కొంచెం అసింటా జనం రద్దీ అట్టే లేని రేవులోకి తీసుకువెళ్లడం శిష్యుడ్ని తనతోపాటు స్నానానికి దింపి లోతుగా ఉన్న ప్రదేశానికి తీసుకుపోయి అతనికాలు జారేట్టు చేసి రెండు మూడు గుటకలు వేయనిచ్చి శంకరంద్వారా అతన్ని రక్షించడం ఈ కార్యక్రమం యావత్తూ ఆంజనేయులు అతని మిత్రులు మరో ఇద్దరు పర్యవేక్షించేట్టు !

ఈ అయిడియా అతని సొంతం. 'అన్యధా శరణం నాస్తి' అనుకున్న కేసుల్లో వాడదామని అట్టే పెట్టుకున్నాడు "ఏమిటి దీనివలన లాభం?

అని ఎవరయినా అడుగుతే దానికి జవాబు కూడా అతని దగ్గర రెడీగా ఉంది "శిష్యుడు వాళ్ల నాన్నకు ఏకైక పుత్రుడు అతి గారాబంగా పెరిగాడు కాబట్టి గాబరా, ప్రాణభయం ఎక్కువ అలాంటివాడు ఒక్క గుక్కెడు నీళ్ళు తాగినా తన ప్రాణం పోయిందంటే నమ్మేస్తాడు. కాబట్టి వాడిని రక్షించి వాడి ద్వారా 'ప్రాణదాతగా' వాళ్ల యింట్లో ప్రవేశం సంపాయించి, వాళ్ల నాన్నగారితో పరిచయం సంపాయించటం, ఆయన అభిమానాన్ని చూరగొనటం, ఆయన ఇంటి అల్లుడవటం!

ప్లాను మట్టుకు బేషుగ్గా ఉంది గాని అది జరగటంలోనే కొద్ది తేడా లొచ్చాయి శిష్యుడు మునిగిపోతున్నాడన్న ఖంగారుతో శంకరం కూడా కాలుజారి రెండు గుక్కలు నీళ్ళు తాగేశాడు దాంతో ఆంజనేయులు ఇద్దర్ని జుట్టూ పట్టుకుని ఇవతలికి లాక్కొచ్చి గుర్రబ్బండి మాట్లాడి అందులో కూలేశాడు దారిలో మట్టుకు కుర్రాడికి చెప్పాడు "నువ్వు మునిగిపోతుంటే మీ మాస్టారు తన ప్రాణానికి తెగించి నిన్ను రక్షించాడు ఆ రక్షించటంలో వాడు కూడా కొట్టుకుపోబోయాడు కాని మంచి బలశాలి కావటాన నిలదొక్కుకున్నాడు" అని.

కుర్రాడి హృదయమంతా మాస్టారి పట్ల కృతజ్ఞతతో నిండిపోయింది "మిమ్మల్ని గురించి ముందు మా నాన్నగారికి చెప్పి నా ప్రాణం రక్షించారని చెప్తాలి నేరుగా మా ఇంటికి రండి మాస్టారూ" అంటూ ఏడుపు మొదలెట్టాడు

శంకరం నీరసంగా నవ్వి 'సరేనని ఆంజనేయులుతో మట్టుకు "నువ్వు చేసిన పనేమీ బావుండలేదురా ఎంత డేంజరు, ఏంత అపాయం?" అంటూ గుండెలు బాదుకున్నాడు చాటుగా

"డేంజరంటే అపాయం అని మాకు తెలుసు గాని నువ్వు నోరుమూసుకో" అని హెచ్చరించి ఇంటి దగ్గర దింపాడు

ఇంట్లో అడుగు పెట్టగానే "నాన్నోయ్, శంకరంగారు నన్ను చావకుండా బతికించారు నాన్నా" అంటూ గావుకేకలతో, ఏడుపుతో జరిగినదంతా చెప్పాడు

తాసిల్దారుగారు కూడా కాసేపు విస్తు శంకరాన్ని కావలించుకుని, అతని ఋణం ఈ జన్మకి తీర్చుకోలేనని హామీ యిచ్చి "అమ్మాయ్ పార్వతీ, నాలుగు కప్పులు కాఫీ పట్టు కురావమ్మా" అనరిచాడు

"సినిమా ఆఖరి రీలులో ఉందిరా అబ్బీ" అని హెచ్చరించాడు ఆంజనేయులు

ట్రేలో కాఫీలతో ప్రవేశించిన పార్వతికి తండ్రి జరిగినదంతా చెప్పి "ఈయనే మన గోపీగాడిని రక్షించింది" అన్నాడు

కాఫీలు తాపీగా బల్లమీద పెడుతూ

"మన ఇంటి పక్కవాళ్లబ్బాయి ఈయనే— గోపికి మాస్టారు" అంది పార్వతి

"అలాగుటోయ్, అయితే మా సుబ్బారావు కొడుకునందూ ఒక్క మాటలో! భలేవాడివే, దణ్ణాలు పెడుతుంటే ఏదో ఉద్యోగం కోసం వస్తున్నావనుకున్నాను, సుమీ ఇన్నాళ్లు" అని ఫెళ్లున నవ్వి కాఫీ గబగబ తాగేసి "ఇది మీ ఇల్లు లాగానే భావించవోయ్ శంకరం, మరి నే వస్తా పార్టీ ఒకటుంది" అని వాళ్ల దగ్గర శలవు తీసుకుని వెళ్లిపోయా రాయన

పరిస్థితి గ్రహించి ఆంజనేయులు గోపీని మార్నింగ్ షోకి వెడదాం రమ్మని బయటికి లాక్కుపోయాడు

శంకరం ఖంగారు పడిపోయాడు!

"అయితే పాపం మిమ్మల్ని, మా తమ్ముడిని కూడా నీళ్లలోంచి బయటకు లాగాడుటగా ఆయన" అంది నవ్వుని ఆపుకుంటూ పార్వతి

---

ఒక మనిషి వీధిలో నిలబడి, దారినిపోయే ఒక మనిషితో 'అయ్యా! మీరు వెళ్లి ఈ యింటిలో తన భర్తను తిట్టున్న స్త్రీని కాస్త ఆపు చెయ్యండి. మీకు పుణ్యముంటుంది." అన్నాడు. అందుకు రెండవవాడు "ఆమె ఎవరు?" అని అడిగాడు.

మొదటివాడు:-ఆమె నా భార్య.

సుంఖా వెంకటసుబ్బారావు (అమలాపురం)

* * *

భర్త భార్యతో:-ఏమే మీ నాన్న ఏదో దానము చేస్తున్నట్లుందే.

భార్య:-"మా నాన్న యిట్టే ఉపయోగము లేని వస్తువులన్నీ యితరుల నెత్తిన కట్టివేస్తాడండీ.

భర్త:-అవును నాతలకుగూడ ఒకటి కట్టాడు లే.

జి. భాస్కర్ (పాల్వోరి)

---

తెల్లబోయాడు శంకరం—"ఎవరు చెప్పారు?" అన్నాడు

"అహ ఎవరూ చెప్పలే దనుకోండి, మీ వాలకం చూసి వూహించాను ఇప్పుడు మీ సమాధానం బట్టి నిర్ధారణ అయిపోయింది. మీకు ఈత రాదా?' అని పమిటచెంగు అడ్డుపెట్టుకుంది

మాట్లాడలేదు శంకరం

"ఎందుకు ఇన్ని అవస్థలు పడుతున్నారు? మా తమ్ముడు నిజంగా నీళ్లలో పడ్డాడా?"

శంకరాన్ని నిస్పృహ ఆవరించింది తన ప్రయత్నాలన్నీ వ్యర్థం ఈ అమ్మాయి బయటికి ఎంత నాజూగ్గా కనపడుతుందో హృదయం అంత కఠినం. తోటి మానవుడిని చూసి కరగదు ఎటూ తన జీవితం వ్యర్థం—తెగింపుకు వచ్చేశాడు

"అవును మీ తమ్ముడు నీళ్లలో పడలేదు మా ఆంజనేయులే రెండు గుక్కలు వేయించి నన్నూ, వాడిని కలిపి బయటికి లాగాడు కాని భగవంతుడి సాక్షిగా నీడు చేయబోయే పని నాకు తెలియదు మావాడికి గూడా దురూహ లేదు" ఆవేశాడు ఆవేశంగా

"మరెందు కింత నాటకం?" మాటిగా, చిలిపిగా అడిగింది పార్వతి

"మీ ఇంటిలోకి ప్రవేశం కోసం చేయించాడు!"

తనకి కావలసిన సమాధానం ఇంకా రాలేదు పార్వతికి—"అయితే మీరెందుకు చేశారు?"

"నీకోసం, నీ హృదయంలో స్థానం కోసం ప్రయత్నించాను కాని అది పొందలేకపోయాను"

"నన్నే నేరుగా అడగలేకపోయారూ?" అంది జాలిగా.

ఆశ ముస్తిరికొన్నది శంకరాన్ని!

"అడిగితే?"

సిగ్గుతో తల వంచుకుంది పార్వతి రాగరంజిత మయిన ఆమె బుగ్గలు చూసి గాలిలో తేలిపోయాడు శంకరం ఆమె ముందు ప్రేమికుడి పోజులో మోకాలుదండా లేసి ఆమె కుడిచేయి పట్టుకుని తన హృదయంమీద పెట్టుకున్నాడు—

"దాని స్పందన విను—అది ఏమంటోందో? జీవనదిలాంటి నీ మనసుకు ప్రేమ అనే నాగార్జున సాగర్ డామ్ కట్టి పల్నాటిసీమలా ఎండి బీటలు వారిపోతున్న నా హృదయసీమను పండించవూ?" అన్నాడు

ఫకాలున నవ్వేసింది పార్వతి ముత్యాలు తలమీద పడ్డాయేమో నన్నట్టుగా తల తడుముకున్నాడు.

"డాం కట్టాలంటే కృష్ణవేణికి ఇష్టమే కాని గవర్నమెంటువారు ఒప్పుకో నక్కరలా?" అంది కళ్ళు పెద్దవి చేస్తూ

"అయితే అప్లికేషను పెట్టుకోనా?" హుషారుగా అడిగాడు

"మీరేం పెట్టనక్కరలా! మా నాన్న, మీ నాన్న ఒకప్పుడు క్లాసుమేట్సు, దూరపు బంధువులుట నిన్న ప్రారంభమయ్యాయి సంభాషణలు"

గభాలున లేచి నిలబడ్డాడు

"ఏమిటి?" అని సంతోషంతో ఒక్క అరుపు అరిచాడు

"మా నాన్నగారు రష్యాలాగా మొండి పట్టుదల పట్టకుండా ఉంటే ఈవాళ్ల సాయంత్రం ఎగ్రిమెంటుమీద సంతకాలు జరుగుతాయి" అంది నవ్వుతూ అతనివంక చూసి

"ఇల సాటిలేని అదృష్టవంతు డీ శంకరం" అంటూ ఆమెని చేతులతో చుట్టేయబోయాడు.

"నో, నో, ఇంకొద్ది రోజులదాకా—సారీ!" నాజూగ్గా, అందంగా వెనక్కి తోసేసింది అతన్ని పార్వతి

ఈ కథంతా చదివి "ఆ, ఉట్టి ఫార్ములా కథలా ఉంది" అనుకుంటున్నారా మీరు?

భలేవారే, ఫార్ములా కథేనండి ఇది! ★

తండాను, గ్లాసుతెచ్చుకోండి త్రాగుదురు గాని!" అని ఒక్కసారి కేక పెట్టింది. పేరిశాస్త్రిలు ఉలిక్కిపడి లేచి సరదాగా గ్లాసుపుచ్చుకుని వంటింట్లోకి వెళ్ళాడు. జన్మలో 'అరిసె' మొహం తెలియని వెఱ్ఱిబాగులవాడవటం వల్ల పాకమే అరిసెలనుకొని పరమానందంతో త్రాగేసేడు.

కొద్దిరోజులు గడిచిపోయాక పేరిశాస్త్రిలకు ప్రక్కవూరిలో వున్న తన చెల్లెలిని చూసి రావాలని బుద్ధి పుట్టింది. మూటా ముల్లె కట్టుకుని చెల్లెలింటికి వెళ్లాడు. రాకరాక వచ్చిన అన్నగారిని చూచి చెల్లెలు మహానందపడింది. ఆవిడది కాస్త పెద్దసంసారం. నలుగురైదుగురు పిల్లాపాపలతో, గొడ్డుగోదాలతో, చుట్టపక్కాలతో ఎప్పుడూ చేతినిండా పనిలో యిరవై నాల్గు గంటలు ఆవిడకు తీరికలేకుండా వుండేది. అన్నగారు వచ్చాడుకదా, రోజూ ఫలహారంచేసి పెట్టకపోతే బాగుండదు. రోజూ చెయ్యడానికి తనకు పిల్లలతో తీరికలేదు. అందుకని అరిసెలుచేసి పెట్టుకుంటే నాలుగు రోజులపాటు నిలవ వుంటాయి, పిల్లలకి అతనికి పెట్టవచ్చునని, ఆవిడ చక్కగా అరిసెలు చేసింది.

ఫలహారానికి అన్నగారిని పిలుస్తూ ఎంతో ఆదరంగా "అన్నయ్యా! ఈ అరిసెలు తిను" అని విస్తట్లో పెట్టింది. పేరిశాస్త్రిలు ఎగిరి ఒక్క గంతు వేసి ఏమే! అమ్మాయ్! మా బాగుందేవ్! తెలియపోతే యింకా వేళాకోళం పట్టిద్దువు. ఎంత తెలివితక్కువ వాడనైనా, అంత అరిసెల మొహం తెలియనివాడినికాను. అరిసెలు తాగు

## అరిసెలు

(31-వ పేజీ తరువాయి)

తారుకాని తింటారటే! ఎంత పేద వాళ్ళమైనా మాకూ అంత పిండి వంటల మొహం తెలియదనుకోకు! మొన్ననే మీ వొదినచేత అరిసెలు చేయించుకు త్రాగాను' అని నిష్ఠుర మాడాడు. చెల్లెలు అన్నగారి అమాయకత్వానికి జాలిపడి వదిన చేసిన మోసానికి ముక్కుమీద వేలేసుకుంది.

అన్నను మోసపుచ్చి నందుకు వదినకు తగినవిధంగా బుద్ధిచెప్పాలని ప్రతిజ్ఞపూనింది. ముందు అవి అరిసెలని అన్నగారికి రుజువు చెయ్యాలి. అందుచేత దారిన పోతున్న చిన్నకుఱ్ఱాడిని పిలిచి "బాబూ! యీ విస్తట్లో వున్న వేమిటో చెప్పవయ్యా?" అని అడిగింది. వాడు వెంటనే "అదేమిటి! అలా తెలియనట్లు అడుగుతావు! అవి అరిసెలుకావా?" అని జవాబిచ్చేడు. చెల్లెలు మళ్లీ దారిన పోతున్న ముసలాయన్ను పిలిచి "తాతా! ఈ విస్తట్లోవున్న వేమిటో చెప్పు!" అని యిందాకటి ప్రశ్ననే వేసింది. దానికాయన "అదేమిటమ్మాయ్! అలా అడుగుతావు? అవి అరిసెలుకావా!" అనుకుంటూ వెళ్ళిపోయాడు. ఇలా నలుగురైదుగురిని పిలిచి, అడిగేటప్పటికి "అవి అరిసెలుకావా!" అనుకుంటూ వెళ్లిపోయాక ఇలా నలుగురైదుగురిని పిలిచి, అడిగేటప్పటికి అవి అరిసెలేనని పేరిశాస్త్రికి నమ్మకం కలిగింది. వెంటనే అతనికి గారిచేసిన మోసం తెలిసివచ్చింది. అతనిక్కూడా గారికి బుద్ధిచెప్పాలని తోచింది. కాని అమాయకుడు కావటంవల్ల, ఎలాగో తెలియక చల్లగా వూరుకొని కమ్మటి ఆ అరిసెలు తింటూ కూర్చున్నాడు. అన్నగారి అవస్థ గ్రహించిన చెల్లెలు తానిదివరకే దీనికొక ఉపాయం ఆలోచించానని వూరికి వెళ్ళబోయేముందు చెప్తానని చెప్పింది.

పేరిశాస్త్రిలు వారంపదిరోజులు పోయాక యింటికి తిరుగుప్రయాణం కట్టేడు. అన్నగారు వూరికెళ్ళేనాటికి ఏదో పొడితయారుచేసి, చిన్న పొట్లాంకట్టి చేతికిచ్చింది చెల్లెలు.

---

తండ్రి:-స్థితిగతులు, తెల్సుకోకుండా, అలా ఎవర్నో బడితే వాళ్లని, ప్రేమించి పరిస్థితులు ప్రమాదానికి తెచ్చుకోవడం తప్ప ఇంకేమయినా వుందా!

కుమారుడు:-లేదు నాన్నా, ఈ దఫా అలాకాదు. ఆ అమ్మాయికి అన్నలు - తమ్ముడు - అక్కలు చెల్లెళ్ళు లేరు. ఆస్థి బోలెడు వుంది. తల్లికి కొంచెం చాదస్తం. ముఖ్యంగా తండ్రి ముసలివాడు, చూపు ఆనదు. ఈ స్థితిగతులు, నేను గ్రహించే ఈ నిర్ణయానికి వచ్చాను

తండ్రి:-మంచిపని

* * *

స్నేహితుడు:-నేచెప్తే విన్నావా? వాళ్లంతా "వస్తాదులు" అంటే?

స్నేహితుడు:- మేంమటుకు! "పహిల్వాను"ల వంశం వాళ్లం కాదా!

స్నేహితుడు:-అయితే నీ వతని చేత, తన్నులు తిన్నావెందుకు?

స్నేహితుడు:-దాన్ని తన్నులు తినడం అనకు! ఒక విధంగా "చిత్తవడం" అంటారు అంతే!

కొట్లూరి రాజారావు (మాచ్ ఖండ్)

---

మెడలోని కంటెను తీసిచ్చి అన్నగారితో "అన్నయ్యా! నువ్వా వొదినా కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నపుడు కంటె ఆవిడ కంట బడేటట్లు చెయ్యి. కంటె యివ్వమని అడగ్గానే మెడకు కాస్త గంధం పూయించుకుంటేనే గాని కంటె యివ్వనను-మాటలసందడిలో గంధంలో కాస్త యీదూలగుండ పొడిని కలిపి ఆవిడ మెడకు పట్టించు. అదే తగినశాస్తి" అని చెప్పింది.

పేరిశాస్త్రులు చెల్లెలు మాటలకు 'సరే' నని, ఆ పొడిని వూరికి పట్టుకుపోయాడు. చెల్లెలి సలహా ప్రకారం భార్యతో కబుర్లాడుతూ కంటెను కనపడేటట్లు చేసాడు ఆవిడ కంటె యివ్వమని అడగ్గానే, కాస్త గంధం పూయించుకోమన్నాడు. "గంధమే కదా పోయిందేమిట"ని గౌరమ్మ గంధం పూయించుకుంది. పూసీ పూయగానే గౌరమ్మ గంతులు వెయ్యడం ప్రారంభించింది. బాధ భరించలేక 'కుయ్యో! మొర్రో'మని ఏడవడం మొదలుపెట్టింది. ఎలాగైనా సరే! ఆ దురదలు తగ్గించమని బ్రతిమాలాడ్డం ప్రారంభించింది.

పేరిశాస్త్రులు యిదే అదనను కొని "అరిసెలు త్రాగించగా లేనిది దురదలు తగ్గించుకోలేవా?" అని దెప్పి పొడిచాడు. గౌరి తన తప్పు తెలిసికొని, భర్తని క్షమాపణ కోరుకుంది. ఇక జన్మంలో అటువంటి పాడుపని చెయ్యనని చెంపలు వేసుకుంది.

పేరిశాస్త్రులు అప్పటికి కోపం తగ్గి శాంతించి, గౌరిమీద జాలిపడి చెల్లెల సలహా ప్రకారం పేడనీళ్ళతో ఆ దురదలు పోగొట్టాడు ★

## ఉయ్యాల స్నేహం

అలపర్తి వెంకటసుబ్బారావు

ఊరి వెలుపలా దారిపక్కనా
ఊడల మఱ్ఱి ఒక్కటున్నదీ!
ఊడల బట్టుక ఉడుత యొక్కటీ
ఊయెల హాయిగ ఊగుచున్నది!!

* * *

ఊరిలోపలా చెఱువు ప్రక్కనా
పూరి గుడిసెనొక బాలుడుండెనూ!
బుడుతడు రోజూ పుడక లేరుకొన
ఊడల మఱ్ఱినీడల జేరును !!

* * *

ఊయెలలూగే ఉడుతను బుడుతడు
ఉడుతా ఉడుతా హూత్ అని పిలిచీ,
నే గూడా మరి నీతో బాటుగ
ఊగేదా యీ ఊయెల ననియెను!

* * *

అందుకు నాకే మభ్యంతరమని
అన్నట్టుల తల ఆడించె ఉడుత!
అంతటబుడుతడు సంతోషంతో
గంతులు వేస్తూ చెంతకు జేరెను !!

* * *

ఉయ్యాలా జంపాలా అంటూ
ఊడల ఊయెల బుడుత డూగెనూ!
ఉయ్యాలా జంపాలా వింటూ
ఊడల ఊయెల ఉడుత వూగెనూ!!

* * *

ఊరి వెలుపలా ఉండే ఉడుతకు
ఊరిలోపలా ఉండే బుడుతడు
అయ్యెను స్నేహం అప్పటినుంచీ
ఉయ్యాలస్నేహం! తియ్యనిస్నేహం!!

## ధ్రువతార

(23-వ పేజీ తిరువాయి)

ఇద్దరూ ప్రక్కగదిలో చాపమీద కూర్చున్నారు ఫిడేలు అందించి రుక్మిణి అక్కడే కూర్చున్నది చిన్న బెడ్‌రూమ్‌లైటు వెలుగుతున్నది ఆయన ఫిడేలుమీద కమాను పెట్టగానే మార్కెట్లో ఏడు గంటలు కొట్టారు

కాళిదాసు అడిగిన నాలుగు కీర్తనలూ వాయించి శంకరశాస్త్రి ఫిడేలుపెట్టె రుక్మిణి చేతికిచ్చి లోపలికి పంపించి "ఆ! ఇంక చెప్పు ఏదో చెబుతానన్నావుగా?" అని అడిగాడు

కాళిదాసు గోడ కానుకుని కూర్చుంటూ "నా ఎరికలో ఒక సంబంధంవుంది కుర్రవాడు మ్యాట్రిక్ ఫైనల్ చదువుతున్నాడు పదహారేళ్ళు ఉంటాయి చాలా చురుకైనవాడు వినయ విధేయతలూ, పెద్దలంటే గౌరవమూ వున్నవాడు ఇప్పటి కుర్రకారులా జులాయిగా తిరిగే ఉత్సాహం అతనికి లేదు స్నేహం చేసేటప్పుడు కూడా స్నేహితులను ఎన్నుకుని మరీ వారితో కలిసి తిరుగుతాడు వాడు తప్పక అభివృద్ధిలోకి వస్తాడని నాకు విశ్వాసం వుంది" అన్నాడు

శంకరశాస్త్రి అనుమానంగా "అవన్నీ సరేనయ్యా! వాళ్ళకేమైనా మన అంతస్థుకుమించిన ఆశలున్నాయేమో చెప్పు ముందు" అని అడిగాడు

"అదీ చెబుతున్నాగా వాడికి తండ్రిలేడు ఆస్తిపాస్తులులేవు వాడిమీదే ఆశలన్నీ పెట్టుకున్న తల్లివుంది తండ్రి ఏదో నౌకరీ చేస్తూవుండేవాడు ఒక యిల్లు మాత్రం సంపాయించగలిగాడు. పిత్రార్జితమైన భూమి కొద్దిగా వున్నట్టుంది అవచ్చే దానితో ఏదో గుట్టుగా రోజులు గడుపుతున్నదామె కాబట్టి వారికి విపరీతమైన ఆశలేవి వుండేందుకు వీలులేదు" అన్నాడు కాళిదాసు

శంకరశాస్త్రి తలవూపి "సరే నీకు వీలైనప్పుడు మళ్ళీరా వెళ్ళి మాట్లాడివద్దాం ఈ లోపల నువ్వు ఒకసారి వాళ్ళను కదిపిచూడు." అన్నాడు కాళిదాసు 'సరే' నని తలవూపి లేచాడు శంకరశాస్త్రి అతన్ని వాకిటిదాకా సాగనంపి "ఇక నేనుండిపోతాను" అన్నాడు కాళిదాసు యింటిదోవపట్టాడు

చలిగాలి ఎక్కువగానే వుంది ఆకాశంలో నక్షత్రాలు గుంపులు గుంపులుగా మెరుస్తున్నాయి చంద్రోదయం యింకా కాలేదు కాళిదాసు యింటికి వెళ్ళేసరికి పంచలో దీపం వెలుగుతున్నది పనిమనిషి, రూబెనూ, మురళీ పంచలో నిలబడివున్నారు కాళిదాసు మెట్లెక్కి పంచలోకి వెళ్ళేసరికి అప్పలమ్మ "బాబూ! పిల్లవాడి ఉయ్యాల మాట ఏంచేశారు?" అని అడిగింది కాళిదాసు నవ్వి "అబ్బబ్బ! వాడికన్నా నీ గోల ఎక్కువగా వుందే రేపో యెల్లుండో మాట్లాడతాలే" అని జవాబుచెప్పి లోపలికి వెళ్ళిపోయాడు

అతడు భోజనంచేసి మళ్ళీ ముందు గదిలోకి వచ్చేసరికి పనిమనిషి, పిల్లవాడి పక్కన పడుకుని వుంది. పిల్లవాడప్పుడే నిద్రపోయినట్టున్నాడు. పంచలో మురళీ రూబెనూ నుంచుని ఆకాశంవంక చూస్తున్నారు మురళి వ్రేలు చూపిస్తూ "అదుగో ఆప్రక్క ఏడు నక్షత్రాలు కనిపించటంలేదూ? అదే సప్త ఋషి మండలం ఆ క్రిందవున్న మూడు చుక్కల్లోనూ మధ్యదే వసిష్ఠుడు ఆ ప్రక్కనే అరుంధతి వుంటుందంటారు నాకెప్పుడూ కనిపించలేదు నీకు కనిపిస్తున్నదా?" అని రూబెన్‌ను అడుగుతున్నాడు రూబెన్ "లేదంటూ" తల వూపుతున్నాడు

కాళిదాసు భుజంమీద టవల్‌తో ప్రవేశించి "నువ్వప్పుడే అరుంధతిని చూద్దామనుకుంటున్నావా? అంత తొందర ఎందుకోయ్ మురళీకృష్ణా! ఎలాగూ రుక్మిణిసమేతుడవై పెళ్ళివాడు చూడవచ్చు అయినా ఆనాడు తీరా అక్కడ అరుంధతి కనిపించక, ఎవడో అన్నట్టు అయిదు వందల అప్పు కనిపిస్తుందేమో" అన్నాడు రూబెన్ పెద్దగా నవ్వాడు

కాళిదాసు కాస్సేపాగి "మీరిద్దరూ యింక వెళ్ళి చదుకోండి పరీక్షలు దగ్గరికి వస్తున్నాయి నక్షత్రాలూ ఆకాశమూ చూస్తూ కూర్చుంటే ఏమీ లాభంలేదు అన్నట్టు యిందాక మీ రిక్కడికి వచ్చేసరికి ఒక కుర్రవాడు చదువుకుంటూ కూర్చుని వున్నాడుగా! వాడు మళ్ళీ రాలేదే" అన్నాడు

రూబెన్ "అవునండి మేము వచ్చేసరికి చదువుకుంటూనే వున్నాడు మమ్మల్ని చూసి సంచి సర్దుకుని "యింటికిపోయి అన్నంతిని మళ్ళీ వస్తా' నని చెప్పి వెళ్ళిపోయాడండి" అని చెప్పాడు

కాళిదాసు లోపలికి వెళ్ళి ఏదో పుస్తకంకోసం అలమారుతీసి పుస్తకాన్ని వెదికి తీసుకుని తిరిగి తలుపు వెయ్యబోతూ ఆగిపోయాడు పై అరలో ఉండవలసిన హుండీలేదు 'మరెక్కడయినా వుంచానేమో'ననే అనుమానంతో అతడు అక్కడా యిక్కడా వెదికి చూశాడు.

కాని అది కనిపించలేదు అతడు "మురళీ! యిలా మీ యిద్దరూ ఒకసారి రండి" అని కేకవేశాడు వారిద్దరూ వెంటనే "ఏమిటండి?" అంటూ లోపలికి వచ్చారు పని మనిషి కూడా మేలుకుని లేచి కూర్చున్నది

కాళిదాసు అలమారులో వెదుకుతూ "ఇక్కడ పై అరలో ఒక మట్టి హుండీ వుండాలి కనిపించటం లేదోయ్" అన్నాడు వారిద్దరూ ఆశ్చర్యపోయారు రూబెన్ అనుమానంగా "మొన్న మీ స్నేహితుడెవరో వచ్చి మళ్ళీ చెప్పకుండా వెళ్ళిపోయాడు కదండీ అయినా అప్పుడేమీ పోయినట్టులేదే వెదికి చూశాంగా" అన్నాడు.

మురళి ముందుకువచ్చి అలమారులో వెదుకుతూ, "అందులో ఎంత వుందేమిటండీ?" అని అడిగాడు కాళిదాసు ఆలోచిస్తూ "అంతా చిల్లరవుందోయ్ ఇరవై రూపాయలపైనే వుండాలి" అని జవాబు చెప్పాడు

మురళి ఏదో తోచగా గంతేసి 'మేష్టారూ" అంటూ ఏదో చెప్పబోయాడు. కాళిదాసు వెంటనే అతన్ని వారిస్తూ "అవును నువ్వేమీ చెప్పవద్దు. నాకూ అర్థమయింది ఇంక వెదకటం ఎందుకు? వెళ్ళి చదువుకోండి" అన్నాడు వాళ్ళిద్దరూ ఎక్కడి వక్కడ సర్దేసి నెమ్మదిగా వెళ్ళిపోయారు పనిమనిషి *

ఏదో అడగబోతూవుండగా "ఏమీ లేదులే, వాకే గుర్తులేక అడిగాను అంతే" అని చదువుకునేందుకు కూర్చున్నాడు

అతని దృష్టి ఎక్కడోవుంది పుటలు తిప్పుతున్నాడేగాని ఏమి చదువుతున్నదీ అతనికే అర్థం కావటంలేదు అవతల పంచలో రూబెన్ మురళికి ఏదో లెక్కను వివరించి చెబుతున్నాడు

కాళిదాసులేచి చొక్కా తొడుక్కున్నాడు కాస్సేపు తటపటాయించి తర్వాత ఏదో నిర్ణయానికి వచ్చి తలుపులు దగ్గరికిలాగి వీధిలోకి వచ్చాడు చంద్రు డుదయించాడు నవమినాటి వెన్నెల చల్లగా ఆహ్లాదకరంగావుంది

అతనికి సుబ్రహ్మణ్యంగారి యిల్లు బాగా తెలుసు అది చిన్న పెంకుటింట్లో ఒకభాగం ఆ యిల్లు రోడ్డుమీదికివుంది ఎదుట ఖాళీ స్థలమేలేదు వున్న కొద్దిపాటి స్థలమూ యింటి వెనకవైపు వుంది

కాళిదాసు వాకిట్లో నుంచుని పిలవగానే ఆయన వెలుపలికి వచ్చాడు ఏదో వైద్య గ్రంథం చదువుకుంటున్నాడు కాబోలు కళ్ళకు జోడూ, చేతిలో పుస్తకమూ వున్నాయి ఆయన వాకిట్లోకి వస్తూనే "మీరా మేష్టారూ! చలిగాలిలో యిలా వచ్చారేం?" అని అడిగాడు కాళిదాసునవ్వి "ఆ ఏమీలేదు రాత్రిపూట తిండి తినగానే అలా కాస్త నడవమని పెద్దలు చెప్పారుగా అందుకని నడుస్తూ యిలా వచ్చాను" అన్నాడు

ఆయన కళ్ళజోడు సవరించుకుని "మా వాడి వ్వాళ చాలా బుద్ధిమంతుడైనాడే ఆరింటిదాకా మీరు పాఠం చెప్పారుట ఆ తర్వాత ఒక అరగంటసేపు చదువుకుని యింటికివచ్చి "మళ్ళీ వెంటనే రమ్మన్నార'ని యింట్లో తొందరచేసి నాలుగు మెతుకులుతిని పుస్తకాల సంచి తీసుకుని బయలుదేరిపోయాడు కాస్త భయపెట్టి చదివించండి మేష్టారూ! మీరు చెయ్యి చేసుకున్న నేనేమీ అనుకోను. వాడికి నాలుగు ముక్కలు వంట బట్టటమే నాకు కావలసింది" అన్నాడు

కాళిదాసు ఒక్క క్షణంఆగి "అయినా మీకు చెప్పకుండా దాచిపెట్టటం మంచిదికాదు మీవాడు సాయంకాలం మా యింటికి వచ్చినమాట నిజమే నేను పాఠం కూడా చెప్పాను కాని వాడు మళ్ళీ యింతవరకూ రాలేదు" అని చెప్పాడు

ఆయన నివ్వెరపోయాడు ఒక్కక్షణం అలా నిశ్శబ్దంగా నుంచుని నెమ్మదిగా బాధాపూరితమైన కంఠస్వరంతో "వీడు నన్ను యమయాతన పెడుతున్నాడు మేష్టారూ! ఒక్కగానొక్కడు యిలా పాడైపోతున్నాడే అని నేను ఎంతగా తపించిపోతున్నానో ఆ పరమాత్ముడికే తెలియాలి ఇంక నేనేం చెయ్యను?" అన్నాడు. ఆయన వ్యథ చూస్తూవుంటే కాళిదాసుకు గుండె కరిగిపోయింది

ఆయన మళ్ళీ "పోనీ ఏ స్నేహితుణ్ణయినా వెంట వేసుకుని తిరిగేందుకు పోయాడనుకుందామా అంటే వాడి దగ్గర చిల్లికానీ కూడా లేదు ఈమధ్య డబ్బంటే దాన్ని వాడి దృష్టిలో పడకుండా జాగ్రత్తగా వుంచుతున్నాను" అన్నాడు

కాళిదాసు నవ్వి "దానికేమీ లోపంలేదు వాడు మాయింట్లో సమకూర్చుకున్నాడులెండి చిల్లరతో నిండిన హుండీ మాయమైపోయింది" అన్నాడు.

ఆయన ఆ మాటలు వింటూనే కాస్సేపు మ్రాన్పడి శిలా ప్రతిమలా నిలుచుండిపోయాడు కొన్ని క్షణాలు తలవంచుకుని నిశ్శబ్దంగా నుంచుని వుండి తర్వాత హఠాత్తుగా కాళిదాసు చేతుల పట్టుకుని, "మేష్టారూ! ఇవి చేతులుకావు, కాళ్ళనుకోండి. ఇన్నాళ్ళనుంచీ వాడు కేవలం చెడిపోతాడేమోననీ, ఎందుకూ కొరగాకుండా పోతాడేమోననీ మాత్రమే అనుకుంటున్నాను నా జేబులో నుంచి రూపాయో, అర్ధ పోయినప్పుడల్లా 'పోనీలే' అని పూరుకున్నాను కాని యింత దుర్మార్గానికి

రాము : ఏరా! మీ నాన్న కేక లేస్తున్నారు. మీ అమ్మైనా?

సోము : అంత గుండెధైర్యం మా నాన్న కుంటేగా!

రాము : మరి నిన్ను తిడుతున్నారా?

సోము : అదిజరుగదు - మా అమ్మతో పిర్యాదు చేస్తామని మా నాన్నకి బలేభయం.

రాము : (చిరాకుగా) మరైతే తననే తిట్టుకుంటున్నారా?

సోము : ఓ నాను మా అమ్మ పిక్చర్ కి వెళ్లేముందు జాగ్రత్తగా వంటచేయమని చెప్పి మరీ వెళ్లింది. ఇంతవరకూ వంట కాలేద. మా అమ్మ ఏక్షణాన వచ్చి ఏమంటుందోనని దిగులుతో, వంట తొందరగా చేయని తనని తానే తిట్టుకుంటున్నాడు.

యస్. నారాయణరావు,
(హైదరాబాద్)

పూనుకుంటాడని నేననుకోలేదు నన్ను క్షమించండి ఇప్పుడే వస్తాను వుండండి" అంటూ లోపలికిపోయాడు ఆయన కళ్ళలో ఆర్ద్రతనూ, గొంతులో ధ్వనించే బాధనూ కాళిదాసు గమనించి చలించిపోయాడు

మరొక అర నిముషంలో ఆయన చొక్కా తొడుక్కుని చెప్పులు వేసుకుని బయటికి వచ్చాడు. ఆయన నడుస్తూ, "మేష్టారూ! ఇవాళ వూరంతా వెదికిఅయినా సరే వాణ్ని పట్టుకునిగాని యింటికి రాను వాడి చర్మం ఒలిచేస్తాను 'మళ్ళా యిటువంటి పని చెయ్య'నని అనిపించుకునిగాని వదలను" అన్నాడు.

కాళిదాసు ఆయన పక్కనే నడుస్తూ "అయిష్టంగా" అటువంటి పనులేవీ చెయ్యకండి నేను కూడా వస్తాను ఇద్దరం కలిసి వెదుకుదాం వాడు కనిపించిన వెంటనే నాకు వప్పజెప్పండి తర్వాత విషయం నేను చూసుకుంటాను" అన్నాడు

ఆయన ఆగి, "అలాకాదు వాణ్ణివాళ చావగొట్టి చెవులు మూయవలసిందే వాడి నుదుట అలా వ్రాసివుంది" అన్నాడు

కాళిదాసు చేతి రుమాలుతీసి చెవులకు కప్పుకుంటూ నడుస్తూనే, "ఏమిటో! ఆ వయస్సు అటువంటిది వారి బుద్ధి యీ వయస్సులో పాదరసం పాకినట్టు పాకిపోతుంది దాన్ని మనం మంచి దారులలోకి మలచడం చాలా ముఖ్యం ఈ ఖాడు పిల్లలు మన కళ్ళముందు చాలామంది సరైన పెంపకంలేక పాడైపోతున్నారు నేను చాలా ఆశ్చర్యపోతూవుంటాను నలుగురు హైస్కూలు పిల్లలు చేరినచోట బూతులు, చవకబారు సంభాషణలూ, సినిమాలను గురించిన చర్చలూ తప్ప మరేమీ వినరావడంలేదు మొన్ననేకదా మా హైస్కూలుకు ఉత్తరంవైపు ప్రహరీగోడ కట్టారు? రెండో నాడే ఆ గోడనిండా పిల్లలు పరమ అసహ్యకరమైన వ్రాతలువ్రాసి బొమ్మలు వేశారు ఇదంతా వాళ్ళ తప్పుకాదు ఇళ్ళలో అతి గారాబంచేసీ, అతిగాకొట్టీ తిట్టీ తల్లిదండ్రులే వాళ్ళ నలా పాడుచేస్తున్నారు. గారాబంచేస్తే పిల్లలు ఎలా చెడిపోతారో మీకు తెలియనిదికాదు వాడడిగినదల్లా కొని యిచ్చీ, వాడి యిష్టానుసారం నడిచీ, క్రింద నడవనిస్తే పాదాలు ఎక్కడ కందిపోతాయో అన్నట్టు పెంచినందువల్ల అవతలి వీధిలో రిటైర్డు తాసీల్దారుగారి కొడుకు ఎలా తయారైనాడో తెలుసుగా? ఇప్పుడు వాడికి పెద్ద మనుషులతో మాట్లాడటం తెలియదు. ఎవరినయినాసరే తూలనాడుతాడు ఎవరినీ లెక్క చెయ్యడు ఈమధ్య తల్లి నొకసారి కొట్టాడని కూడా విన్నాను నాకా తండ్రిని చూస్తూవుంటే జాలిగా వుంటుంది ఎంతగా కుమిలిపోతున్నాడో! రోజూ సాయంకాలంపూట చేతిలో కర్రతో నెమ్మదిగా దీనంగా నడిచి వస్తూవుంటాడు వాడికి చదువు వంటబట్టలేదు ఏ పనీ చెయ్యలేడు. నలుగురితో మంచిగా ఎవరికీ కష్టం కలిగించకుండా బ్రతకటంచేతకాదు తండ్రి ముసలివాడైపోతున్నాడు వున్న కాస్త ఆస్తి ఎంతకాలం వుంటుంది? హారతి కర్పూరంలా హరించిపోయిన తర్వాత అప్పుడు వాడిపాట్లు వూహించుకోండి" అన్నాడు

సుబ్రహ్మణ్యం ఒక యింటిముందు ఆగి ఆ యింటి యజమానిని పిలిచాడు లోపలినుంచి "ఎవరూ?" అంటూ వచ్చిన వ్యక్తిని ఉద్దేశించి, "నేనండీ సుబ్రహ్మణ్యాన్ని మావాడేమన్నా మీ యింటికి వచ్చాడా?" అని అడిగాడు ఆవ్యక్తి "రాలేదండీ! మావాడు మాత్రం స్కూల్లో ఏదో సినిమా చూపిస్తారనిపోయి ఒక గంట క్రితమే వచ్చాడు. ఎందుకలా అడుగుతున్నారు?" అని అడిగాడు

సుబ్రహ్మణ్యం వెనుదిరుగుతూ "ఏమీలేదులెండి. ఏ సినిమాకైనా వెళ్ళాడేమో! ఇంకా యింటికి రాకపోతే యిలా వచ్చాను" అన్నాడు.

# ధృవతార

మళ్ళీ యిద్దరూ నడవటం ప్రారంభించారు కాళిదాసు "నా కొక అనుమానంవుంది వాడు బహుశా నేను అనుకుంటున్నచోట ఉండవచ్చు ఇలా పోదాం రండి" అంటూ దారితీశాడు

అతడు మళ్ళీ "అతి గారాబంచేస్తే పిల్లలు ఎలా చెడిపోతారో, అతిగా శిక్షించినా అంతే మీరు వాణ్ణి కనుపించగానే యింటికి తీసుకుపోయి గుంజకు కట్టివేసి ఏ చేంతాడుతోనో నెత్తురు వచ్చేలాకొట్టి, 'వాణ్ని బాగు చెయ్యగలిగానని' 'యింక యిలా చెయ్యడ'ని అనుకుంటే అది పొరపాటే అవుతుంది ఆ దొంగతనంవంటి పనులను చేస్తున్నప్పుడు, ఇకమీదట 'దెబ్బలు తినవలసి వస్తుందే' అనే భయం తప్ప మరేమీ వుండదు అలా రెండు మూడుసార్లు దెబ్బలు తినగానే వాడిభయం పోతుంది వీపు మొద్దుబారిపోతుంది తర్వాత మీ చేతులు నొప్పి పుట్టవలసిందేతప్ప మరేమీ లాభం వుండదు ఆవిధంగా శిక్షించి వారిని బాగుచెయ్యటం అసాధ్యం" అన్నాడు

సుబ్రహ్మణ్యం కొద్దిసేపు ఆలోచించి "సరే మీరు చెప్పింది బాగానేవుంది మొదట మీ యింటికి పంపించేటప్పుడే వాడి బాధ్యత అంతా మీకు వదిలేశాను ఇప్పుడు వాడు కాజేసింది కూడా మీ డబ్బే వాడు కనిపించగానే మీకే వప్పజెపుతాను ఏం చేసుకుంటారో తర్వాత మీ యిష్టం" అన్నాడు

'సిటీ అమ్యూజమెంట్ సెంటరు' లైట్లతో దేదీప్యమానంగా వెలిగిపోతున్నది లోపల నాట్య ప్రదర్శనం జరుగుతున్నది "స్కిల్‌గేమ్సు" దగ్గర జనం చాలామంది చేరి రక రకాల జూదాలు ఆడుతున్నారు నాట్య ప్రదర్శనం జరుగుతున్న చోటుకు పక్కగా యిద్దరు వ్యక్తులు నిలబడి వున్నారు వారిలో ఒకడు గళ్ళలుంగీ కట్టుకుని తెల్లని గ్లాస్కో లాల్చీ తొడుక్కుని వున్నాడు వాడి కళ్ళు ఎర్రగా చింత నిప్పులవలె వున్నాయి రెండో వ్యక్తి ఎవరో షావుకారు సిల్కులాల్చీ, గ్లాస్కో దోవతీ ధరించి వున్నాడు అతని చేతి నాలుగువ్రేళ్ళకూ 'ధగధగ' మెరిసే రాళ్ళ వుంగరాలు వున్నాయి అతని మెళ్ళో సన్నని బంగారు గొలుసు వుంది

మొదటివాడు తెర తొలిగించిచూసి షావుకారుతో "ఆ పిల్లేనా? అది కాకినాడనుంచి వచ్చిందండి మా మంచి పిల్లలెండి బాబుగారు బలే ఎన్నుకున్నారు ఒక్క అరగంటసేపు ఆ కుర్చీలో కూర్చోండి 'డ్యాన్సు' అయిపోతుంది పది గంటలు దాటిందిగా" అంటున్నాడు

కాళిదాసూ, సుబ్రహ్మణ్యమూ నెమ్మదిగా నడిచి వస్తున్నారు అక్కడ దాదాపు అయిదారు రకాల జూదాలు వున్నాయి అంతా గోలగావుంది అయినా వుండి వుండి నిశ్శబ్దమైపోతున్నది వీరిద్దరూ నెమ్మదిగా నడిచివస్తూ, ఒకచోట హటాత్తుగా ఆగిపోయారు

బల్లమీద సున్నానుంచి తొమ్మిది వరకూ అంకెలున్నాయి ప్రక్కనే గాజు ప్రేములో అంకెలతో నిండిన మరో బోర్డు వుంది ఒకడు తేలికైన "టేబుల్ టెన్నిస్" బంతిని అందులోకి విసురుతున్నాడు అది ఏ అంకెలమీద ఆగుతుందో

ఆ అంకెలమీద పందెం కాసిన వారికి రెండు రెట్లుగా డబ్బిస్తున్నారు

ముందు వరుసలో పక్కగా నిలబడి వున్నాడు గోవిందు వాడిప్పుడే కాసిన పందెం పోయింది మళ్ళీ అందరూ తమ తమ యిష్టం వచ్చిన అంకెల మీద డబ్బులు విసురుతున్నారు గోవిందు జేబులో నుంచి అర్ధ రూపాయి బిళ్ళతీసి 'టీ' త్రాగుతున్న అక్కడి వ్యక్తితో 'నాలుగుమీద పెట్టు' అంటూ యివ్వబోతున్నాడు

సుబ్రహ్మణ్యం సహించలేకపోయాడు బాణ వేగంతో ముందుకుపోయి వాడి చేతిని గట్టిగా పట్టుకుని, దవడమీద బలంకొద్దీ ఒక్కటివేసి "దొంగ రాస్కెల్! ఇదా నీ నిర్వాకం? రా యింటికి" అని అరిచాడు ఏ సూచనా లేకుండా పడిన యీ పిడుగుదెబ్బ గోవిందును అదిరిపోయేట్టు చేసింది వాడు చెయ్యి వదిలించుకోలేక యివతలికి వచ్చాడు అక్కడి వారందరూ వింతగా చూశారు

దారిపొడుగునా ఆయన ఆ పట్టు వదలనేలేదు కాళిదాసు వారిద్దరివెంట నడుస్తున్నాడు సుబ్రహ్మణ్యం తన యింటిముందు నిలబడి వాడి చెయ్యి వదిలి "మేష్టారూ! ఇవాళ వీడి ప్రాణాలు తీసి వుండేవాణ్ణి వీడి అదృష్టంకొద్దీ మీరింతసేపూ నా వెంటనేవుండి నాతోబాటు వెదుకుతూ తిరిగారు ఇదుగో మీ వెంట తీసుకుపొండి" అన్నాడు తర్వాత ఆయన ఒక్కక్షణం కూడా నిలబడలేక బాధగా మొహం తిప్పుకుని యింట్లోకి వెళ్ళిపోయాడు

గోవిందు తల వంచుకుని ఏడుస్తూ నిలబడి వున్నాడు కాళిదాసు వాడి భుజంమీద చెయ్యివేసి మా యింటికిరా, చదువుకుందువుగాని పుస్తకాలేమీ అక్కర్లేదులే మీ క్లాసు ఇంగ్లీషు పుస్తకం నా దగ్గర కూడా వుంది' అన్నాడు గోవిందు అతని వెంటనే నడవటం ప్రారంభించాడు

ఇంట్లో ముందుగదిలో దీపం వెలుగుతున్నది రూబెనూ, మురళీ కాళిదాసును చూసి ముందు గదిలోకి వచ్చారు కాళిదాసు ఏమీ మాట్లాడకుండా వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు పని మనిషి పసివాడి పక్కనే కూర్చునివుంది

గోవిందు గుమ్మంలోనే ఆగిపోయాడు. కాళిదాసులేచి చొక్కా విప్పి వంకెకు తగిలించి మళ్ళీ కూర్చున్నాడు మురళీ, రూబెనూ, గోవిందు వంకనే చూస్తున్నారు కాళిదాసు ఒక్కక్షణంఆగి వాడి వంకచూసి "యిలారా' అని పిలిచాడు వాడు చొక్కా చివరతో కళ్ళు తుడుచుకుంటూ లోపలికి వచ్చాడు

కాళిదాసు వాడితో "నేను నీకొక కథ చెబుతాను నీకు కథలు రుచించకపోవచ్చు అయినా విను ఒక తండ్రీ కొడుకూ వున్నారు తండ్రి యాభైయేళ్ళవాడు కష్టపడి పని చేసేవాడు అతడు సంపాయించిన ఒక్కొక్క నయాపైస అతని శరీరంలోని ఒక్కొక్క నెత్తుటిబొట్టుకు ప్రతిఫలం అతడు తెల్లవారుజామునుంచి రాత్రి పొద్దుపోయేదాకా కొలిమిముందు కూర్చుని పని చేస్తాడు అతని కొడుకు ఒక గడియారం కొనుక్కుందామని సరదాపడ్డాడు అది వాడు చదువుకునేందుకు చాలా అవసరం వాడు ప్రతి పనినీ క్రమశిక్షణతో వేళ తప్పకుండా చేయాలనుకునేవాడు. తండ్రి నొకనాడు అడిగాడు వాడికి నమ్మకంలేదు తన తండ్రి 'అంతగా కష్టపడుతూవుంటేనే రోజులు గడవటం కష్టంగావుంది అందువల్ల ఏ యిరవై రూపాయలో పాతిక రూపాయలోపెట్టి గడియారం కొనటం ఎంత కష్టమో వాడికి తెలుసు తండ్రి నాలకం వాడికంత ఉత్సాహం కలిగించలేదు 'లాభం లేద'నుకుని వూరుకున్నాడు కాని ఆ తండ్రి అలా వూరుకోలేదు తానంత కష్టపడుతున్నందుకు కొడుకు ఏదో చదువుకుంటున్నాడు వాడు తన వృద్ధాప్యంలో తనను సుఖపెట్టకపోడు తన కలలను నిజాలుగా చేయగలడు వాడు అడిగినందుకు మరి కాస్త ఎక్కువ కష్టపడి అయినాసరే, రోజుకో పావలా తక్కువ కాకుండా నిలవచేసి వాడి ముచ్చట తీర్చాలి' అనుకుని ఆ తండ్రి మరొక గంటా రెండుగంటలు అదనంగా పని చేసి రోజా పావులాకు తక్కువ గాకుండా ఒక హుండీలో వెయ్యటం ప్రారంభించాడు మూడు నెలలు గాని యిరవై రూపాయలు పోగుకాలేదు అంటే అతనెంత చెమటోడ్చి పని చేసివుంటాడో ఆలోచించు ఆ తర్వాత ఆ డబ్బుపెట్టి ఒక గడియారం కొనిపించి కుమారుడికి యిచ్చాడు వాడికా విషయం అంతవరకూ తెలియదు వాడు అది చూసి పొంగిపోయాడు" అంటూ ఆగి "బావుందా కథ?" అని అడిగాడు

గోవిందు ఏమీ మాట్లాడలేదు కాళిదాసు



మళ్ళీ రూబెన్‌ను చేత్తో చూపించి "ఆ కథలో తండ్రి యితని తండ్రి ఆ కథలో కొడుకు యితనే నువ్వు ఇంట్లో ఎవరూ లేకుండాచూసి, తీసుకుపోయిన ఆ హుండీలో ఆ తండ్రి కష్టం అంతా వుంది ఎంత చెమటోడ్చి పనిచేస్తే అంత డబ్బు కూడబెట్టగలిగాడో, ఎన్ని గంటలు రోజూ అందరూ నిద్రపోయేవేళ కూడా మేలుకునివుండి కొలిమి ముందు నమ్మకంతో కష్టపడ్డాడో నీకు తెలియదు దాన్ని నేనొక మహా పవిత్రమైన ధనంగా ఎంచి దాచిపెట్టాను అంత పవిత్రమైన ఆ డబ్బును, అంతే విలువైన మరో పనికిగాని వెచ్చించగూడదనుకున్నాను కాని నువ్వు దాదాపు రెండు గంటలలో ఆ డబ్బు నంతటినీ పరమ నీచమైన పద్ధతిలో మరొకళ్ళకు ధారాదత్తం చేశావు ఎంత కష్టపడితే ఆ సొమ్ము సమకూడిందో, నువ్వెంత తేలికగా దాన్ని పోగొట్టావు" అన్నాడు

గోవిందు వెక్కి వెక్కి ఏడవటం ప్రారంభించాడు కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి రూబెనూ, మురళీ ఆశ్చర్యంతో బొమ్మలవలె నుంచుని వున్నారు తర్వాత గోవిందు తన లాగూ జేబులో నుంచి అయిదు పావలాబిళ్ళలు తీసి బల్లమీద పెట్టి వెక్కి వెక్కి ఏడుస్తూనేవెళ్ళి ప్రక్క పంచలో కూర్చున్నాడు.

కాళిదాసు నిట్టూర్చి వారిద్దర్నీ కూడా వెళ్ళి చదుకోమని సైగ చేశాడు వారిద్దరూ నెమ్మదిగా వెళ్ళిపోయారు చాలా పొద్దుపోయింది కాళిదాసు లేచి దీపం తగ్గించి పడుకున్నాడు చుట్టుప్రక్కల అంతా ప్రశాంతంగావుంది ఉత్తరం వైపు వరండాలో ముగ్గురు పిల్లలూ కూర్చుని చదువుకుంటున్నారు గోవిందు ఉండి ఉండి కళ్ళు తుడుచుకుంటున్నాడు. దాదాపొక గంట గడిచాక వాడు తలెత్తి యింకా దీక్షగా చదువుకుంటున్న ఆ యిద్దరివంకా చూసి తర్వాత పుస్తకంమూసి చాపమీద పడుకున్నాడు

మర్నాడు ఉదయం భానుబింబం ఉదయించే వేళ కాళిదాసు మేలుకున్నాడు పిల్లవాడు చాపమీద పడుకుని యేడుస్తూ వుండటంచూసి పని మనిషికి కేకవేసి "ఏం చేస్తున్నావు? వీ డిక్కడ పెంకు లెగిరిపోయేట్టు ఏడుస్తుంటే వినిపించటంలేదూ?" అన్నాడు ఆమె చేతిలో పని పూర్తి చేసుకుని మరో నిముషంలో వచ్చి వాణ్ణి ఎత్తుకుని భుజం మీద పడుకోబెట్టుకుంది

కాళిదాసు బద్ధకంగాలేచి ఆవులించి మొహం కడుక్కునేందుకు పెరట్లోకి వెళ్ళాడు. అక్కడ పంచలో గోవిందు మాత్రం కూర్చుని కాళిదాసు యిచ్చిన యింగ్లీషు పుస్తకం చదువుకుంటున్నాడు. రూబెనూ మురళీ చదువు కట్టిపెట్టి పొన్న చెట్టు క్రింద నిలబడి కబుర్లు చెప్పుకుంటూ పొన్న ఆకులతో బూరాలుచేసి వూదుతున్నారు

కాళిదాసు మొహం కడుక్కుని "చన్నీళ్ళతో స్నానం చేస్తేనేగాని యీ మత్తు వదలదు' అనుకుంటూ పది పదిహేను బాల్చీల నీళ్ళతోడి నెత్తిమీద కుమ్మరించుకుని స్నానం చేశాడు రూబెనూ, మురళీ, పెందలాడే 'ఏదో ప్రయివేట్ క్లాసు' వుందనిచెప్పి వెళ్ళిపోయారు. పనిమనిషి పంచలో కుంపటి అంటించింది. కాళిదాసు రాగానే గిన్నెలో నీళ్ళుపోసి కుంపటిమీద వుంచాడు

ఆకాశం ఎర్రరంగు పూయబడిన కాయితంవలె వుంది ఆ యింటికి ఉత్తరాన కొద్ది దూరంలో వున్న బ్రహ్మజెముడు పొదలో మరికొన్ని అందమైన పూలు పూచినయ్ ఇంటి ఆవరణలోవున్న పున్నాగ చెట్టు ప్రతిరోజా వలెనే మరో బండెడు పూలను రాల్చి భూమికి అభిషేకం చేసింది

కాళిదాసు నెమ్మదిగా కాఫీ కలుపుకుని త్రాగాడు. పనిమనిషి, పిల్లవాణ్ణి తీసుకుని వెళ్ళిపోయింది. గోవిందు లోపలికివచ్చి "నేనింటికి పోతున్నానండీ" అని చెప్పి వెళ్ళిపోయాడు

ముందు గదిలోకి వచ్చేసరికి కాళిదాసుకు వీధిలో నిలబడి లోపలికి చూస్తున్న రాధ కనిపించాడు. కాళిదాసు త్వర త్వరగావెళ్ళి వీధి గేటుతీసి "ఏమిరా రాధా! యిలా ఎక్కడికి పోతున్నావు?" అని అడిగాడు వాడు లోపలికి వస్తూ నెమ్మదిగా "మీ యింటికేనండి మా అమ్మ పంపించింది మరేమో మా తాతయ్య లేవలేకుండా వున్నాడు మాట్లాడటం కూడా లేదు నేను దగ్గరకిపోతే ఏడుస్తూ చూశాడు. మిమ్మల్ని తొందరగా తీసుకు రమ్మని అమ్మ నన్ను పంపించింది అమ్మ కూడా ఏడుస్తున్నది ." అన్నాడు

కాళిదాసు "అరె పాపం!" అనుకుంటూ త్వర త్వరగా దుస్తులు వేసుకుని తలుపుకు తాళంవేసి "పూ! పోదాంపద" అంటూ రాధను వెంటబెట్టుకుని వీధిలోకి వచ్చాడు. (సశేషం)

# ఇష్టా యిష్టాలు

(17వ పేజీ తరువాయి)

తుండోనని అరుణ తెచ్చియిచ్చిన తువ్వాలుతో చేతులు తుడుచుకుని అంది "పోనీ, ఆ కారణమనే అమృతబిందువునయినా మా చెవిన పడేస్తే— మా సంతోషానికి సరిహద్దులు వెతుక్కుంటూ వెళ్ళిపోతాంకదా?"

"చెప్పక తప్పదా?"

"ఊరించి చంపకే "

"అంత గొప్పదేమీ కాదులే"

"వెళ్దాంరండే, పాపం అక్కడ కాంతం తహతహ లాడుతూంటుంది" కోమలికి కోపంవచ్చింది.

"ఏమే అరుణా—వెళ్ళమంటావా?" సావిత్రి అడిగింది అరుణ కళ్ళల్లోకి చూస్తూ.

పకపక ధ్వనులతో యిల్లు మారుమ్రోగింది

"నాటకాలంటే నీకేమంత యిష్టంలేదుగా " విజయ క్రాస్ చేసింది

"ఏమిటో యివ్వాళ అంత మంచి నాటకం " సందేహం వెలిబుచ్చింది కల్యాణి

"ఓహో యివ్వాళ "లక్ష్మీ"లో ఉషాపరిణయం కూచిపూడి వాళ్ళది" అరుణకు బదులు శాంత జవాబు చెప్పింది

"దానికేనా, సావిత్రి కనుబొమలు ప్రశ్నించినయ్

అరుణ అవునన్నట్లు తలూపింది

ముక్కుమీద వేలేసుకుంది సావిత్రి, "పౌరాణిక నాటకాలంటే నీవు పూర్తి వ్యతిరేకంకదే ఏమిటే యివ్వాళ విశేషం "

"అందులో ఉష పాత్రచూసి తీరవలసిందేట"

"బేష్ యింతవరకు నువ్వు మొగవాడు ఆడవేషం వేయడమంత అసహ్యం మరేమీలేదనీ ఆడదానికి అంతకంటే అవమానంలేదనీ వాదిస్తావ్ కదా . ఇవ్వాళ అద్భుతంగా ఉన్నదేమే నీ ధోరణి"

"అదే విచిత్రం యివ్వాళ చూద్దామని ఉంది గాని—యిక చంపక నువ్వు సాగవే " సావిత్రి రెండు బుజాలూ పట్టుకు వెనక్కు తిప్పింది

"పదండర్రా వెళ్దాం" సావిత్రికి ముందుకు సాగక తప్పిందికాదు

ఇల్లు జడివాన కురిసి వెలిసినట్లు నిశ్శబ్దమయింది

"హమ్మయ్య" అనుకుని ఒక్క సుదీర్ఘమయిన నిశ్వాసంవదిలి అనుకుంది అరుణ

"జగన్నాథ రథం ఎలాగయితేనేం కదిలిందమ్మా"

అంతలో గడియారం అయిదు కొట్టింది

గబగబా కాకరకాయులు కారపకాయులు చేసింది అవంటే చంద్రానికి ఎనలేని యిష్టం పెళ్ళికాక ముందు కాకరకాయలంటే అరుణ దృష్టిలో విషతుల్యం తమాషా — యిప్పుడు అమృత సమానం కాకపోయినా—రుచిగానే ఉంటున్నయ్ అరుణక్కూడా

పూర్వం ఉల్లిపాయ వాసన తగిలితేనే వాంతులు చేసుకునే అరుణ ఉల్లిపాయ ముక్కలువేసి పప్పుపులుసుపెట్టి—టైం చూసేటప్పటికి అయిదూ ముప్పావయింది ఇక టిఫిన్ చేయడానికి టైం చాల దనుకుని ప్రక్కయింటివాళ్ళ పదేళ్ళ శంకరాన్ని హోటల్‌కు పంపించింది. ఒక కుంపటి ఆర్పేసి, రెండో కుంపట్లో కాఫీకి యిన్ని నీళ్ళు పడేసి—స్నానానికి వెళ్ళింది అరుణ

స్నానంచేసి వచ్చేటప్పటికి నీళ్ళు కాగినయ్ కాఫీ కలిపి ఫ్లాస్కులో పోసింది శంకరం పెసరట్లల్లో ఉప్మా వేయించుకుని పార్సిల్ చేయించుకు వచ్చాడు

పొట్లమ్మూ, చిల్లర డబ్బులు యిస్తున్న శంకరంకు "ఇదిగో యీ బేడాపెట్టి నువ్వు ఏమయినా కొనుక్కో శంకరం—" అని అరుణ యివ్వబోయేలోపల "నాకొద్దు అక్కా" అంటూ తుర్రున పారిపోయాడు శంకరం

గడియారం ఆరు కొట్టింది

గబగబా పొట్లం అలమారులోపెట్టి చిల్లర డబ్బులు పెట్టెలో పడేసి టాయ్‌లెట్ కుపక్రమించింది

చంద్రం వస్తే ఆలస్యమయిందంటాడేమోనని త్వరత్వరగా ముస్తాబయింది అరుణ

నిలువుటద్దంముందు నుంచుని పూలు సవరించుకుంటున్న అరుణ సుపరిచితమయిన బూట్ల చప్పుడుకు వెనక్కు తిరిగింది

గడపలోకి వచ్చిన చంద్రం గడపలోనే ఆగిపోయి అరుణని, అరుణ ముస్తాబుని తదేకంగా చూస్తున్నాడు వివాహంఅయి నాలుగు నెలలయినా ఎప్పటికప్పుడు యిట్లాగే కొత్తగా చూస్తాడు అరుణను, అరుణక్కూడా ఆ చూపులు ఎప్పటికప్పుడు నూతనోత్సాహాన్ని కలిగిస్తూ ఉంటాయి అరుణ లోపలకువెళ్ళి మరుక్షణంలో టిఫిన్‌తో తయారయింది

"త్వరగారండి టైం అవుతోంది" ప్లేటు టేబుల్‌మీద ఉంచుతూ అన్నది అరుణ

"దేనికి?" సందేహంగా అరుణ కళ్ళల్లోకి చూశాడు

"ఏడు గంటలకు నాటకం రెడీగా ఉండమన్నారుగా "

"ఓహో ఉషాపరిణయమా నువ్వు నిజమేననుకున్నావా?"

అరుణ కంటి రెప్పలు రెపరెప కొట్టుకున్నయ్

"అలా అంటే నువ్వు వంటా—వార్పూ పూర్తిచేసి ముస్తాబై ఉంటావ్‌కదా తీరిగ్గా కబుర్లాడుకోవచ్చని చెప్పాను" అంటూ బూట్లు విప్పేశాడు

అరుణ రోజా చూసే చంద్రం వంకులు తిరిగిన నల్లని జుట్టును ఆశ్చర్యంగా చూస్తూ నిల్చుంది

"పోని వెళ్దామంటావా?" టై విప్పి వంకికి తగిలిస్తూ అడిగాడు

"మీ యిష్టం" అరుణ నిర్లిప్తంగా అంది

చంద్రం బల్లముందు కుర్చీలో కూర్చుని టిఫిన్‌ప్లేటు ముందుకు లాక్కున్నాడు

"నాకేమీ యిష్టంలేదు కాని నువ్వు వెళ్దామంటే మాత్రం నాకేమీ అభ్యంతరంలేదు"

"అహహ నాకూ యేమీ యిష్టంలేదు. మీరు వెళ్దామంటే తయారయినాను"

కొన్ని క్షణాలు మౌనంగా దొర్లిపోయినాయ్.

టిఫిన్ ప్లేటు అవతలకుతోసి కాఫీ అందుకుంటూ చంద్రం అన్నాడు "నీతో సరదాగా కబుర్లు చెప్పుకోవడంకంటే నాకు మరేమీ యిష్టంలేదు"

ఆ మాటల్లోని మాధుర్యానికి అరుణ ఆరంత

అయిపోయి ఖాళీ అయిన కాఫీ గ్లాసును మళ్ళీ నింపే సింది

అరుణ ఆకర్ణాంత నేత్రాల్లోని అపూర్వమయిన కాంతి పుంజాన్ని, ఆ అధరోష్ఠాంచాలపై తారాడే హాస వికాసాన్నిచూసి చంద్రం ముగ్ధుడై రెండు గుక్కల్లో గ్లాసు ఖాళీచేసివేశాడు

అరుణ కూడా టిఫిన్ కాఫీ పూర్తి చేసింది

ఇద్దరూ కలిసి డాబామీదకు వెళ్ళారు చల్లగాలి కోసం కబుర్లలో చెప్పింది అరుణ తనకేన్నిలయిన పేరంటం ప్రోగ్రాం గురించి ఇద్దరూ కాసేపు మనసారా నవ్వుకున్నారు.

చంద్రం నవ్వు ముఖంచూసి అరుణ అనుకుంది "నేనెంతో పుణ్యం చేసుకున్నాను"

అరుణ హాస సౌందర్యాన్నిచూసి చంద్రం అను కున్నాడు "నేనెంతో అదృష్టవంతుడిని"

నవ్వు ఆపుకుని "నామాటమీద ఆమాత్రం భక్తి శ్రద్ధలుంచినందుకు కృతజ్ఞుణ్ణి" అన్నాడు చంద్రం సిగరెట్ వెలిగించుకుంటూ

"చంద్రం చంద్రం"

క్రిందినుండి కేక చలపతి పిలుస్తున్నాడు

ఆ గొంతు వినేటప్పటికి అరుణ గుండె కలుక్కు మంది

"వస్తున్నా"నంటూ చంద్రం గబగబా క్రిందికి పోయాడు

అరుణ దృష్టిలో చలపతిరావు రాహువూ, వర సింహారావు కేతువూ చంద్రాన్ని ఒక్క నిముషం అరుణతో ఉండనియ్యరు

మెట్లపై అడుగుల చప్పుడు వినిపించింది

"హమ్మయ్య యివ్వాళ ఎట్లాగో త్వరగా వదిలాడు—ఏ దేవతో కరుణించింది" అనుకుని కళ్ళుమూసుకుని ఆకాశంలోకి చేతులు జోడించింది

"అరుణా!" చివర మెట్టుమీదనే ఆగిపోయాడు చంద్రం

"ఒక్కగంటలో వచ్చేస్తా?"

ఏమ్మాటాడాలో తోచక నిశ్చేష్టి అయింది అరుణ

"అవసరమయిన పని "

"త్వరగా వచ్చేయండి" మరేమంటుంది?

"తప్పకుండా నువ్వు భోజనం చేసేయ్ ఆలస్య మయినా యిబ్బంది ఉండదు అరుణ సమాధానా నికి ఎదురు చూడకుండా గబగబా క్రిందికి పోయాడు చంద్రం

"భోజనంకోసం ఎవరు కాచి కూర్చున్నారు "

అరుణ అరుణారుణ అధరాలుదాటి వచ్చిన ఆ అస్పష్టాక్షరాలు వింటున్నట్లుగా కుండీల్లోని క్రోటన్సు మొక్కలు చిన్నగా కదిలినయ్

అరుణ లేతహృదయాన్ని యేవేవో ప్రశ్నలు సందేహాలు కలవరపరిచినయ్

"ఏమిటి చంద్రం మనస్తత్వం?"

"తనను ప్రేమించడంలేదా?"

"తన ప్రేమలో బలం కొరవడిందా?"

"తను చంద్రాన్ని ఎందుకు బంధించలేక పోతూంది?"

వాలుకుర్చీలో వెనక్కు వాలిపోయింది అరుణ పోయిన క్షణంవరకూ ఉన్న తన హృదయం లాగా ఆకాశం నిర్మలంగా ఉంది తన కోరికల్లాగా నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయ్ తన సందే హాల్లాగా అక్కడక్కడ నల్లని మబ్బు తునకలు తారాడుతున్నాయ్ చంద్రుడు తన్నుచూసి ఫక్కున నవ్వుతున్నాడు. శీతవెన్నెల కురుస్తూంది నైట్ క్వీన్‌ను స్పృశించిన గాలి తెమ్మెరలు సౌరభాలను మోసుకొస్తున్నాయ్

ప్రియునికోసం అలంకరించుకున్న సుందరిలాగా నిశాకన్య ముగ్ధ మోహనంగాఉంది

అరుణ మనసు మాత్రం వికలమయిపోయింది

చూస్తూండగానే ఆకాశం కారు మేఘాలతో నిండి పోయింది క్షణాల్లో కుంభవృష్టి కుమ్మరించింది

చంద్రం తడిసి ముద్దయిపోయి యింటికి వచ్చాడు "అరుణా—అరుణా!" తలుపు బాదు తున్నాడు తనకు వినిపించినా కోపంతో తలుపు తీసే ప్రయత్నమయినా చేయులేదు

"తడిసిపోతున్నా అరుణా! "

తనుమాత్రం యిందాకటినుండి దుఃఖంలో తడిసి పోలేదూ—?

---

కొడుకు స్కూలులో ఆటల పోటీలు చూసి వచ్చేడు చివరి సందేహం తీరక కొడుకు: నాన్నా! మరి 'లాంగ్ జంప్'కి అంత ఎత్తు పెట్టరేం?

తండ్రి: ఆ పాటి తెలియదట్రా! అంత ఎత్తు గెంత లేడని అంతదూరం పెట్టేరు.

జి. కాంత (ఖరగ్‌పూర్)

---

"తలుపుతియి అరుణా "

తన హృదయంలో తలుపులు నిర్దాక్షిణ్యంగా మూసివేయలేదూ—? తలుపులు బాదుతున్నాడు విరామం లేకుండా విసిగిపోయి తను తలుపులు తీసింది

ఒక్క ఉదుటున లోపలికివచ్చి నించున్నాడు. తలమీదనుండి నీరు ధారలుగా కారుతూంది

తన కళ్ళలోకిచూసి నవ్వుతున్నాడు

తను అసహ్యంగా తలను ప్రక్కకు తిప్పుకుంది

"అరుణా! "

క్షణం నిశ్చలంగా చూసింది

నీటి ధారల వెనుకగా ఆ విశాలమయిన నేత్రాల్లో దైన్యం, ప్రేమ, పశ్చాత్తాపం గజగజా వణుకు తున్నాడు ఆపాదమస్తకం

తన హృదయం కదిలింది

గబగబా లోపలికివెళ్ళి దోవతులు తెచ్చియిస్తూ "ముందు ఆ తడిగుడ్డలు విప్పండి" ఆజ్ఞాపించింది

"ఇక ఆ కుర్చీలో కూర్చోండి"

బుద్ధిమంతుడిలా చెప్పినపని చేశాడు చంద్రం టవల్ తీసుకు తనే శుభ్రంగా తలంతా తుడిచింది.

"మీరే తుడుచుకోండి, నా కెందుకీ శ్రమ?" ఏదో జ్ఞాపకం వచ్చినట్లు టవల్‌మీద పడేసి అడుగు ముందుకు వేసింది

తన చేతిని మరో చెయ్యి బలంగా పట్టు కుంది

తను వెనక్కు చూసింది

చంద్రం నవ్వుతున్నాడు నవ్వుగా, పెదాలు దాటకుండా

క్షణంచూసి మరలని చూపులను మరల్చు కుని కిటికీలోగుండా బయట కురిసే వర్షధారలను చూస్తూ ఎందుకు వచ్చారు యింత వర్షంలో? ఆ చలపతితోనే ఎక్కడో ఒకచోట ఉండలేక పోయారూ!" నిర్లిప్తంగా అంది

చంద్రం పెదవులపై, కళ్ళల్లో అదే నవ్వు, నిశ్శబ్దమయిన నవ్వు

"చెప్పరేం?"

"నీకోసం "

"నిర్దాక్షిణ్యంగా, ఏకాంతంగా నన్ను వదిలి వెళ్ళి పోయింది నా కోసమేనా?"

"నేను పుట్టింది, బ్రతుకుతున్నది నీ కోసం కాదూ?" అంటూ తన పిడికిలిలో బిగించు కున్న చేతిని మరికొంచెం బలంగా లాక్కున్నాడు. తను వెళ్ళి చంద్రం ఒళ్ళో అసహాయంగా వాలి పోయింది

"ఆ దొంగ మాటలే వద్దనేది మీదంతా నటన"

మెట్లపైన అడుగుల సవ్వడి

కిలకిల ధ్వనులు

ఈజీచైర్‌లో పడుకున్న అరుణ ఉలిక్కిపడి లేచినుంచుంది

బెదిరే కళ్ళతో చుట్టూ చూసింది పాల వెన్నెల చిక్కగా కురుస్తూనేవుంది వాయువులు వీస్తూనే ఉన్నాయి

తను కల గన్నదా?—

పైకి చూసింది — చంద్రుడు, నక్షత్రాలు ఫక్కుమన్నాయి

పకపకలతో సావిత్రిబృందం పైకి వచ్చింది. పేరంటంనుంచి ఎత్తి పొడుపులతో—ఎగతాళు లతో—"తలుపు తాళం వేసి లేకపోతేను, యిటు వచ్చాము—ఎందుకు వెళ్ళలేదో కనుక్కుపోదామని" అన్నారు

"తల నొప్పిగా ఉంటేను. " నసిగింది అరుణ.

"మీ ఆయనేరి?"

మందు, కాఫీ తెస్తానని బజారు కెళ్ళారు. వస్తుండాలి"

అంతా దిగి వెళ్ళిపోయారు

"రెంటికి చెడ్డ రేవడినయ్యాను" అనుకుంది అరుణ

ఈజీచెయిర్‌లో అరుణ మళ్ళీ వెనక్కు వాలింది బలవంతాన ఆలోచనలను బంధించివేసి తెర కట్టింది. మనసు శూన్యమయిపోయింది

క్షణాలు జారిపోతున్నాయి

బరువుగా కళ్ళు మూసుకుంది

పల్చటి తెరవెనుకనుండి కన్పిస్తున్నట్లు—తెర పైన ఒక ప్రక్కనుండి అస్పష్టమయిన ఒక ఆకారం కదిలివస్తోంది క్రమేణ మధ్యకు వచ్చి రూపు కట్టింది.

అక్కయ్య ...

మరో ప్రక్కనుండీ అలాగే—

బావ

పక్క కాలి క్రింది తాబేలులాగే—మనసు మెల్లగా జారిపోయింది గతంలోకి

—ఏప్రిల్ నెలలో ఒక శనివారం తనకు పరీక్షలు జరుగుతున్నాయి సోమవారంతో పరీక్ష లాఖరు పరీక్షలన్నీ బాగా రాసింది ఇక ఈ పరీక్ష కూడా గట్టెక్కేస్తే—తనకు 'క్లాసు' తప్పదు నమ్మకంలో యీ రెండు రోజులు కష్టపడి చదవటానికి నిశ్చయించుకుంది

సాయంత్రం అయిదున్నరయింది డాబామీద ఒంటరిగా కూర్చుని తను చదువుకుంటోంది

"అరుణా "

తను బలవంతాన కళ్ళనూ, మనసునూ చదివే పుస్తకంలోనుంచి మరల్చి—తల పైకెత్తింది అక్కయ్య ప్రక్కనే నుంచుంది

"ఏమిటక్కయ్యా"

"ఇవ్వాళ సినిమాకు వెళ్దాం "

"నీకేమన్నా మతిపోయిందేమిటి?" పొడిగా నవ్వేసి ఎల్లుండితో నా పరీక్ష లాఖరు సోమవారం మంచి రోజుకో సినిమా చూడాలి ఏమే అక్కా "

"అదికాదే బంగారక్కా ఆ సినిమా యివ్వాళతో వెళ్ళిపోతోందిట ఎన్నాళ్ళనుంచో చూడాలనుకుంటున్నాంకదా "

తనకూ విచారం కలిగింది ఈ విషమ పరిస్థితికి కాని, పరీక్షల నశ్రద్ధచేసి సినిమా చూస్తుందా?—ఏటికేడాది చదువు ఎంతో కష్టపడిన చదువు .

"పోనిలే అక్కా—నే నింకోసారి యెప్పుడయినా చూస్తానులే నువ్వెళ్ళిరా"

"నువ్వు లేకుండానా? రేపు ఆదివారమేగా .. రేపుల్లా చదువుకోవచ్చు"

"చదువంటే చింతగింజలాటనుకున్నావా? నీకు తెలీదులే అక్కా నువ్వు వెళ్ళిరా"

"పోనిలే మహాలావు చదువు నీవే గనుక చదువుతున్నావ్ " అని మూతి తిప్పి వెళ్ళిపోయిం దక్కయ్య

"అక్కయ్యకు అనవసరంగా కోపం వచ్చింది" అనుకుని పుస్తకం మూసేసి అరుణ కూడా క్రిందికి వెళ్ళి "వస్తున్నానక్కా " అంది

"నీ సినిమా పిచ్చి నాకు తెలీదూ " అక్కయ్య హేళనగా నవ్వింది

తను లోలోపలనే అక్కయ్యనిచూసి నవ్వుకున్నది

ఇద్దరూ బయలుదేరి వాకిట్లోకి వచ్చారు

వాకిట్లో రిక్షా ఆగింది రిక్షాలోనుండి బావ దిగాడు

"ఓ నన్ను 'రిసీవ్' చేసుకోవడానికి అక్కాచెల్లెళ్ళు యిద్దరూ వచ్చారే "

"అందుకాక్కాదండీ బావగారూ మేం సినిమాకి వెళ్తున్నాం తమరు కూడా ఒక్క నిమిషంలో వెంచేయకలిగితే ఆగుతాం "

"సారీ .. నే నిప్పుడు రాలేను—మీరు వెళ్ళి రండి "

బావ లోపలికి వెళ్ళిపోయాడు

"అమ్మా—బావచ్చాడే" అని కేకేసి తను వాపి

# ఇష్టా యిష్టాలు

చూసింది ఆరుంబావయింది అరున్నరకే సినిమా మొదలు తను రిక్షాయెక్కికూర్చుంది అక్కయ్య తటపటాయిస్తున్నది.

"అక్కయ్యా—త్వరగా వెళ్ళాలే "

"నువ్వు వెళ్ళవే"

తను ఆశ్చర్య పోయింది

"అదేమిటి అక్కయ్యా "

"ఆయన ఇవ్వాళల్లా ప్రయాణంచేసి అలిసి పోయి వచ్చారు స్నానం చేయాలి ఉదయమయినా భోజనం చేశారో లేదో త్వరగా భోజనం చేయాలి "

"ఎవరే—నువ్వా, బావా?"

"బావ అయితే మాత్రం"

---

స్నేహితులందరూ ఒక చోట గుమిగూడి మాట్లాడు కుంటున్నారు.

1 వ స్నేహితుడు:- తగ్గరా తగ్గు! డబ్బా డొక్కులా తెగ వాగు తున్నావ్. యిక్కడ కట్టులులేవు, జాగ్రత్త సుమా?

2. వ. స్నేహితుడు :-ఎందుకురా కట్టులు?

1. వ స్నేహితుడు:- గాడిద లా స్తే తగిలెయ్యటానికి...

2. వ. స్నేహితుడు:- రావలసిన గాడిదలన్నీ వచ్చి ముందే కూర్చున్నాయిగా, యింకేం గాడిద లొస్తాయి.

గాదం శెట్టి వెంకట సాంబశివరావు

(ఖర్గపూర్)

---

"నువ్వు లేకపోతే బావను నెస్తువడుకోబెట్టరు గాని నువ్వు త్వరగా ఎక్కు" తను రిక్షాదిగి అక్కయ్య చెయ్యి పట్టుకుంది

"నీకు తెలీదులేవే—నువ్వు వెళ్ళిరా" అక్కయ్య చేతిని విడిపించుకుని లోపలికి వెళ్ళిపోయింది

తనకీసారి ఆశ్చర్యంకంటె ఎక్కువ కోపం వచ్చింది

తన చదువు చెడగొట్టింది. పైగా తన్ను ఒంటరిగా వెళ్ళిపొమ్మంటుంది కోపంతో రిక్షావాడితో "అశోకాకు తీసుకుపో" అంది

సినిమా చూస్తున్నంతసేపూ అక్కయ్య మనస్తత్వం గురించే ఆలోచించింది తను అక్కయ్య కాపరానికి వెళ్ళిన తర్వాత రావడం అదే మొదలు తామందరూ ఎదురు చూస్తున్నారు వాన్న వెళ్ళారు తీసుకురావడానికి అక్కయ్య బండి దిగింది.

అక్కయ్యనుచూసి మొదటిసారి ఆశ్చర్య పోయింది తను అక్కయ్య నిండు కనకాంబరం రంగు కాశ్మీర్ సిల్కుచీరె కట్టుకుంది

"అదేమిటేవ్? అక్కయ్యా—యీ రంగు నువ్వెప్పుడూ కట్టవ్‌గా "

"మీ బావగారికి యిదంటే యెంతో యిష్టం"

"సన్యాసుల మార్కు అనేదానివిగా "

"నేను యిది కట్టుకుంటే—అచ్చు కణ్వాశ్రమంలోని శకుంతలాగా ఉంటానుట"

"బలేబలే—తను ఇక దుష్యంతుడన్నమాట .. బావనిరానీ కనుక్కుంటా"

"పోవే నీ మాటలూ నువ్వూ "

"ఇక దాన్ని లోపలికి రానివ్వవా యేమే" అమ్మ కోప్పడింది

ఇంటర్వెల్ అయింది లైట్లు వెలిగాయి సోడాల కీచు ధ్వనులతో కాఫీ, టీ కేకలతో హాలు నిండిపోయింది

కథ ఏం జరిగింది?—

ఏమో

తను ఎందుకు వచ్చింది?

మనసంతా యేవేవో ఆలోచనలు తన మనసులో మరో సినిమా తన మనసులో సినిమా చూడటానికి తను యింత దూరం రావాలా? ఇంతలో లైట్లు ఆరిపోయినయ్ హాలు నిశ్శబ్దమయింది తను మనసును అదుపులో పెట్టుకుని మిగతా చిత్రం అయినా సరిగా చూడాలనుకునీ అయిదు నిముషాల్లోనే వోడిపోయింది

తన మనసులో కట్టుకున్న తెరపై యీసారి అక్కయ్య బావలకు బదులుగా సుగుణ నిలబడింది

తమ కాలేజీ వాళ్ళందరూ మహాబలిపురం ఎక్స్‌కర్షన్‌కు బయలుదేరారు దారిలో మద్రాసులో ఒక రోజుఆగి చూడదగ్గవన్నీ చూశారు ఆ సాయంకాలం మెరీనాబీచికి వెళ్ళారు ఆకాశంలో నక్షత్రాల్లాగ ఎక్కడ కక్కడ ఒక జంట మిగతా ప్రపంచాన్నంతటినీ మరిచిపోయి కబుర్లతో, నవ్వులతో రస మగ్నమయి ఉన్నది సముద్రపు అలల హోరు వాళ్ళకు వేదవ్య సంగీతంలాగ ఉంది

తామందరూ కాంటీన్‌కు దారితీశారు

తాము లోపలికి వెళ్ళుతుంటే ఒక పరిచయమయిన కంఠం వినిపించింది

"హల్లో మిస్ అరుణా "

తనుచుట్టూ చూసింది తెలిసిన వాళ్లెవ్వరూ లేరు

తను ముందుకు అడుగువేసింది

"నిన్నే అరుణా—"

తన భుజంపై చేయి పడ్డది తను వెనక్కు తిరిగింది

... నాగరిక—హైహీల్డుషూస్ రెండు జడలు షిఫాన్ శారీ మోచేతులు దిగిన స్క్వేర్ నెక్ వెల్వెట్ చోళీ చెక్కిళ్ళకు రోజా పొడరూ . లిప్‌స్టిక్ . చేతిలో అతి నాజూకుగా అల్లబడిన వేనిటీబాగ్ సెంట్ గుబాళింపు పైగా కళ్ళకు జోడు . తను యెవరో పోల్చుకోలేక నిశ్చేష్ట అయింది

"నేను అరుణా" కళ్ళద్దాలు తీసింది

"మీరా " ఆశ్చర్యపోయింది సుగుణ! అక్క

య్య క్లాస్‌మేట్ ఎంత తేడా! అప్పుడు ఎంతో నిరాడంబరంగా ఉండేది నేత చీరెలు తప్ప కట్టుకునేది కాదు ఒక్క జడ తప్ప వేసుకునేదికాదు అలంకారంలో ఏమాత్రం అతిశయం, ఆడంబరం కనుపించినా అందరినీ అసహ్యించుకునేది

"చాలా మారిపోయినాను కదూ అది సరేకాని వీళ్ళంతా ఎవరు? ఎక్కడనుండి? ఎక్కడకు?"

ఆశ్చర్యపోతూ సుగుణను తదేకంగా చూస్తూ— అన్నిటికి సమాధానాలు చెప్పిందితను

"అఁ—మర్చిపోయాను వీరు మావారు—పేరు అంటూ చిరు నగవుతో ప్రక్కకు చూసింది

గాబర్డిన్ ఫుల్‌సూటులో, నోట్లో పైప్‌తో ఖరీదయిన చేతికర్రను అతి విలాసంగా ఆడిస్తూ ఒకాయన

"అదే వద్దనేది . పేరు చెప్పటానికేముంది?" వయ్యారంగా ఒక్కసారి పొగ వదిలి అన్నారు "శేఖర్ పూర్తిగా చెప్పాలంటే రాజశేఖర్ "

తను నమస్కారం చేసింది

అతడదోరకంగా తలవంచాడు

"ఈమె అరుణ—నా బెస్ట్‌ఫ్రెండ్ లక్ష్మి—మీకు చాలాసార్లు చెప్పాను "

"యస్ యస్ "

"ఆమె సిస్టర్"

"హౌ ఐ సీ "

నా చేతినందుకుంటూ "నువ్వు రాత్రికి మా యింటికి రావాలి" సుగుణ ఆహ్వానించింది

"తప్పకుండా రావాలి" శేఖర్ బలపరిచారు

"ఇవ్వాళకాదు తిరిగి వచ్చేటప్పుడు తప్పక వస్తాను "సుగుణ అడ్రస్ ఇచ్చింది

తను మాటప్రకారం రిటరన్‌లో సుగుణ యింట్లో దిగింది ఆరాత్రి శేఖరంగారు లేరు కాంపుకు వెళ్ళారు. కావలసినంత స్వేచ్ఛ భోజనాలుచేసి కబుర్లలోకి దిగారు అన్నీ అయిపోయిన తర్వాత తను అడిగింది

"మీ రిలా మారిపోతారని నేను కలలో కూడా అనుకోలేదు"

"నేను మాత్రం అనుకున్నానా? ఆడవాళ్ళు పెళ్ళి కాగానే పరాధీనలయిపోతారు వారి అభిరుచులకు, అభీష్టాలకు అనుగుణంగా మారిపోక తప్పదు ఒకవేళ నాబోటిది మొదట్లో కాకపోయినా బలవంతాన అయినా మార్చబడుతుంది లేకపోతే కుటుంబంలో శాంతి ఉండదు చీటికీ మాటికీ భేదాభిప్రాయాలతో సంసారం నరకతుల్యమైపోతుంది—అయినా నీకు యిప్పటినుండీ ఎందుకులే పెళ్ళయితే అదే తె ుంది " పొడి పొడిగా నవ్వింది సుగుణ. ఆ న్వ్వలో ఆనాడు తన కెంతో అనుభవమూ బాధ స్ఫురించాయి

సినిమా వదిలేశారు

సినిమా చూడలేదని తనకెందుకో బాధ కలుగలేదు వచ్చి రిక్షాలో కూచుంది ఇంటి కొచ్చింది అక్కయ్య సినిమాకు రానందుకు విచారపడుతూ ఉంటుంది ఓదార్చాలి అనుకుంది

కాని, తమాషా! అక్కయ్య నవ్వు తనకు వాకిట్లోనే విన్పించింది తనకు వళ్ళు మండింది

అక్కయ్య మనస్తత్వం తనకు విచిత్రంగా తోచింది.

పెద్దగాలి వీచింది. కొబ్బరి మట్టలు డాబా పిట్టగోడకు కొట్టుకుని ఆలోచనలకు అంతరాయం కలిగించాయి ఆలోచనలు చెదిరిపోయినయ్. సుగుణ, అక్కయ్య మాటలు తన చెవులో గింగురుమంటున్నాయి

మనసంతా కల్లోలమయిపోయింది

అక్కయ్య తనంత తానుగా బావకు అనుగుణంగా మారిపోయింది

సుగుణ బలవంతంగా శేఖరంకు అనుకూలంగా మలచబడింది

అక్కయ్య ఒక తరగతి సుగుణ మరొక తరగతి

తను యే తరగతికి చెందుతుంది?

తనకు నాటకాలంటే అయిష్టం కాని చంద్రం అభీష్టాన్ని కాదనలేక యిష్టపడ్డది —తీరా చంద్రం వచ్చి సున్నా చుట్టాడు — తనకేమీ కష్టం కలుగలేదు కారణం—? తనతో కబుర్లు చెప్తూ తన సన్నిధిలోనే ఉన్నాడు కనుక

చివరకు చంద్రం కబుర్లనూ కాదని . తన్ను నిర్లక్ష్యంచేసి వెళ్ళిపోతే—తన మనసు సంక్షుభిత సముద్రమయిపోయింది గుండెలలో 'అగ్ని పర్వతాలు' ప్రబద్ధలయినయ్! తనలో యిన్ని ఆలోచనలు బయులుదేరినయ్

అంటే చంద్రం అభిరుచులకు అనుగుణంగా తన అభిరుచులనూ మార్చుకోగలదు కాని తనను అలక్ష్యం చేస్తే మాత్రం—తను సహించలేదు

తనావ్యథను భరించనూలేదు

తనావ్యథానలంలో దగ్ధమైపోనూవచ్చు .

ఆ ప్రహారానికి తన మనసు తాడితభుజంగమవ్వనూ వచ్చు

"అరుణా !" మెట్లమీదినుండే చంద్రం పిలుపు

అరుణ పలుకలేదు

"అరుణా " తన దగ్గరకు వచ్చాడు.

తలెత్తింది

"నువ్వు భోజనం చేశావా?"

"మీరు రాకుండానా?"

"అదే నీ చాదస్తం పోనీలే దారిలో హోటల్లో టిఫిన్ తీసుకుందాం నువ్వు త్వరగా బయలుదేరాలి "

అర్థంకాక చంద్రంవంక పిచ్చిగా చూస్తోంది. ఆ కళ్ళు ఆ చింపిరిజుట్టు తనను అవహాస్యం చేస్తున్నాయ్

"సినిమాకి వెళ్దాం రెండో ఆటకు రెండు టిక్కెట్లు రిజర్వ్ చేయించాను "

అరుణలో చలనంలేదు

"ఆలస్యంచేస్తే అందుకోలేం త్వరగా రావాలి—లే" చేయిపట్టుకు లేపాడు

అరుణ లేచి నుంచుంది

చంద్రం ముందుకు సాగాడు.

అరుణా వెనకాలే నడిచింది

క్రిందికిదిగి అరుణ తాళం వేసింది.

చంద్రం రిక్షా పిలిచి యెక్కి ఒక ప్రక్కకు జరిగాడు మిగిలిన ఖాళీలో అరుణ యెక్కి కూర్చుంది

రిక్షా ముందుకు సాగింది 



"అతనికి చీకటిగా ఉందేమోనని "

చిత్రకారుడు జి. సాయి కృష్ణారావు (గుంటూరు)



శివాజీ గణేశన్



బి. సరోజాదేవి



ఎస్. వి. రంగారావు

## [illegible] 'కష్టసుఖాలు'

మానవుడు తప్పు తెలిసి చేసినా తెలియక చేసినా తప్పనిసరై చేసినా జీవితంలో ఎప్పుడోప్పుడు ఆ తప్పుకు ఫలితాలు ఏదో రూపంలో తప్పవు. ఆనందధామంలో విహరించే వ్యక్తి అథఃపతనం పొందుతాడు. జీవితమనేది గతుకుల బాట కాని పూలతయ్య కాదు. కష్టసుఖాలు అనేవి ఒకదాని వెంట ఒకటి (చిత్రద్వయం నుంచి తీసి కూర్చిన రీళ్లలాగా విడివిడిగా) వస్తూ పోతూ ఉంటవి ఈ సత్యాన్ని నిరూపిస్తూ, ప్రేక్షకులను హాస్యరసభరితంగా, నలువు వాగులకు కొత్త మలుపులు చూపిస్తూ శివాజీ ఫిలింస్‌వారు తాము తయారు చేసిన కష్టసుఖాలు ఇటీవల విజయోద్యానంలో ప్రత్యేకంగా ప్రదర్శింపారు.

తమిళంలో ప్రజాదరణం పొందిన 'విడివెళ్లి' చిత్రాన్ని శివాజీ ఫిలిమ్స్‌వారు కష్టసుఖాలుగా తెలుగులోకి తర్జుమా చేశారు.

విద్యావంతురాలు కోరిన సమృద్ధి లేకపోతే చెల్లెలు సీత (ఎం. ఎన్. రాజం) వివాహం కాదని భయపడిన చంద్రం (శివాజీ గణేశన్) ఒక నగల షాపు నుండి బంగారు నెక్లెస్ దొంగిలించి తీసుకువచ్చి యిచ్చి వివాహం జరిపిస్తాడు. తనకు ఆ నెక్లెస్‌ను ఎవరో స్నేహితుడు యిచ్చాడని బొంకుతాడు

సీతా, ఆమె భర్త రవి (బాలాజీ) స్వగ్రామానికి వెళ్లిపోతారు. వారి దాంపత్యం చాలా అనుకూలంగా సాగిపోతుంటుంది

చంద్రంకు పట్నంలో చిత్రా మెడికల్స్‌లో ఉద్యోగం దొరుకుతుంది ఆ సంస్థ యజమాని రంగారావు (ఎస్. వి. రంగారావు) కుమార్తె చిత్ర (బి. సరోజాదేవి) చంద్రంను ప్రేమిస్తుంది టైపిస్టు (రోసీ) కారుడ్రైవరు బాబు (టి. ఆర్. రామచంద్రన్)ల ప్రేమకలాపం కాలక్షేపానికి కలిసిరాగా చంద్రం, చిత్రలు ప్రేమించుకుంటూ ఉంటారు.

తాను చేసిన దొంగతనం వల్ల బాధపడుతున్న చంద్రం రంగారావు తనకు బహుమతిగా ఇచ్చిన సొమ్ముతో ఒక నెక్లెస్ కొని ఇచ్చి తన సోదరి దగ్గర నెక్లెస్ తీసుకురావటానికి బయల్దేరతాడు చంద్రం నెక్లెస్ దొంగిలించింది తనవద్ద నుంచేనని తెలుసుకున్న చిత్ర మనస్సు వికలమవుతుంది గాని చంద్రం నుంచి తన మనసు మళ్లించుకోలేకపోతుంది.

సీత మెడలో ఉన్న నెక్లెస్ ప్రమాదవశాత్తు జారిపడి అందులో ఒక యువకుని ఫోటో బయట పడుతుంది రవి సీతను అనుమానించి అవమానిస్తాడు సరిగ్గా ఈ సమయానికి చంద్రం చెల్లెం వద్దకు రావటం, ఆ నెక్లెస్ విషయంలో తగిన సంజాయిషీ యివ్వలేని చంద్రాన్ని, సీతను రవి అవమానించి పంపెయ్యటం జరుగుతుంది అతి మానసిక భారంతో చంద్రం సీతను తన యింటికి తీసుకువస్తాడు.

చిత్ర చంద్రంల ప్రేమను పసిగట్టిన రంగారావు చంద్రంను ఉద్యోగం నుంచి తొలగిస్తాడు తత్ఫలితంగాను, తన దోషంవల్ల ఇంట్లో అశాంతి చెలరేగటం వల్లను సంక్షుభిత మనస్కుడైన చంద్రం తన దొంగ నెక్లెస్ యజమానుల్ని కనుక్కోవాలన్న ఉద్దేశంతో పోలీసులకు నెక్లెస్‌తో సహా స్వాధీనమవుతాడు నెక్లెస్ దొరికిందని వార్త విని చిత్ర తండ్రి పోలీస్ స్టేషనుకు వచ్చి చంద్రాన్ని తూలనాడ్తాడు కాని చిత్ర వచ్చి తానే చంద్రానికి హారాన్ని ఇచ్చానని చెప్పటంతో చంద్రంను పోలీసులు వదలివేస్తారు.

నెక్లెస్‌లో ఉన్న ఫోటో ఎవరిదో తెలుసుకోవాలన్న ఉద్దేశంతో చంద్రం రవిని బతిమాలి చిత్ర యింటికి తీసుకువస్తాడు. చిత్ర ఆ ఫోటోలోని వ్యక్తి తన సోదరుడని చెబుతుంది, కాని రంగారావుకు చంద్రం అంటే గిట్టదు గనుక చిత్రని చంద్రం ప్రభృతులకు అవమానం కలిగించి పంపుతాడు దాంతో రవి కూడా చంద్రాన్ని దూషించి వెళ్లిపోతాడు. చంద్రం చిత్ర ప్రేమను త్యజిస్తాడు.

తను చంద్రాన్ని ప్రేమించటం ఇష్టంలేక తన తండ్రి ఆ నెక్లెస్‌లో ఫోటో గూర్చి అసత్యం చెప్పాడని, అతను తన అన్నేనని చిత్ర, బాబు ద్వారా చంద్రానికి చెప్పిస్తుంది చిత్ర తండ్రి ఈలోగా తన కుమార్తెకు ఇంకొకరితో వివాహం నిశ్చయిస్తాడు. పెళ్లిసందడిలో ఉన్న చిత్ర ఇంట్లో చంద్రం దొంగతనంగా చిత్ర అన్నతో రంగారావు తీయించుకున్న ఫోటోను దొంగిలిస్తాడు.

రవిని బతిమాలి తీసుకు రమ్మని సీతను పంపి రవిని పిలిపిస్తాడు చంద్రం. సీతా, రవితో సహా చంద్రం చిత్ర యింటికి వస్తాడు. అప్పటికి ఆ యిల్లంతా పెళ్లివారి హడావుడితో ఉంది. బంధువులు మిత్రులు హాజరై ఉన్నారు. ఈ వివాహం యిష్టంలేనందువల్ల చిత్ర పారిపోతుందేమోనన్న భయంతో ఆమెను తండ్రి గదిలో బంధిస్తాడు తండ్రి చంద్రం తనవద్దనున్న ఫోటోలో ఉన్న వ్యక్తి ఎవరో చెప్పమని అడుగుతాడు చుట్టుపట్లవారంతా ఆ వ్యక్తి చిత్ర సోదరుడని రుజువు చేస్తారు చంద్రం చిత్ర తండ్రిని నిందించటంతో పందిట్లో వాళ్లందరికి పెద్ద దెబ్బలాట జరుగుతుంది ఈ హడావుడిలో వివాహ మండపానికి నిప్పంటుకొని ఆ భవనం తగలబడుతుంటుంది మంటలమధ్య మారుమూల గదిలో ఉన్న చిత్రను బయటికి తీసుకొచ్చేందుకు ఎవరూ సాహసించరు. తనకు తగిలిన దెబ్బవల్ల స్పృహతప్పిన చంద్రం ఈలోగా కోలుకొని చిత్ర పరిస్థితిని గమనించి మంటలో దూకి ఎంతో కష్టంమీద చిత్రను



అజిత్ ఆర్ట్స్‌వారి చిత్రంలో వస్తారు అజిత్ సింగ్

రక్షించుకుంటాడు తన కూతుర్ని రక్షించినందుకు కుమారుడని చిత్ర తండ్రి చిత్రా చంద్రంల వివాహం జరుపుతాడు. ఆపైన అంతా ఆనందంగా ఉంటారు.

నటీనటుల్లో శివాజీగణేశన్ ప్రభృతులు బాగానే నటించినా అగ్రతాంబూలం రవిగా నటించిన బాలాజీకి ఇవ్వవచ్చు అతి సున్నితం అవిశ్రుతము అయిన హృదయం కల రవిగా బాలాజీ చాలా ప్రశంసనీయమైన నటన చూపాడు చిత్తూరు నాగయ్య తండ్రి రంగారావుగా రంగారావు, హాస్యజంట గోపీ—బాబుగా పద్మిని ప్రియదర్శిని టి. ఆర్ రామచంద్రన్‌లు చంద్రం తల్లిగా కాంతకుమారి, సీతగా ఎం. ఎన్ రాజం, పాత్రోచితంగా నటించారు.

రచన చాలా పుష్టిగా సాగింది. తెలుగు మాటలకు కొత్త వ్యాఖ్యానపు వెలుగులు చూపిన సదాశివ మాటల్ని సంగీతపు సింగారంతో పాడిన వేలం గోపాల్ పాటలు చిత్ర విజయానికి దోహదం చేస్తాయి.

అన్నిటికన్న అలమానికంగా ఉంది శ్రీధర్ దర్శకత్వం ఒక్కొక్క భావాన్ని ఎన్ని మలుపులు త్రిప్పవచ్చో అన్నివిధాలు ఈ చిత్రంలో చూపించారు. ప్రేమ సంభాషణల చిత్రీకరణంలో కూడా ఈ కొత్త పద్ధతే ప్రవేశపెట్టారు గోపీ చిత్రాలు వారి ప్రియులతో సంభాషించే సన్నివేశం, అలాగే గోపీ—బాబూ, చిత్రా చంద్రంలు ఒకరికి తెలియకుండా రెండో జంటను కలుసుకోటం లాంటివి కావలసినంత హాస్యాన్ని కలిగిస్తాయి. అలాగే భారీ సన్నివేశాల చిత్రణలో కూడా శ్రీధర్ తమ ప్రతిభావంతంగానే నడిపినా కొన్నిచోట్ల తప్పటడుగు వేసిందేమో అనిపించింది. తాను తొలిసారి చెప్పి చంద్రం రవిని ప్రతిమాలుకునే దృశ్యంలో 'క్లోజ్ షాట్స్' ఇచ్చి చంద్రంను బదులుగా రవితో కలిగిన భావ సంచలనాన్ని సంపూర్ణంగా చిత్రించేందుకు వినియోగించివుంటే చాలా బాగుండేది అలాగే ఆసాంతం అతినైపుణితో నిర్మించుకొచ్చిన సీత పాత్రచే ఒక పాట పాడించటంవల్ల ఆ పాత్ర స్వరూపానికే భంగం కలిగింది. చెల్లెలిపైన మమకారాన్ని చేరుత నైనావే.. ద్రోహమే చేశావే అని సీతచేత పాడించారు తనసోదరుడు ఏవిధంగా దొంగతనం చేయాల్సి వచ్చిందో, గృహపరిస్థితి ఎటువంటిదో తెలిసిన సీతనుంచి పై మాటలు వెలువడటం చాలా కృత్రిమంగా ఉంది ఆ పాటకు ముందుదాకా ఆ పాత్రపైన కలిగిన సానుభూతి అంతా ఒక్కసారి మాయమయ్యే ప్రమాదం ఏర్పడింది తన చేయని దోషానికి పతి నుంచి వేరయ్యానే అనే మానసిక వేదనలో వుండి అనుకోవటం సహజం అనుకున్నా ఆ పాటను ఇంకో పద్ధతి ద్వారా చెప్పించకుండా ఆ పాత్రద్వారానే చెప్పించటం పాత్ర ఔన్నత్యాన్ని తగ్గించటమే గాక చలనచిత్రాల్లో అతివాస్తవికత నాశించేవారి కాశా భంగం కూడా కల్గించవచ్చు అలాగేవుంది విశాల మనస్కుడైన చంద్రానికి అతడి తల్లి ఘాటు ఉపన్యాసం ఇవ్వటం కూడా

ఏవో యిలాంటి తప్పుల్లాంటివి ఒకటి రెండు ఉన్నా మొత్తంమీద చిత్రం బాగానే ఉంది వివాహ మండపం తగలపడటంనుంచి కథాంతంవరకు చిత్రం ఉత్కంఠతో సాగిపోయింది

తమిళచిత్రాలకు సాధారణంగా వుండే చిన్న చిన్న చిలిపిదోషాలున్నా సొంపైన సంగీతం (ఏ. ఎం రాజా) వలపు రీతులలో గిలిగింతలు కొలిపే హాస్యం ఆద్యంతం ఉత్కంఠా భరితంగా నడిచినపాత్ర పోషణం ఉన్న ఈ చిత్రం విజయం పొందటంలో కష్టంలేదు కనుక సుఖంగా నిర్మాతలు సినిమా తెలుగుచిత్రాన్ని ఈమా రందివ్వగలరని ఆశించవచ్చు 'వాగరాజ్' ★

# వార్తాభరణం

## త్వరలో విడుదల

## "టాక్సీరాముడు"

శ్రీ రామకృష్ణ ప్రొడక్షన్స్‌వారి టాక్సీరాముడు నిర్మాణం దాదాపు పూర్తయింది చిత్రాన్ని సెప్టెంబరు రెండవ వారంలో విడుదల చేస్తున్నారు. వి. మధుసూదనరావు దర్శకత్వంలో నిర్మిస్తున్న ఈ చిత్రంలో ఎన్ టి. రామారావు జగ్గయ్య, రేలంగి, గుమ్మడి రాజనాల చదలవాడ కె. వి ఎస్ శర్మ దేవిక గిరిజ ప్రభృతులు నటిస్తున్నారు. సంగీతం : టి. వి. రాజు రచన : సముద్రాల, ఛాయ : పి. నాగేశ్వరరావు

## అమూల్య కానుక

మహేశ్వరి పిక్చర్సువారి రమ్మా చిత్రం "అమూల్య కానుక" విడుదలకు సిద్ధంగా ఉంది. పద్మిని, ఎం కె. రాధ ప్రభృతులు పాల్గొన్న ఈ చిత్రానికి ఛాయా దర్శకుడు, నిర్మాత, దర్శకుడు టి. జానకిరామ్. మాటలు: కె. జి మోహన్ పాటలు వేణుగోపాల్, నన్నిసెట్టి సంగీతం : పాండురంగన్.

## మనమూ-మన రాష్ట్రం

(11-వ పేజీ తరువాయి)

సంఘాలు నష్టంమీద పని చేస్తున్నాయి హైదరాబాదు చేనేత సహకారసంఘం క్రింద 117 వేలు సభ్యత్వంతో 130 ప్రాథమిక సంఘా లున్నవి ఇందులో 41 నష్టంమీద పనిచేస్తున్నాయి

ఆంధ్ర చేనేత కేంద్ర సహకార సంఘంలో షేర్ల క్రింద 7 లక్షల 20 వేలు, హైదరాబాదు కేంద్ర చేనేత సహకారసంఘంలో షేర్లక్రింద 120 లక్షల 41 వేలు ప్రభుత్వం పెట్టుబడి పెట్టింది ఇది గాక 1950 నుంచి హైదరాబాద్ సంఘానికి రు3,47 వేలు ఆంధ్రసంఘానికి రు 2393 వేలు ప్రభుత్వం గ్రాంట్లుగా ఇచ్చింది వీటితోబాటు 16 లక్షలు హైదరాబాదు సంఘానికి, 45 లక్షలు ఆంధ్రసంఘానికి వడ్డీలేని ఋణాలు కూడా లభించాయి. ఈవిధంగా ప్రభుత్వం పెట్టుబడి (అంటే ప్రజల డబ్బు) ఉన్న సంస్థలు సరిగా నడవడంలేదనిగాని, డబ్బు దుర్వినియోగమైపోతున్నదనిగాని ఆరోపణలువస్తే అది తీవ్రమైన విషయమే ఆంధ్ర చేనేతసంఘం దర్యాప్తుకు ప్రభుత్వం నిర్ణయించినట్లు శాసనసభలో మంత్రి ప్రకటించారు నిజంగా లోపాలు లేనప్పుడు, సంఘం సక్రమంగా నడుస్తున్నప్పుడు ఈ దర్యాప్తును ప్రతిఘటించడం అనవసరం పైగా తమ నిజాయితీ రుజువుచేసుకోడానికి చాలా ఉపయోగపడుతుంది అయితే హైదరాబాద్ చేనేత సంఘం నష్టంమీద నడుస్తోందనే, ఆరోపణలను గురించి కూడా తేల్చడం మంచిది ఇప్పుడు లాభం వస్తున్నదని అంటున్నా, వెనుకటి నష్టం ఎలా భర్తీ చేస్తున్నదీ తెలపాలి ఈ రెండు సంఘాలలో లోపాలేవైనా ఉంటే సర్దుబాటుచేసి విలీనం చేయడం ఉత్తమం ఆంధ్ర తెలంగాణాలలో విడివిడిగా ఉంటున్న సంస్థ లనేకం ఇదివరకే లీనమైపోయాయి ఇవి వేరువేరుగా ఉండటం వాంఛనీయం కాదు కర్నాటక మరాట్వాడా ప్రాంతాలను హైదరాబాదు సంఘంనుంచి తప్పించడం కూడా ఇప్పుడు పూర్తి అయింది కనుక 1958 లో ప్రభుత్వం నియమించిన ప్రత్యేకాధికారి సిఫార్సు ప్రకారం అంచెలవారీగాగాని, లేదా ఒకేసారిగాని రెండు సంఘాల విలీనానికి ప్రభుత్వం సాధ్యమైనంత త్వరలో చట్టం తీసుకొనిరావడం మంచిది

* * *

ఈ సంవత్సరం భారత స్వాతంత్ర్యవార్షికోత్సవ సందర్భంలో దేశనాయకులు జాతీయైకమత్యం, కుల మత భాషాది బంధనాల విముక్తి ఆవశ్యకత గురించి ప్రజలను హెచ్చరిస్తూ సందేశాలు ఇచ్చారు కాని ఆంధ్ర గవర్నర్ శ్రీ సహార్ సందేశానికి ఒక ప్రత్యేకతఉంది ఆయన తన సందేశంలో యువకులను ప్రత్యేకించి పేర్కొని, వారిలో పొడసూపుతున్న దౌర్జన్య మనస్తత్వాన్ని తెగనాడారు ఏ చిన్న సమస్య వచ్చినా సహనం కోల్పోయి, ఆవేశానికిలోనై పబ్లిక్ ఆస్తులను ధ్వంసం చేస్తున్నారని, ఈ విధ్వంసకాండ అరికట్టడానికి పౌరులు—స్త్రీలు, పురుషులు—స్వచ్ఛంద రక్షక దళాలుగా ఏర్పడాలని ఒక కొత్త సూచన చేశారు యువకులలో జాతీయ బాధ్యతాభావాన్ని పెంపొందించడానికి మార్గాలన్వేషించాలన్నారు స్వాతంత్ర్య వార్షికోత్సవ శుభసమయాన యువకులను పట్టుకు ఈరకంగా దులిపివేయడం కొంతఅన్యాయంగా కన్పిస్తుంది బహుశః ఇటీవల ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థుల సమ్మె సందర్భంలో ప్రభుత్వ ఆస్తిపాస్తులకు జరిగిన నష్టానికి బాధపడేవారు తమ సందేశంలో ఈ ప్రసక్తి తెచ్చారేమో

యువకులలో ఆవేశం ఉండటం సహజమేగాని, స్వతఃవారిది దౌర్జన్య మనస్తత్వం అంటే ఎవరూ హర్షించలేరు దేశంలో ఏ చిన్ని సంఘటన సంభవించినా, యువకుల్ని ముఖ్యంగా విద్యార్థుల్ని రెచ్చగొట్టి స్వప్రయోజనాలకు వినియోగించుకుంటున్నది రాజకీయపార్టీలు, రాజకీయ నాయకులు ఇన్నాళ్ళు ఇలా ఉపయోగించుకొంటున్నది కమ్యూనిస్టుపార్టీయేనని కాంగ్రెస్‌వారు నిందించేవారు. అస్సాం అల్లర్లలో కాంగ్రెస్‌పార్టీ కూడా ఇలాంటి గౌరవం సంపాదించింది కమ్యూనిస్టు కాంగ్రెస్ అనేకాదు దేశంలో ప్రతి పార్టీ కొద్దో గొప్పో ఇందుకు బాధ్యత వహిస్తూనే ఉంది యువకుల్ని రెచ్చగొట్టినా, పబ్లిక్ ఆస్తులను ధ్వంసం చేసేటంత దౌర్జన్యాలకు పురికొల్పినా ఈ పార్టీలే కనుక పార్టీలకే జాతీయబాధ్యతాప్రవర్తన లేనప్పుడు కేవలం ఆవేశపరులైన యువకుల్ని నిందించి ప్రయోజనంలేదు దేశంలో ఏ పార్టీగాని ఇలా యువకుల్ని, ప్రత్యేకించి విద్యార్థుల్ని ఆందోళనలోకిదింపము అని ప్రమాణం తీసుకొని దేశశ్రేయస్సునట్ల బాధ్యతాయుతంగా ప్రవర్తించాలని గవర్నర్ హెచ్చరించిఉంటే బాగుండేది

పబ్లిక్ ఆస్తులు ధ్వంసంకాకుండా పౌర దళాలు ఏర్పడాలని, అవి అహింసాయుతంగా ఈ విధ్వంసకాండను ప్రతిఘటించాలన్నారు పబ్లిక్ ఆస్తులే గాదు, ప్రైవేట్ ఆస్తులు కూడా నాశనం కారాదు. కాని అందుకు పోలీసుబలాలు చాలవనా? కాదు. పోలీసుబలం దౌర్జన్యాన్ని, దౌర్జన్యంతోనే ఎదుర్కొనే బలం గనుక రక్తపాతం తప్పదని గవర్నర్ భయం అయ్యుండాలి అందుకే అహింసాప్రతిఘటన సూచించారు హింసద్వారాగాని, అహింస ద్వారాగాని దౌర్జన్యాలను ప్రతిఘటించడం సంగతి అటుంచి, అసలు ఈ దౌర్జన్య మనస్తత్వం విజృంభించడానికి కారణాలేమిటో వెదికి, అందుకు అవకాశం లేకుండా చేయడం ఉత్తమ మార్గం ★

## మనమూ-మన దేహస్థితి

(14-వ పేజీ తరువాయి)

తర్ఫీదు పొందని అనేక మంది, ఆయుర్వేదం, హోమియోపతీ స్వయంకృషివల్లనే నేర్చుకుని ఆ మందులు అడిగిన వారికి ఉచితంగానో, ప్రతిఫలం తీసుకునో వాడడం సాధారణంగా జరుగుతున్నది

విజ్ఞానం, కృషికి ఫలితం ఆసక్తి కలిగి కృషి చేసిన ఎవరికయినా అది లభిస్తుంది ఎల్లోపతీ విజ్ఞానం పొందడం, ఇతర విజ్ఞానములు పొందడంలాకాదు మెడికల్ కాలేజీకి పోకుండా అది సాధ్యంకాదు రోగికి కావలసింది అందుబాటులోవుండి, త్వరితంగా నివారణ కలిగించే ఔషధం సామాన్యుడి దృష్టిలో అది ఎవరిచ్చినా ఒకటే! వైద్యుడికివుండే ప్రచారం అతను కలిగించే ఫలితాలమీదా, ప్రవర్తనమీదా అందుబాటులో ఉండడంమీదా ఆధారపడివుంటుంది ఈ కారణంచేత డిగ్రీలు లేనివారు కూడా సత్ఫలితాలు కలిగించినప్పుడు ఘన వైద్యులుగా ప్రజాదరణా, ప్రఖ్యాతి పొందగలుగుతున్నారు

ఆదర్శాలు, ఆ ఆదర్శములు అమలు జరపడానికి అనుకూలములయిన పరిస్థితులు వున్నప్పుడే మానవ శ్రేయస్సుకు దారి తీస్తవి ఆ పరిస్థితులులేని సందర్భాల్లో అవి ఆత్మహానికీ, పరహానికీ కారణము అయిన ఆత్మవంచనకు జగద్వంచనకూ కారణములవుతవి రోగం సర్వ మానవ సాధారణమైన అనుభవం జనాభాకు తగినంతమంది పదవి పొందిన వైద్యులు లభించకపోతే మందుల విక్రయంలో శాసనాలు అవసరం కెమిస్టులు డాక్టర్లు కావడానికీ హానికరములయిన నాటుమందులు ప్రజలు మింగడానికీ కూడా వైద్యులకొరతే కారణమౌతుంది అవుతున్నది ఆధునిక ఔషధముల ఖరీదు విపరీతంగావుండి, ప్రజలకు అందుబాటులో వుండడంలేదు

“రోగములను గురించివ్రాస్తే చాలదు మారుమూలలోవుండి, వైద్య సహాయంలేక బాధపడే వారికి, ఏ వ్యాధికి ఏ మందు వాడాలో చెబితే చాలా బాగుంటుం”దని చాలామంది పాఠకులు రాశారు. వారి కోరిక తీర్చడంలోవున్న కష్టమూ ప్రమాదమూ పైన వివరించాను మందులు అనేక కంపెనీలవారు తయారు చేస్తారు అందులోకొన్ని మాత్రమే వైద్య ప్రపంచం అంగీకారాన్ని అదరాన్ని పొందుతవి వాటిని మాత్రమే పత్రికల్లో పేర్కొంటే ఆ కంపెనీల వారికి ప్రత్యేక ప్రచారం చేసిన నిందకు గురి అవడం జరుగుతుంది పై కారణాలచేత శాస్త్రీయమైన గృహవైద్యం అసాధ్యమైపోతున్నది ఈ పరిస్థితిలో వైద్య విజ్ఞానాభిలాషవున్నవారికి సమగ్రమైన వైద్య విజ్ఞానం కలిగించడం ఉత్తమమైన పద్ధతిగా నాకు తోస్తున్నది

కుటుంబ ఆర్థిక పరిస్థితులకు తగినట్లుగా త్వరగా వైద్య సహాయం, లభించేచోట్ల తెలిసీ తెలియని స్వంతవైద్యం అక్షంతవ్యమయిన నేరం మందు పిస్తోలులాగా ప్రాణమోసం కలిగించవచ్చు ప్రాణ రక్షణ కలిగించవచ్చును వైద్య సహాయం లేనిచోట్ల కొన్ని జాగ్రత్తలతో మందులు వాడడం ఇతర పద్ధతులకంటె మంచిదే అని తోస్తుంది

టాన్సిలైటిస్‌కు ఇంట్లో వాడదగిన మందులలో సల్ఫానిలమైడ్ జాతి మాత్రలు, పెన్సిలిన్ మాత్రలు ఫలితం యిచ్చేవి ఎక్కువగా ప్రమాదం లేనివి

సల్ఫానిలమైడ్ మాత్రలు వికారం, డోకులు తలతిప్పు అప్పుడప్పుడు కలిగిస్తవి ఇవి అందరూ

# మనము-మనదేహస్థితి

గ్రంహితిని వెంటనే ఆ మందు తీసుకోక మానివేయవచ్చును ఇవికాక ఎక్కువగా వాడినప్పుడు, నెత్తురులో శ్వేతకణములను నాశనంచేసే గుణం వీటికి వున్నది క్రిమి సంహారం కేవలం యీ శ్వేత కణముల వల్లనే జరుగుతుంది క్రిమిసంహారమనే పేరుతో యీ కణములనే నాశనం చేయడం ప్రాణాపాయకరం అసలు టాన్సిలైటెస్ రావడమే ఈ శ్వేతకణములు రక్తంలో తగ్గిపోయినప్పుడు రావచ్చును. అందుకని అవకాశంవున్నప్పుడల్లా రక్తం పరీక్షించి శ్వేత కణ సంఖ్య సరిగ్గా వున్నప్పుడే వైద్యులయినా వీటిని వాడతారు కొన్ని రకాల సల్ఫా నిలమైడ్ మాత్రలు తేలికగా కరిగి రక్తం ద్వారా అన్ని ప్రదేశాలకుపోక, స్ఫటికములుగా ఏర్పడి మూత్రాశయంలో పేరుకుంటవి రక్తంలో ఒక ద్రావణ స్థితి, అందుకున్నప్పుడుగాని యివి క్రిమి సంహారం చేయలేవు. అందుకు వయసునుబట్టీ, బరువును బట్టీ విధిగా కొన్నిమాత్రలు వాడాలి లేకపోతే ఈ మందుకు ఆ పురుగులు అలవాటుపడి ఔషధనిరోధక శక్తిని (drug resistance) క్రిములే ఏర్పరచుకుంటవి. మళ్ళ రోగాలకు గురిఅయినవారు, మందుల కొట్లు వాళ్ళని ప్రతిమాటి ఒక మాత్ర రెండు మాత్రలు మింగుతారు. ఇది చాలా ప్రమాదం ఇంతకంటె ఏదీ మింగకపోతేనే మంచిది ఈ చిన్న మోతాదులవల్ల దేహంలో సహజంగావుండే రోగ నిరోధకశక్తి పోతోంది ఆ తర్వాత ఆ మందువల్ల ప్రయోజనం తగిన మోతాదులో యిచ్చినా వుండదు. కొన్ని మాత్రలు ముందే మింగితే ఆ వ్యాధే రాకుండా నిరోధింపబడుతుందని కొందరు అనుకుంటారు. అదీ దురభిప్రాయమే సల్ఫానిలమైడ్ రకంతో సల్ఫాడయాజిన్ సల్ఫామెంజిన్ యౌవనం దాటిన వారికి పూటకు రెండు మాత్రలు, 12—14 వారికి రోజుకు నాలుగు, 6—12 వారికి రోజుకు మూడు, 2—6 వారికి అర మాత్ర రోజుకు నాలుగు సార్లు, ఇంకా క్రిందవారికి అరమాత్ర పూటకు మూడుసార్లు చాలు. ఈ ఔషదం తయారు చేసినవారు వాడమని చెప్పిన మోతాదుల్లో వాడితే మనదేశంలో పడడంలేదు పెన్సిలిన్ సాధారణంగా 2,00,000 యూనిట్ల మాత్రలుగా లభిస్తుంది పై మోతాదులలోనే యీ మాత్రలు వాడవచ్చును

సల్ఫా నిలమైడ్ పడనప్పుడు మందకొడితనం, వాంతి, తలనొప్పి, రక్తంచెడి శరీరం నల్లబడిపోవడం, దురదలు, దాగర్లు, కామెర్లు, మూత్ర బంధనం ఇటువంటి ప్రమాదములు రావచ్చును

నోటి ద్వారా వాడినప్పుడు పెన్సిలిన్ ఇన్ని ప్రమాదములు కల్పించదు దురదలు, విరేచనములు రావచ్చును ఏ సందర్భంలోనూ పరిపూర్ణ విజ్ఞానం లేనివారు పెన్సిలిన్‌గాని, యితర ఔషధములుగాని యింజెక్షన్‌గా యివ్వగూడదు సల్ఫానిలమైడ్ ఉపయోగిస్తున్నప్పుడు నీరు అధికంగా త్రాగుతూ వుండాలి

టాన్సిలైటెస్ తరుచు వస్తు వుంటుంది. టాన్సిల్సు అందరిలోనూ వుంటవి టాన్సిల్స్ పెద్దవైనప్పుడల్లా ఇన్‌ఫ్లేం అయినవని అనుకోరాదు కాని దీర్ఘమయిన టాన్సిలైటెస్‌లో రెండు ప్రక్కల వుండే టాన్సిల్సు ఒకదాని నొకటి అంటి మింగడం, వూపిరిపీల్చడం, దుస్సాధ్యం చేయవచ్చును తరుచు జలుబు చేయడం గొంతు నెప్పి రావడం ఏర్పడవచ్చును మింగడం వూపిరి పీల్చడం కష్టమైనప్పుడు శస్త్రచికిత్సతో వీటిని తీసివేయవలసిందే

టాన్సలైటిస్ దీర్ఘస్థితిలోనే ఆరంభించవచ్చును ఈ రకం పెద్ద వారిలో తరుచు యేర్పడుతుంది ఇందులో పెద్ద గొంతు నొప్పి, జ్వరం వుండవు గొంతులో ఏదో ఇరిటేట్ చేసినట్లు వుంటుంది టాన్సిల్ నొక్కితే చీము ఉండలు వుండలుగా బయటికి వస్తుంది. టాన్సిలైటెస్ ముదిరినప్పుడు హృద్రోగం, కడుపులోనూ, పేగులలోనూ పుండు, కీళ్ళవ్యాధి వూపిరితిత్తుల వ్యాధి ముక్కులలో వ్యాధి, చెవిలో పోటు, మెదడు వ్యాధులు రక్తక్షీణత మూత్రాశయములలో వ్యాధులు ఇంకా ఎన్నో అవయవముల వ్యాధులు రావచ్చును

## టాన్సిలైటెస్ - శస్త్రచికిత్స

ఎప్పుడు శస్త్ర చికిత్సతో టాన్సిల్సు తీసివేయాలి అన్న విషయంలో అందరికీ ఒకే అభిప్రాయంలేదు కాని అధిక సంఖ్యాకులు యీ క్రింది పరిస్థితులలో టాన్సిల్సు విధిగా తీసివేయాలి అని విశ్వసిస్తున్నారు

1 టాన్సిళ్ళు తరుచు ఇన్‌ఫ్లేం అవుతున్నప్పుడు.

2. చెవిలో చీము ఏర్పడి, ఎంతకీ నివారించడానికి వీలు లేనప్పుడు

3 టాన్సిల్సులోనుంచి చీముకారుతూ నోటినుండి దుర్గంధం వస్తున్నప్పుడు

4 మెడలో యితర కారణములు కనబడకుండా లింఫుగ్లాండులు పెద్దవౌతున్నప్పుడు

5 తగిన కారణములు లేకుండా గుండె, కీళ్ళు, మూత్రాశయం యిటువంటి అంగములు తరుచు వ్యాధిగ్రస్తములవుతున్నప్పుడు

6 ఎన్ని మందులు యిచ్చినా, ఎంత మంచి ఆహారం తిన్నా బిడ్డ రేకట్టి పెరగక కృశించిపోతున్నప్పుడు

7, టాన్సిల్సు పెద్దవై, అంగిలిని నిండి, వూపిరి తీయడం, మింగడం కష్టమైనప్పుడు

8 టాన్సిలుచుట్టూ చీముచేరి ఏబ్సెస్ ఏర్పడ్డప్పుడు

9 టాన్సిల్‌లోనుంచి వచ్చే చీములో డిఫ్తీరియా క్రిమిగాని క్షయక్రిమిగాని కన్పించినప్పుడు

10 తరుచు జలుబు, జ్వరం, ఆకలి లేకపోవడం, వూపిరి తిత్తుల వ్యాధి వస్తున్నప్పుడు ఈ పై పరిస్థితులలో రోగగ్రస్తములయిన టాన్సిల్సును విధిగా తీసివేయాలి

(సశేషం)

---

# హరివంశం

(15-వ పేజీ తరువాయి)

అనుకొనెడివారు ఈ కుర్రది పద్మమువంటి ముఖము కలది దీనితో సరితూగెడువారు మూడు గజములలో నెవ్వరునులేరు ఆమె అగళమున ఆరేఖా త్రయము ఏమిటి? బ్రహ్మ వ్రాసిన సంకేత రేఖల వోలెనున్నవి" మరియు ఆమెనుగురించి కొన్ని వింతలు వార్తలు పుట్టినవి కాశిలో నిత్యము శివతీర్థజలములను క్రోలుటచేసి, జ్ఞానవాపికా తోయ సేవచేసి, ఆమె కడుపున మూడు లింగములు ప్రాదుర్భావమును చెందినవట ఇది ఆశ్చర్యముకదా! ఇట్టి వార్తలు పుట్టినవి!

ఆమెకు ఇంకను పెండిలి కాలేదు ఒక్క దినమున రాత్రి పిండిచల్లిన విధముగా వెన్నెలకాయుచున్నది ఆ సుందరి చంద్రికాపాండుతల్పమున పండుకొన్నది అర్థరాత్రియగువేళకు ఒక్క విద్యాధరుడు ఆకాశమున పోవుచు ఆమె నిద్రా సౌందర్యమును చూచినాడు ఆ సౌందర్యము అచ్చమైన సౌందర్యము. మేలుకువవలన చెడని సౌందర్యము సహజమైన సౌందర్యము. సర్వేంద్రియములు ప్రాణమున లీనముకాగా, ఇంద్రియ వికారమును ఎరుగని ప్రాణమయమైన సౌందర్యము ఆ సౌందర్యమునుచూచి విద్యాధరుడు మోహితుడైనాడు ఆమె తన భార్యయైనచో! విద్యాధర స్త్రీలు సిగ్గున పడిపోరో! ఆ వెన్నెల! ఆ వెన్నెలకన్నను అందమైన ఆ కలువ కన్నుల అన్నులమిన్న వానికి మనస్సు ఆగినదికాదు వాడు భూమికి దిగినాడు ఆమె పరమసుకుమారి అంతకన్నను సుకుమారములయినవి వాని హస్తములు. నెత్తమ్మిరేకులనుపోని కన్నులుగల నిద్రాసుందరి ఆమె నెత్తమ్మిరేకులకన్న సుకుమారములయిన హస్త పల్లవములు వానివి ఆమెకు నిద్రాభంగము కారాదు అయినదో తను చూచిన ఆ సౌందర్యమేమియగును! తాను ఏమి అయిపోవును అనుకొని విద్యాధరుడు ఆమెను, ఆ నిద్రాసుందరిని మెల్లన ఎత్తికొని ఎదకు హత్తుకొని గగనమార్గమున మలయపర్వతమునకు తీసికొనిపోయినాడు

శ్రీకృష్ణ! కామమువిచిత్రమైనది అది ఏమిచేయుంచదు! ఇప్పుడు వీడు ఆమెను ఎదకు హత్తుకొని, ఎత్తుకొనిపోయినాడా! అది వానికి దక్కలేదు వాడు దానిని కొనిపోవుచుండగా, ఒక్క రక్కసుడు ఆమెను, వాని చేతులలోని సౌందర్యవతిని తిలకించినాడు. వానిపేరు విద్యున్మాలి వాడును ఆమెను చూడగా మోహాంధుడయినాడు వానికిని మదనావేశము కల్గినది వాడును మారవికారచేష్టుడైనాడు ఆ కమలాక్షి చక్కదనమును చూడగా, వానికి రాగము కల్గినది కామము ఒకటి, రాగము ఒకటి, మదము ఒకటి, పరమ దుర్మార్గము లయినవి లోభము వీనికి దగ్గరిచుట్టము వానికి అప్పుడు అన్నియును కల్గినవి ఆమెయందు కామము కామముతోడి రాగము, రాగముతోడి లోభము, లోభముతోడి మదము ఇన్ని కల్గిన వాడు ఆమెను విద్యాధరుని చేతులలోనుండి బలాత్కారముగా లాగికొన యోచిం

చినాడు వాని యోచనను గ్రహించి విద్యాధరుడు ఆమెను ఒక్కచోయోజించి, ఉద్యత్ బాహు పరాక్రమముతో రక్కసునిపై కవిసినాడు అప్పుడు వారి ఇద్దరకు ఘోరరణమైనది వారిద్దరును మోహముచే అంధులు మరియును ఇప్పుడు వారు ఇద్దరు అంగజమోహమునబడి కొట్టుకొనిపోవుచున్నవారు వారి ఆహవము ముష్టాముష్టి బాహాబాహవిని, కచాకచిని సాగినది అప్సరస్త్రీ అయిన తిలోత్తమకొరకు పూర్వము సుందోపసుందులే పోరాడుకొన్నారు ఇప్పుడు ఈ స్త్రీ కోసము ఈ ఇరువురే పోరాడుకొన్నారు వారి ఆ పోరాటపునడిలో ఆమె మేలుకొన్నది మేలుకొని వారి పోరాటమునకు అయిన కారణమును గ్రహించినది ఆమె అబల ఏమి చేయగలదు ఆమెకొరకు వారు పోరి పోరి నిధనము చెందినారు అన్యోన్యముష్టి ప్రహారములచేత నొగిలిధనము చెందినారు

విద్యున్మాలి వెంటనే మరణించినాడు విద్యాధరుడు మాత్రము కొనవూపిరితో ఆమెను తిలకించినాడు ప్రాణ నిర్యాణవేళలో గూడ వానికి ఆమెపై మక్కువ పోలేదు అప్పుడు వాని నోటివెంబడి ఈ మాటలు వెలు డినవి : "కటకటా! నిన్ను" అనుచు వెలువడినవి ఆ వెంటనే వాడు అవగతప్రాణుడయినాడు ఆ మాట ఇంకను వాని నాలుకమీద నేయుండగా ప్రాణోత్క్రమణమైనది

సుశీలకు దుఃఖము పొరలుకొని వచ్చినది ఈ విద్యాధరుడు తన్ను ఇచ్చటికి తెచ్చినాడు నిద్రలోనున్న తన్ను ముట్టినాడు ఆలింగనము చేసుకొనలేదని ఎచ్చట నున్నది. పాలింద్లను ముట్టలేదని తిచ్చట నున్నది. అంతయు తనకు నిద్రలో స్వప్నమువలె తోచినది ఆ నిద్రలో తాను ఆ విద్యాధరుని స్వప్నమునందువలె చూచినదో! నిద్రలోనున్న తన్ను వాడు పరిరంభణమున పట్టగా పులకించినదో! వదన పద్మము తావుల నానగా ఆనందమును చెందినదో! వానికి నేను ఆలునుకాక మరిఏమి యగుదును అనుకొన్నది సుశీల ఆమె ఒక నిశ్చయమునకు వచ్చినది ఆ విద్యాధరుడు నాకు భర్త నేను వానికి భార్యను ఇప్పుడు నా కర్తవ్యము ఏమి?

సుశీల విద్యాధరునితో సహగమనము చేయగా పూనిక వహించినది అక్కడ తన్నుచూచి సోదార్చువారు లేరు తనకు సాయము చేయువారు లేరు తన్ను చూచి విచారించువారులేరు ఆమెయే స్వయముగా విన్నిపటేరకాష్ఠములను పేర్చుకొన్నది కమ్మవూ మొగ్గలు దండగ్రుచ్చుకొన్నది మెడలోవేసికొన్నది తాను భర్తయని ఎంచుకొనిన విద్యాధరుని శరీరమును చితిపై చేర్చినది అప్పుడు కాశిని స్మరించినది విశ్వనాధుని తలంచినది ఆత్మగతమున నిట్లుగా శోకించినది "నా స్వామికి, విశ్వనాయకునకు ఏమిట తప్పినానో! కాశిలో ఎల్లరును సుఖమున నుండగా నాకు ఇట్టి దుర్గతిని ఎందులకు విధించినాడో! తిరిగి నాకు జ్ఞాన వాపికలో స్నానము చేసెడి అదృష్టములేదుకదా! అనుదినము నా చెలికత్తియలు జ్ఞానవాపిలో స్నానము చేయుట యున్నది వారు నన్ను తలచుచున్నారో! నా తల్లి దండ్రులు నన్ను ఎంత అల్లారుముద్దుగా పెంచినారు నేను కనుపించక వారు ఏమిగా తపించుచున్నారో! నేను హరితాంకురములు అందియక హరిణ కొలకము మేయదుకదా! ఇప్పుడు అది ఏమి అయిపోవునో! విశ్వనాథునకు నేను సేవ చేయుటము రుచించలేదువలె నున్నది అందులకే నేమో నాకీ కష్టము విధించినాడు. ఓ కాశిలోని దేవతలారా! ఓయి లోలార్కకేశవ! ఓయి డుంఠినాధ! ఓయి దండపాణి! నన్ను ఏమి చేసినారయ్యా! ఇందరు రక్షకులుపుండి నన్ను అరక్షితనుచేసినారు తల్లీ! జహ్నుకన్య! నిన్ను మరల ఎప్పుడయినా చూడగలనా! నాకు ఇంకో జన్మను ఇప్పించుడి! కాశికి వచ్చెడునట్లు చేయుడి! ఓహో! దేవతలారా! నేను ఇప్పుడు విధవనైనాను ఈ జన్మ అంతయు నిట్లుగా విధవనై నేను వేగలేను ఒకనిచేపడినదానను మరియొకనికి అజ్ఞలిను చాచి రంకుటాల నగుదునా! నాకు ఇతనితోడిదే లోకము పాపవృద్దైవము నాకు పరిభవవహ్నిని తెచ్చిపెట్టినాడు నేను చితికాష్ఠోద్దీపితమైన అగ్నిలో ఈతనితోడ కూడి సహగమనము చేయక ఈ అగ్ని చల్లారదు ఈ విద్యాధరుడు నా భర్త వాడు పుష్ప శరాసనుతోడి జోడైనవాడు. నన్ను అర్మిలిని తెచ్చినాడు ఇప్పుడు నా కళ్ళెదుర నా స్వామి విశ్వనాథ! నా స్వామి ఇట్టులగానైనాడు అంబికా రమణ! ఇంకను ఈ జీవితమును ఏ విధముగా ధరించగలదానను" ఆమెకు దుఃఖావేశము అధికమైనది కొసరి వసంతకాలమున కోయిల క్రొల్చినభంగిగా ఆమె అప్పుడు వెక్కివెక్కి ఏడ్చినది వెక్కసమగు మన్యువేగమునచేసి కాటుకకన్నుల నీరు సోనలై ఆమెపయోధరముల మీదుగా, ప్రవహించినది కాశి ఎక్కడ? మలయము ఎక్కడ! తెక్కలిద్దైవము అసన్మార్గమును వాటించి నన్ను ఎంతగా ఎంతచేసినాడు! అని ...

(సశేషం)

'ఆంధ్ర సచిత్రవారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి సాధారణంగా 4'×2', 4'×4' చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి

తెలుగు వారపత్రికలన్నిటిలో 'ఆంధ్రసచిత్ర వారపత్రిక' సర్క్యులేషన్ అత్యధికమైనది. ప్రకటనలను 'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో వేసి మీ వ్యాపారం అభివృద్ధి చేసుకోనండి. వివరాలకు అడ్వర్టయిజ్‌మెంట్ మేనేజర్ 'ఆంధ్రసచిత్ర వారపత్రిక' 7 తంబుచెట్టివీధి, మద్రాసు-1 కి వ్రాయండి.

పోలాయి ముఖలక్షణాలు గమనిస్తూ అన్నాడు రాజారావు

"మీరా ? ఆ ఇంటికా ?" ఆశ్చర్యం, కోపం పోలాయి కంఠంలో ధ్వనించాయి

"ఎందుకంత ఆవేశపడతావు పోలయ్యా ! ఇత రులను అనవసరంగా సందేహించడం అంత మంచిదికాదు"

పోలయ్య మరేం మాట్లాడకుండా రాజారావు ముఖంలోకి చూస్తూ కూర్చున్నాడు

"ఆమెకు చదువుకోవాలని ఉందట చలమయ్య గారు ఆమెను నాదగ్గిర చదువుకోమని సిఫార్సు చేశారట" అన్నాడు రాజారావు

"అందుకని ఆమె మిమ్మల్ని పిలిపిస్తే వెళ్లా లన్నమాట ... పెద్ద ఎత్తే వేశాడు చలమయ్య దొర మీరు చదువు చెప్తామని మాట ఇచ్చారా ?"

రాజారావు నవ్వి "అంత సులభంగా మాట ఇస్తానా పోలయ్యా . ఆలోచించి కబురుచేస్తా నన్నాను" అన్నాడు

"మంచిపని చేశారు మిమ్మల్ని ఎలాగైనా తమ పక్షం చేసుకోవాలని చలమయ్యదొర ఆ అందాల యంత్రాన్ని మీపైకి ప్రయోగిస్తున్నాడు."

"నిజమేనంటావా పోలయ్యా ! ఛీ ఛీ .. చలమయ్య ఎంత నైచ్యానికి పాల్పడుతున్నాడు ?" జుగుప్సతో అన్నాడు రాజారావు

"అంతేకాదు బాబూ ! . ఓ వెంప మిల్లు కూలీలను రెచ్చకొడుతున్నాడు"

"నేను అనుకున్నదంతా జరుగుతున్నదన్నమాట. పార్టీ పలుకుబడికోసం వాళ్లకు అదే గత్యంతరం అయింది యజమానులకు, కూలీలకూ మధ్య ఉన్న ప్రశాంతమైన వాతావరణాన్ని ఏవో లేని పోని సమస్యలను సృష్టించి కలుషితంచేసి వ్యక్తిగత స్వార్థానికి, ప్రయోజనాలకి కూలీలను ఉపయో గించుకుంటారు." అన్నాడు రాజారావు.

"ఇదంతా ఈ ఎన్నికలకోసమే నంటారా ?" అని ప్రశ్నించాడు పోలాయి

"మరి ఏమి టనుకున్నావు ? .. ఇన్నాళ్ల మంచి లేనిది ఇన్నాళ్ల అమాంతం చలమయ్యగారికి కూలీలమీద దయ కలిగిందనుకున్నావా ?"

పోలయ్య ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు

"అది సర్లేగాని పోలయ్యా—ఇకమంచి నీవు వేషం మార్చెయ్యాలి ఈ నీరుకావి పంచెలు, బనీన్లూ మానెయ్యాలి తలకు పాగ తీసి వెయ్యాలి." అన్నాడు రాజారావు

"నాకు బుద్ధి తెలిసినప్పటినుంచీ ఇలాగే ఉంటున్నాను. ఇన్నాళ్లనుంచి లేనిది ఇప్పుడు మార్చడం దేనికి బాబూ !" ఆశ్చర్యంగా అన్నాడు పోలాయి

"కాలానుగుణంగా మనమూ మారాలి పోలయ్యా ఇక వారం రోజుల్లో పరీక్షకు పోవాలా నీవు ఈ వేషంతో పోతే అంతా నవ్వుతారు రెండు దోవతులు రెండు లాల్చీలు మొదట తీసుకో తలకు ఏమీ లేందే బాగుండదనుకుంటే ఒక గాంధీ టోపీ కొనిపెట్టుకో"

"అమ్మ బాబోయ్ .... ఉల్లో అంతా నవ్వరూ ?"

"ఒకరు నవ్వుతారని, ఏదో అంటారని భయ పడితే నీవు ఏమీ చేయలేవు పోలయ్యా మనం సమ్మంగా ఉంటే సరి" అన్నాడు రాజారావు.

# ఆదర్శాలు-అంతర్యాలు

(10–వ పేజీ తరువాయి)

"అయితే మిమ్మల్ని ఒకమాట అడగమంటారా?" అన్నాడు పోలాయి

"సందేహ మెందుకూ అడుగు"

"అయితే మీరు ఆ అలివేణికి చదువు చెప్ప డానికి ఎందుకు వెనకాడుతున్నారు ?"

"మంచి ప్రశ్న అడిగావు పోలయ్యా ! . ఆమెకు చదువు చెప్పడాని కేం సందేహంలేదు కాని పరిస్థితులనుబట్టి ఆలోచించాల్సి వస్తున్నది. మనకూ, చలమయ్యగారికి మొదటినుంచీ చుక్కె దురు కదా, ఈరోజు ఆమెను నాదగ్గర చదువుకో మనడంలో ఉద్దేశమేమిటి ?" అన్నాడు రాజారావు.

"ఆలోచిస్తే నాకోటి అనిపిస్తున్నది బాబూ ? పెద్ద దొరవారికీ, మీకూ పడదనిగా చలమయ్య దొరవారి పార్టీ అంటే మీకు నమ్మకం లేదయ్యె పైగా వాళ్ళు కూలీ జనాన్ని రెచ్చగొడుతుంటే చూస్తూ వూరుకోరేమోనని ఆయన ఈ సన్నాగం పన్నిఉంటాడు. అలివేణికి మీరు చదువు చెబు తుంటే ముఖమాటంతో అన్నీ చూస్తూ వూరు కుంటా రనుకున్నారు" అన్నాడు పోలయ్య

"అసలు నిజంగానే అలివేణికి చదువుకోవా లని ఉందేమో ! నేను చెప్పనంటే భయపడి పోయా ననుకుంటారు చలమయ్యగారు. ఆ అవ



కాశం ఆయన కెందుకు ఇవ్వాలి ? .. ఆమెకు చదువు చెప్పన్నాం కదా అని మన అభిప్రా యాలు మార్చుకుంటామా ?"

"అయితే ఆమెకు చదువు చెప్తారా ? అంతగా ఆమె చదువుకోవాలంటే చెప్పేవాళ్ళ ఎంతమంది లేరు ? మిమ్మల్నే ఎందుకు చెప్ప మనాలి ?" అన్నాడు పోలయ్య

రాజారావు నవ్వి వూరుకున్నాడు

కొన్ని క్షణాలు ఇద్దరిమధ్యా మౌనం

"నన్నే ఎన్నికలలో నేను కూడా నిలబడతానని అంతా అనుకుంటున్నారుకదూ ?" అని ప్రశ్నిం చాడు రాజారావు.

"అనుకోనివ్వండి తప్పకుండా మీరే గెలు స్తారు ఈ దొర్లలో ఎవరో ఒకరు ఓడిపోతారు."

"నాకా ఉద్దేశం లేదు పోలయ్యా" అని నవ్వుతూ "అందరికీ ఆశ్చర్యం కలిగించే విషయం చెప్పనా?" అన్నాడు

"ఏమిటి బాబది ?" ఆత్రంగా ప్రశ్నించాడు పోలయ్య

"ఈ విషయం నీతోనే ఉంచుకో ... నామి నేషన్లు దాఖలు చేసేవరకూ ఎవరికీ తెలియ కూడదు .... దొరలతో నీవు పోటీ చెయ్యాలి పోలయ్యా"

"అదేమిటి బాబూ .... నేనా ? .... దొరల తోనా ?" సంభ్రమాశ్చర్యాలతో అన్నాడు పోలయ్య

"అవును వెనుకబడిన జాతులకు ప్రతి నిధిగా నీవు ఎన్నికలలో నిలబడాలి."

"మీరు హాస్యమాడుతున్నారా బాబూ! నాకే మిటి—ఎన్నికలలో నిలబడడ మేమిటి ? . చిల్లి గవ్వలేని వాడిని తక్కువ కులంలో పుట్టిన వాడిని నేను ఎన్నికలలో నిలబడితే అంతా నవ్వరూ ? నాకు వోటిచ్చే దెవరు బాబూ ! ... పైగా వీడేమిటి—ఎన్నికలలో నిలబడడ మేమిటని ముఖాన వూస్తారు" దైన్యంగా అన్నాడు పోలయ్య.

"నిన్ను నీవు ఎందుకు అవమాన పరుచు కుంటావు పోలయ్యా ! రాజ్యాంగం ప్రసా దించిన హక్కుల ప్రకారం ప్రతి భారతీయుడూ ఎన్నికలలో పోటీ చేయవచ్చు ఊళ్ళో అందరికీ నీమీద అభిమానం ఉంది ముఖ్యంగా పాటకజనం నిన్ను నెత్తిన పెట్టుకుంటారు ఏ ప్రతిఫలాపేక్ష కోర కుండానే నీవు వాళ్లకు సేవ చేశావు అన్యాయాన్ని ఎదుర్కొన్నావు ప్రాణాలకు తెగించి రజాకారు రక్కసుల బారినుండి ఎందరి మాన ప్రాణాలనో రక్షించావు అదంతా వాళ్ళు మరచిపోయా రను కున్నావా పోలయ్యా" అన్నాడు రాజారావు

"ఏమిటో నాకు అంతా అయోమయంగా ఉంది బాబూ ! మీరు ఎన్నికలలో నిలబడి గెలుస్తా రనీ, మా అందరినీ ఒక దారిలో నడిపిస్తారనీ అనుకున్నాను కలలో కూడా అనుకోలేదు, నన్ను ఎన్నికలలో నిలబెట్టే ఉద్దేశం మీకుందని నాకు దొరలతో పోటీ ఏమిటి బాబూ !" అన్నాడు పోలయ్య

"దొరలు వాళ్ళు దొరలా పోలయ్యా ! .... రైతుల్ని పీల్చి పిప్పిచేశారు మిమ్మల్ని అందర్నీ అణగదొక్కారు మీకూ ఒక వ్యక్తిత్వం ఉందనీ, మీరు మనుష్యులనీ వాళ్ళు ఎప్పుడైనా ఆలో చించారా ? మిమ్మల్ని బానిసలుగా ఉపయోగించు కున్నారు. కక్షలతో తమ స్వార్థాలకు మీతో మీకు పోరువులు పెట్టారు రజాకార్లు స్వైరవిహారం చేస్తుంటే గ్రామస్థులకు సరైన రక్షణ కలిం గించకుండా, తమ ప్రాణాలను రక్షించుకోడానికి, తమ సంపదలను కాపాడుకోడానికి ఊరు విడిచి పారిపోయారు వీళ్ళ దొరలా పోలయ్యా"

పోలయ్య మౌనంగా వింటూ కూర్చున్నాడు. రాజారావు మాటలు అతణ్ణి ఆవేశపరుస్తున్నాయి. దొరలు జరిపిన అన్యాయాలు ఒక్కటొక్కటే కళ్లముందు కదులాడుతున్నాయి

"సత్యం, ధర్మగుణం, శీలం, నిజాయితీ ఇవన్నీ ప్రజాప్రతినిధులకు ఉండాలి పోలయ్యా ! నీతి, నిజాయితీలు నీలో ఉన్నాయి అన్యాయాన్ని ఎదు ర్కొనే ధైర్యం నీకుంది పరిస్థితులను అర్థం చేసుకోగలవు లోకం పోకడను, ప్రపంచ రాజ కీయాలను నీవు తెలుసుకోగలగడానికే నీకు చదువు చెప్పాను. పరీక్షలో నీవు తప్పకుండా ప్యాసు అవుతావు. ఇంకా పెద్ద చదువులు చదువుకోవచ్చు. మా రోజుల్లోలాగా కాదు ఈ రోజుల్లో చదువుకో డానికి ఎన్నో సదవకాశా లున్నాయి నిన్ను నిజ మైన ప్రజా ప్రతినిధిని చేయాలనే నా ధ్యేయం."

ఆనందంతో పోలాయి కళ్ళు చెమర్చాయి. అత నిలో భక్తిభావం ఇనుమడించింది. పరిపూర్ణ హృదయంతో పోలాయి రాజారావుకు ప్రణమిల్లాడు.

"ఇదేమిటి పోలయ్యా !" అన్నాడు రాజారావు.

"మీరు నా గురువులు .గురువు దేవుడితో సమాన మన్నారు. మీమాట నా మాటకి ఒక్క కుంటాకా అవి ష్యంది" అన్నాడు పోలాయి

# ఆదర్శాలు-ఆంతర్యాలు

"ఎప్పుడూ ఇలాగ పొగడటం ఎంచుకోకు పోలయ్యా! నేను సాధారణ మానవుణ్ణి నేను చేస్తున్న ఘనకార్య మేమీలేదు నా కర్తవ్యాన్ని నెరవేరుస్తున్నా" అన్నాడు రాజారావు

మళ్లీ యిద్దరిమధ్యా కొన్ని క్షణాలు మౌనంగా దొర్లిపోయాయి

పోలయ్య పుస్తకం తెరిచి తనకు తెలియని పాఠమేదో అడిగాడు రాజారావు ఆ పాఠ్యభాగాన్ని అరటిపండు ఒలిచినట్టు వివరించాడు తరువాత పోలయ్యచేత కొన్ని లెక్కలు చేయించాడు చరిత్రలో ప్రశ్నలు వేసి జవాబులు చెప్పించాడు

మహాపురుషుల జీవిత విశేషాలు, విదేశాలకూ, భారతదేశానికీ ఉన్న సంబంధాలు, అన్ని దేశాలలోని పరిపాలనావిధానం, ఆర్థిక పరిస్థితులను గురించి రాజారావు పోలయ్యకు అర్థమయ్యేట్టు కొంతసేపు వివరించి చెప్పాడు తరువాత తెలుగు పాఠ్యభాగంలోని వరూథినీ ప్రవరాఖ్యుల ఘట్టం చెప్పాడు

"ఇంక పడుకో పోలయ్యా!" అంటూ దీపం తీసివేశాడు రాజారావు

మరికొంత సేపటిలోనే పోలాయి నిద్రపోయాడు

రాజారావుకు ఎంత ప్రయత్నించినా నిద్దుర రావడంలేదు పద్మనుకొన్నకొద్దీ ఏవేవో ఆలోచనలు అతనిలో రేగుతున్నాయి

"నరసింహప్ప, చలమయ్య దొరలకు మైత్రి కలిగిస్తే వూళ్లో రాజకీయాలు చాలామటుకు తగ్గిపోతాయేమో! కాని ఎట్లా? పరస్పరం విద్వేషాలు పెంచుకొని ఏండ్లతరబడి ఒకరినొకరు పట్టి పల్లార్చుకుంటున్న వాతావరణంలో ఎలా కుదురుతుంది ఈ విషయమే వెనకోసారి చూచాయగా నరసింహప్పగారితో అంటే 'అది అసంభవం' అని ములకనగా తోసిపారేశాడు" అనుకున్నాడు రాజారావు.

నరసింహప్ప, చలమయ్య, కరణం, మునసబుల రూపాలు, వాళ్ల చర్యలు, రాజారావు ఆలోచనల్లో వలయాకారంగా తిరిగాయి క్రమంగా అతని ఆలోచనల్లోకి అలివేణి వచ్చింది ఆమె రూపం కళ్ల ముందు కదులాడింది "ఏమిటి తన మనస్సింత బలహీన మవుతున్నదేం?" అని ప్రశ్నించుకున్నాడు, నిద్రపోదామని కళ్ళు మూసుకున్నాడు, మనస్సు నిద్రపోదని తెలిసి కూడా ఏవేవో ఊహలమధ్య ఎప్పుడు నిద్దుర పట్టిందో అతనికే తెలియదు

*　　　*　　　*

ఏదో భవనం!

దేవేంద్రుని భవనంలా కన్నులు మిరుమిట్లు గొల్పుతున్నది

ఆ భవనంలో ఒక అందమైన గది

గోడలనిండా ఆకర్షణీయమైన చిత్రాలు! నిలువుటద్దాలు క్రింద పట్టు తివాసీలు

ఆ ముఖమల్ దిండ్లమధ్య నో అప్సరస వీణాపాణియై చిరునవ్వులు చిందుతున్నది

రాజారావు ఆమెను పోల్చుకుంటున్నాడు. ఆ రూపంలో అలివేణి పోలికలు కనిపించాయి

"ఇక్కడకు ఎలా వచ్చాడు తను?" ప్రశ్నించుకున్నాడు రాజారావు.

ఆమె వీణ మీటుతూంటే అతని హృదయ మహతిని మీటుతున్నట్టు పరవశమవుతున్నాడు

ఆమె లేచి హంసలా ఒక్కొక్క మెట్టే దిగి రాజారావుదగ్గరకు వస్తున్నది ఆ కదలి వస్తున్న మూర్తిలో అలివేణి రూపం అలుముకుపోయి లలితరూపం ప్రత్యక్షమైంది

అతను అప్రతిభుడై చూస్తూ నిలబడిపోయాడు

ఆమె అతణ్ణి సమీపించి కేలందించింది

మళ్లీ అంతలోనే అలివేణి రూపం కదులాడింది

అతడు ఒక్కడుగు వెనక్కు వేశాడు

ఆమె మరో అడుగు ముందుకువేసి అతణ్ణి కౌగలించుకొని పెదాలు అందించింది

అతనామెను గట్టిగా నెట్టివేశాడు

ఆమె క్రిందబడి పగలబడి నవ్వుతున్నది.

అతను చరచర నడచి ఆ గది దాటాడు.

ఏదో ఉద్యానవనం!

పూల సౌరభాలు వెదజల్లుతున్నాయి

ఆ పూలతోటలో ఓ తిన్నెమీద ఓ చక్కని చుక్క, పూలమాల కడుతూ కూర్చున్నది

అతను అడుగులో అడుగు వేసుకుంటూ ఆమెను సమీపించాడు.

మళ్లీ ఆ స్త్రీమూర్తిలో అలివేణి ప్రత్యక్షమైంది. ఆమె అతనికి దగ్గరగా వచ్చి అతని పాదాలకు ప్రణమిల్లింది ఆ క్షణంలోనే మళ్లీ లలిత రూపం సాక్షాత్కరించింది

ఇంతలో సుడిగాలి రేగింది

ఆ గాలిలో ఎటో కొట్టుకుపోతున్నాడు రాజారావు

ఏవో కొండలు, గుట్టలు, అరణ్యాలు, నదీనదాలు.

ఓ గుట్టమీది నుంచి పోలాయి దిగివస్తున్నాడు.

గాలిలో కొట్టుకుపోతున్న రాజారావు పోలాయిని గుర్తించాడు పోలాయి కోపంగా గుడ్లురిమి చూస్తున్నట్లు అనిపించింది

"పోలయ్యా పోలయ్యా ఎందు కలా కోపంగా చూస్తావు పోలయ్యా పోలయ్యా" అరుస్తున్నాడు రాజారావు

నిద్దరలో ఉన్న పోలయ్య అదిరిపడి లేచి కలవరిస్తున్న రాజారావును తట్టి లేపాడు

"ఏమిటి బాబూ! పోలయ్యా అని అరుస్తున్నారు కలేమైనా వచ్చిందా?" అన్నాడు పోలయ్య

రాజారావు లేచి కూర్చున్నాడు, ఆవులిస్తూ.

"అవును పోలయ్యా ఏదో కల వచ్చింది. అవును పెద్ద కలే చిత్రమైన కల చివరకు నేను ఎటో గాలిలో కొట్టుకుపోతున్నాను మధ్య ఎక్కడో నీవు కనిపించావు నీపేరు పెట్టి పిలుస్తున్నాను ఇంతలో నన్ను లేపావు" అన్నాడు రాజారావు

దూరంగా కోళ్ళు కూస్తున్నాయి ఆవులు 'అంబా' అని అరుస్తున్నాయి వీధిలోంచి మునేటికి పోతున్నవారి మాటలు వినిపించాయి

"అప్పుడే తెల్లారుతున్నదే" అన్నాడు రాజారావు

"అవును బాబూ! ఇక నేను వెడతా" నంటూ పోలయ్య తన పక్క చుట్టిపెట్టి బయలుదేరాడు

తను కాంచిన కలను పూహించుకుంటూ రాజారావు లేచాడు.

(సశేషం)

# అల్పజీవి

(9-వ పేజీ తరువాయి)

వాడు చెప్తుంటే ఏ విషయమైనా చెప్తూంటే మురిసిపోయేవాణ్ణి వాడి ప్రాపోగాండాలు వింటూ నవ్వుకునేవాణ్ణి "ఇన్నాళ్లూ—చెరువది—పరీక్షంటే భయం. ఇప్పుడైతే నందనోద్యానం, కాదు, స్వర్గం—అదికాదు, అంతకంటే గొప్పది నాకు స్వంతమయింది దీని కంతటికీ బాధ్యులెవరో తెలుసా, తమ్ముడికన్నా మిన్న—నువ్వు" అంటూండేవాడు. నేను నొచ్చుకించాను. ఇలా పనిగట్టుకుని పొగుడుతూ మాట్లాడ్డం నే సహించేదికాదు.

అయినా వాడు ఊరుకునేవాడుకాదు. పైగా పదిమందిలో నా మంచితనంగురించి గొప్పగా చెప్పి వాడు నాకలా చెప్తూంటే ఎంతో సిగ్గుగా వుండేది నాకు. అదీ సంతోషి మా చలపతి!

ఒకసారి వాళ్ళు వచ్చారు మా క్లేసు నమూనాలు స్వయంగా చూట్టానికి వచ్చినట్టు చెప్పారు చదువులగురించి అడిగారు బాగా చదవమని హెచ్చరించారు. చలపతి లేకుండాచూసి నాతో అన్నాడు

"పరంధామయ్య మాటే పాటే మాటల లెక్క చెప్తున్నాయ్ బాబూ!"

"అనుకోనివ్వండి నాన్నా! మనం చేసేది పరంధామయ్యగారికి సహించరానిదైనంతమాత్రాన మన కర్తవ్యం మానుకోంగదా! బాధపడకండి నాన్నా!"

"చూడు నాయనా! చలపతంటే నీకొక్కడికే కాదు నాకూ అభిమానమే. మరచిపోయాను. చలపతి మొదట పేదవాడు వున్నది పరంధామయ్య కేవలం నామీద కోపంతో మాటలనటంలేదు. అలా అన్నా నాకు కలిగే నష్టమేమీలేదు పరంధామయ్యకి చలపతి అభివృద్ధి కంటకం, సహించరాని విషయం విశాల దృక్పథం లోపించిన పెద్ద మనిషి పరంధామయ్య"

నాన్న నాకు పూర్తిగా అర్థమయ్యాడు లోలోన ఆయన్ని అభినందించాను అటువంటి వ్యక్తిని నాకు నాన్నగా ప్రసాదించిన భగవంతునికి సర్వదా కృతజ్ఞుణ్ణి!

ఏవిధమైన ఆటంకమూ లేకుండా మా చదువులు సాగాయి పరీక్షలు దగ్గర పడటం మూలంగా గట్టిగా చదవాలని నిశ్చయించుకున్నాం

అయితే యీమధ్య చలపతిలో మార్పు కనిపించింది. వాడు రూంకి వేళకి వచ్చేవాడుకాదు. ఇదివరకైతే నాకంటె ముందుగానే రూంలో వుండేవాడు. గడిచిన రెండు మూడు నెలల్నుంచే యీ మార్పు వాడిలో కనుపిస్తోంది ఇలా వాడెందుకు మారిపోయాడో నాకు ఒక పట్టాన అర్థమయ్యింది కాదు ఎప్పుడైనా నోరు విప్పి కారణం అడిగితే ఏదో సినిమాకి వెళ్ళానని, ఎవరో ఫ్రండుతో అలా షికారెళ్ళానని చెప్పేవాడు తరచూ యిలా జరుగుతూనే వుంది ప్రతిసారీ వాడిని పంజాయిషీ అడగటానికి భయపడ్డాను వాడు నన్నేవిధంగా అర్థం చేసుకుంటాడో, నీ నీడపట్టున బ్రతుకుతున్నాననేగా నువ్విలా అధికారం చెలాయిస్తున్నావని అంటాడేమోనని నా భయం కాని చలపతి అంత మాట కారికాడు

ఒక రోజు బాగా పొద్దుపోయేంతవరకూ రూంకి రాలేదు చలపతి పరీక్షలు చూస్తే దగ్గర పడ్తున్నాయి పిడ్డి మూన్నంటే యిలా షికార్లు చేస్తున్నాడు వాడి గురించి ఎదురు చూసి చూసి విసిగిపోయాను. వాడిమీద కోపం ముంచుకొచ్చింది తల పరిరాంగానే అడిగేశాను.

"పరీక్షలు దగ్గరపడుతున్నాయని తెలుసుగా"

"తెలుసు"

"ఇంతలేటుగా రావటానికి కారణం—పరీక్ష అంటే చీమ కుట్టినట్టయినా లేదులాగుంది నీకు"

వాడు మాట్లాడలేదు.

"సినిమాలు, మిత్రులూ—వీళ్ళందర్నీ కనీసం పరీక్షలయ్యేంతవరకైనా మరచిపో" కసిగా అన్నాను వాడు జవాబివ్వకుండా కూజాలో నీళ్ళు గ్లాసులో వంచుకురాగాడు భోజనం చెయ్యమని నేను అడగలేదు. వాడు తినలేదు. అలాగే ముసుగుపెట్టి నిద్రకి ఉపక్రమించాడు దీపం ఆర్పేసి నేనూ పడుండాన్నాను. తర్వాత విచారించాను. నా మాటల్తో వాడి మనసు కష్టపెట్టానేమోనని ఇకనుంచి వాడి

---

మొదటివాడు:- నేను మరి పందెం వెయ్యకున్నా వెయ్యను.

రెండవవాడు:- నువ్వు తప్పకుండా వేస్తావు.

మొదటివాడు:- వెయ్యను. ఎంతెంత పందెం? నేను వెయ్యననీ, నువ్వు వేస్తావనీ 10 రు॥ పందెం.

కుంధా వెంకటసుబ్బారావు(అమలాపురం)

---

నేమీ అనకూడదని నిశ్చయించుకున్నాను ఆ తెల్లవారిజామున వాడే చెప్పాడు

"ఇన్నాళ్లూ దాచినందుకు నన్ను క్షమించు నీకు లేనిపోనివన్నీ కల్పించి చెప్పాను" విచారంగా అన్నాడు వాడి వాగ్ధోరణి నాకు విచిత్రమనిపించింది

"రజనిఅంటే నా ప్రాణం! మేమిద్దరం ప్రేమించుకుంటున్నాం" వాడు ముఖాన్ని కిందికిదించి చెప్పటం మొదలెట్టాడు నేను వాడు చెప్పేది వినడం మినహా మరేమీ చెయ్యలేదు

"ఆమెకి నేనంటె విపరీతమైన అభిమానం తరచూ కలుసుకుంటున్నాం రజనికి సాహిత్యమంటె అభిలాష మామధ్య ఎక్కువగా సాహిత్యం గురించే చర్చ సాగుతుంటుంది చాలాసార్లు రజని యింటికి వెళ్ళాను వాళ్ళ నాన్నగారు సహృదయులు నన్ను వాళ్ళంతా నెత్తిమీద పెట్టుకుంటారు ఆ యింట్లో రజని మాటంటె వేదవాక్కు—రజనీ వాళ్ళింటికి వెళ్ళడం మూలంగా లేటయ్యేది అయినా యీ విషయం దాచి నీకు ఏవో సాకులు చెప్పాను తప్పు వాది మన్నించరా రవీ!"

విభ్రమ్మడయ్యాను రజనిని ప్రేమిస్తున్నాడా? పి ఇప్పుడే ప్రేమ సాగాలు గూడా చేస్తుంటున్నాడా? నవ్వూ, ఆశ్చర్యం రెండూ వచ్చాయి. వాడికేం జవాబు చెప్పకుండా నా పనిలో నేను మునిగిపోయాను అంతలోనె చలపతి విషయమై విపరీతమైన భయం పుట్టుకొచ్చింది చలపతి అమాయకుడు, జీవితంలో వాడు మోసపోకూడదు భగవాన్!

మళ్ళీ ఆ సాయంత్రం చలపతి అడిగాడు. "ఇంకా నామీద కోపం పోలేదుట్రా"అని నవ్వుతూ అన్నాను నాకే కోపం లేదని

"లోతు తెలుసుకుని కాలుపెట్టమన్నారు చలపతీ! జాగ్రత్త! ఈ విషయాల్లో తొందరపాటు పనికిరాదు ఏ నిశ్చయాన్ని వెంటనే చేసుకోమాకు సరే పరీక్షలొస్తున్నాయ్ చదువుకో తర్వాతనే యివన్నీ" హెచ్చరించాను

"నువ్వు చాలా మంచివాడివిరా తప్పకుండా చదువుతా! క్లాసులో పాసవుతా" నన్ను అమాంతంగా లేవనెత్తాడు పిచ్చివాడు మా చలపతి!

పరీక్షలయ్యాయి వాడన్న మాట నిలబెట్టుకున్నాడు క్లాసు లోనె పాసయ్యాడు. నేను మాత్రం మామూలుగా పాసయ్యాను

నాన్నగారి సంతోషానికి అవధుల్లేవు కనుపించిన ప్రతి వాళ్ళతోనూ చెప్పటమే మేమిద్దరమూ పాసయ్యామని చలపతికి ప్రజంటేషన్‌గా నాన్నగారు ఒక వాచీ, సూటూ యిచ్చారు ఆరోజు—చలపతి శక్తిసామర్థ్యాలు చాటి చెప్పింది

సెలవల్లో గూడా చలపతి మాయింటి దగ్గరే వున్నాడు అప్పుడప్పుడు—అదైనా నాన్నగారి పట్టింపు వల్ల — పరంధామయ్యగారింటిదగ్గరికి వెళ్ళేవాడు పరంధామయ్యగారు కూడా యిదివరకులా చలపతిని దుయ్యపట్టడంలేదు అంతమాత్రాన మెచ్చుకోడం గూడా లేదు; మౌనం వహించడం తప్ప. ఏది ఏమైనా పరంధామయ్యగారిలో యీ ముభావం విడ్డూరమే మరి!

రిజల్ట్సు తెలిసిన తర్వాతరోజు చలపతిని అడిగాను

"ఆనర్సుకి ఎప్లై చెయ్యరాదూ" అని

"వద్దు—నీతోపాటె బి ఎ చదువుతాను"

"ఏం—ఎందుకని"

"ఆనర్సు నా కిష్టంలేదు నువ్వూ నేనూ విడిపోటం నేను సహించను" వాడి అభిమానానికి మురిసిపోయాను కాలేజీ తెరిచింతర్వాత చదువుకోటానికి వెళ్ళాం

సంవత్సరాలు గడిచాయి ఫైనలియరు చదువుతున్నాం అందరిలో బుద్ధిమంతులం, బాగా చదవగల కుర్రవాళ్ళమనిపించుకున్నాం. ఇద్దరమూ పోటీలుపడి చదువులు సాగిస్తున్నాం ఇక్కడ ఒక విషయం మరిచాను రజని అప్పుడప్పుడూ మా రూంకి వచ్చేది ఏవో కాలేజీ విషయాలు మాటాడి వెళ్ళిపోతూండేది

రజనిగురించి నే నెక్కువగా చెప్పదలుచుకోలేదు ఏమంటె నాకు ఆమెతోవున్న కాస్త పరిచయంతో, ఆమెను ఎక్కువగా చదవలేకపోయాను. ఆమె ప్రతి మాటా తూచి తూచి మాటాడేది. ఏది మాటాడినా—ఆ మాటకి కొంత 'ధర' కట్టడం సంభవించేది రెండు జడలు! విశాలమైన చక్కటి కళ్ళు! ఎప్పుడూ నవ్వుతూండే చిన్న నోరు!

కోటేరులాంటి ముక్కు—ధన్యుడు మా చలపతి!

చలపతి నడిగాను మీరు పెళ్లెప్పుడు చేసుకుంటారని వాడు నవ్వుతూ ఇంతవరకూ విషయం ఆమెను అడగలేదు బి. ఎ. అయిపోయిం తర్వాత అడగాలనుకుంటూన్నాను అయినా యిప్పట్లో ఏం తొందర వచ్చిందని" అన్నాడు

ఆరోజు రూంకి ఆలస్యంగా వచ్చాను రూంలో వరంధామయ్యగార్ని చూడంగానే ఆశ్చర్యపోయాను. నా కళ్ళని నేనే నమ్మకోలేకపోయాను. పడక కుర్చీలో కూర్చుని చుట్ట కాలుస్తూ ఏదో చెప్తున్నారు చలపతి చాపమీద కూర్చుని ఆయన చెప్పేది వింటున్నాడు నేను నెమ్మదిగా గదిలో అడుగుపెట్టాను

"మారేశ్వాయిస్పు! రావయ్యా రా!" అంటూ ఆహ్వానించారు నన్ను వరంధామయ్యగారు పుస్తకాలు షెల్ఫులోపెట్టి చలపతి పక్కన కూర్చున్నాను వరంధామయ్యగారే అన్నారు — "చలపతి అత్తయ్యవంట్లో ఏం బాగోటంలేదు ఈమధ్య ఆవిడ ఆరోగ్యం దెబ్బతింది డాక్టర్లు గూడా చెప్పారు అట్టేకాలం బ్రతకదని ఆవిడకి చలపతిని చూడాలని వుందిట తీసుకురమ్మని నన్ను పంపింది"

ఆయన అనే ప్రతిమాటా నమ్మలేని స్థితిలో వున్నాను నేను ఎప్పుడూ లేనిది చలపతిమీద యింత హఠాత్తుగా అభిమానం పుట్టుకురావటం — నాలాంటి వాడికి నమ్మశక్యంగాలేదు ఏమిటీ మాయ.

"ఇంతదూరమూవచ్చి యీ విషయం చెపితే— వాడేమో పరీక్షలు దగ్గరడ్డాయి చదువుకోవాలని చెపుతున్నాడు నాలుగైదు రోజులుండి రావటానికి యీ పరీక్షలొక అడ్డా బాబూ! నువ్వైనా చెప్పు నాయనా!"

నిజమేమరి చలపతివైపు ప్రశ్నార్థకంగా చూశాను వాడు వెళ్ళనంటూ కళ్ళతో అడిగాడు. నాకై నేనేమి చెప్పలేదు ఎలాగైతేనేం వరంధామయ్యగారి పట్టువల్ల వాడు వెళ్ళకతప్పింది కాదు.

చలపతి వూరెళ్ళి మూడ్రోజు లయింది ఈ మూడ్రోజుల్లో రాధని ఒకసారి రూం కొచ్చింది. చలపతి వూరెళ్ళాడని చెప్పాను. రెండు మూడు రోజుల్లో రావచ్చునన్నాను ఆమె చెప్పింది: "మా నాన్నగారికి ట్రాన్స్ఫరయింది పరీక్షలయిం తర్వాత వెళ్ళిపోతాం ఈ విషయం చలపతి రాగానే చెప్పండి దయచేసి"

చలపతి లేకపోడం మూలాన్నుంచి నాకు బొత్తిగా తోచడంలేదు వద్దన్నకొద్దీ వరంధామయ్యగారి వింత ప్రవర్తనగురించి ఆలోచనలు వస్తున్నాయి. అసలు ఆయన ఇక్కడికు రావటమే విడ్డూరము. చలపతిని చూడాలని వాళ్ళత్తయ్య కోరిక పడిందంటె మరీ విడ్డూరము ఇందులో ఏదో కిటుకుందనిపించింది నాకు ఏ కారణమూ లేకుండా యింత హఠాత్తుగా చలపతిమీద అభిమానం పుట్టుకురావడమంటే—?

నాన్న రాసిన ఉత్తరంద్వారా చలపతిని వరంధామయ్యగా రెందుకు తీసుకెళ్ళారో తెలిసింది వాళ్ళ రాధని చలపతి కివ్వాలని ఆయన ఉద్దేశ్యమట! మనిషి ఎంతలో మారిపోతాడో—అతనిలో స్వార్థం

చింతగా పని చేస్తుంటే నాకప్పుడు తెలిసొచ్చింది పాలేరుకంటె హీనంగా బ్రతికిన చలపతి గ్రాడ్యుయేట్ గాబోతున్నాడు చిటారు కొమ్మమీద మిఠాయి పొట్లాం! ఎవరికైనా చేదా! వరంధామయ్యగారి లౌక్యానికి నవ్వు వచ్చింది

ఆ తర్వాత చలపతి వచ్చాడు నాడిలో కోపం తారస్థాయి నందుకుంది వచ్చీరాంగానే వరంధామయ్యగార్ని తిట్టడం మొదలెట్టాడు.

"చూశా మావయ్య బుద్ధి! రాధని నేను చేసుకోవాలిట ఇదీ ఆయన పథకం ఇన్నాళ్ళూ ఆయన ఇంటికి వస్తున్నాను ఇప్పుడేమో అల్లుడ్ని గావాలిట — చెప్తే చేసుకోనన్నాను అసలు నా పెళ్ళి ప్రయత్నాలు మీనుంచి ఆశించబోవడం లేదని నిఖచ్చిగా చెప్పాను"

"రజని నీకోసం వచ్చింది వాళ్ళ నాన్నగారికి ట్రాన్స్‌ఫరయిందట పరీక్షలయిన తర్వాత వెళ్ళిపోతారుట వీన్నాకపోతే కలుసుకోమంది" చెప్పాను

"ట్రాన్స్‌ఫరయిందా?" ఆత్రంగా అడిగాడు చలపతి!

"అవును. నా మాటవిని యీ పరీక్షలయిన తర్వాత మీ పెళ్ళి విషయం మాట్లాడు ఈ విషయం దాచుకోటం శ్రేయస్కరంకాదు, చలపతి!" సలహా ఇచ్చాను.

"అల్లాగే ... పరీక్షలయింతర్వాత అడుగుతాను ఆమె అంగీకరించిన తర్వాత మీ నాన్నతో అన్నీ చెప్పుదాం."

మరికొంతసేపు వరంధామయ్యగారి విషయాలు తర్కించుకున్నాం మాటల మధ్యలో రాధగురించి చలపతి చెప్పాడు—

"ఆయింట్లో నామీద సానుభూతి వున్నది రాధ కొక్కర్తెకే! చిన్నప్పట్నుంచి నేనంటె అభిమానం, నేచేసే ప్రతిపనిలో సాయమిచ్చేది రజని లేకపోతే నేను రాధను చేసుకొనేవాణ్నే కాదో చెప్పలేనుగాని — రాధ నిజంగా నాకు తగిన వధువు నే వచ్చేముందు అంది 'బావా! నాన్నావాళ్ళు నిన్ను బాధపెడుతున్నారు నువ్వు లొంగిపోకు అనవసరంగా నీ జీవితాన్ని నాశనం చేసుకోకు నాన్నమనమ్మి నీ ఇష్టానికి నువ్వే అంతరాయం కలిగించుకోమాకు' రాధ ఆ యింట్లో ఎట్లా పుట్టిందిరా రావ్?" చలపతి రాధని మెచ్చుకున్నాడు. అంతటితో మళ్ళీ ఆ ప్రసక్తి మా మధ్య రాలేదు.

అప్పుడప్పుడు నాన్న ఉత్తరాల్లో వ్రాసేవారు వరంధామయ్యగారు మళ్ళీ మొదటి స్థితికి వచ్చారుట. ప్రతివాళ్ళతో పనిగట్టుకుని చెప్పేవారుట— చలపతి కృతఘ్నుడని, నీతిలేని మనిషని చలపతి కాపోతె అతనితల తన్నిన సమ్మంధం రాధకు తీసుకొస్తానని ప్రతిజ్ఞ కూడా చేశారుట

చివరికి అదే నిజమయింది రాధని ఎక్సైజు ఇన్‌స్పెక్టర్ కిచ్చారుట చలపతికి ఆహ్వానం రాలేదు పోన్లే మా నాన్నగార్ని పెళ్ళికి పిలవలేదు చలపతి అన్నాడు "భగవంతుడు రాధకి మేలు చేశాడు మంచి భర్తని ప్రసాదించాడు రాధ సంసారం పది కాలాలపాటు కళకళలాడాలని ఆశిస్తాను"

ఈమధ్యకాలంలో చెప్పుకోదగ్గ విశేషాలేం జరగలేదు ఫైనలియరు పరీక్షలు వ్రాశాం పాసవుతామనే నమ్మకముంది

మిత్రులందరం కలిసి చిన్న పిక్నిక్‌లాంటిది ఏర్పాటు చేసుకున్నాం ఎక్కడెక్కడినుంచో వచ్చాం ఇన్నాళ్ళూ ఒక్కలా కలిసి మెలిసి చదువుకున్నాం తిరిగాం మళ్ళీ ఎవళ్ళదారి వాళ్ళు అన్వేషించుకోటంలో మునిగి పోతాం ఆ పిక్నిక్‌లో ఎన్నో విషయాలు చర్చించు కొన్నాం ఈనాటి మన స్నేహాలు ఇంతటితోనే కాకుండా కలకాలం నిలిచిపోవాలని అందరం ఆశిం చాం కన్నీళ్ళతో ఒకళ్ళ నొకళ్ళం గుడ్‌బై చెప్పు కున్నాం ఆరోజు అలా జరిగిపోయింది కాని యివ్వాళ చూస్తుంటే వాళ్ళంతా ఏమయ్యారో కూడా తెలియటంలేదు ఇద్దరు ముగ్గురు మిన హాయించి కనీసం ఉత్తరాలు గూడా రావటంలేదు ఏదైనా యింతేగామరి కళ్ళంలేనికాలం అందర్నీ యిలాగే తయారు చేస్తుంది

ఇంటికి చేరాక సామానులని సర్దటంలో మునిగిపోయాను సర్దటమయింతర్వాత తీరుబడిగా కూర్చున్నాను మా భావిజీవితంగురించి ఏవో ఊహాలు నాలో మెదిలాయి బి ఎ పాసయిం తర్వాత నాన్నగార్ని సంప్రదించి ఉద్యోగాన్వేషణో, లేక పై చదువులో చదవాలి

బాగా పొద్దుపోయింతర్వాత చలపతి వచ్చాడు వాడి స్థితి అధ్వాన్నంగావుంది మనిషిలో ఉత్సాహం కాగడాపెట్టి వెతికినా కనుపించదు కారణం తెలియని నేను అయోమయంలో మునిగాను

"ఎక్కడికెళ్ళావురా?"

"రజని దగ్గరికి వెళ్ళాను"

"కనిపించిందా చలపతీ—"

"ఆ!" నీరసంగా అన్నాడు

"పెళ్ళి విషయం మాటాడావా?" ఆత్రంగా అడిగాను

"ఆడది అర్థంకాదురావ్!" వాడి కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి

ఉలిక్కిపడ్డాను

"నన్ను పెళ్ళిచేసుకోటం ఆమె కిష్టంలేదుట" తలదించేసుకున్నాడు

కృంగిపోయాను ఈ విపరీత పరిణామానికి ఆశ్చర్యపోయాను నా నోటిమాట తడబడింది

"అలా అని రజనే అన్నదా చలపతి?"

"అవును అసలు ఆమె పెళ్ళి చేసుకోదుట." చేతుల్లో వాడి ముఖాన్ని దాచుకున్నాడు

"చలపతి!" ఆకాశం, భూమీ రెండూ తల క్రిందులైనట్టు ఫీలయ్యాను

"అవున్రా! ఆమే అన్నది"

నేనేం మాట్లాడలేదు వాణ్ని ఓదార్చటం కూడా నా చేతగాలేదు

* * *

మా స్నేహంలో చలపతి ఎప్పుడూ ముభావంగా వుండేవాడు ఏ విషయమూ తనకి పట్టనట్టు మౌనం వహించేవాడు ఎప్పుడూ ఎడతెగని ఆలోచనలు నేనేదైనా కదిపితే—

"నేను బాధపడటం దేవుని కిష్టమా! లేక నా సహనాన్ని పరీక్షిస్తున్నాడా? కాని రాస్! ఇదే సహనం జీవిత పర్యంతం నిలచిపోదు చివరికి మోడుబారిపోతాను రాక్షసుడ్నవుతాను విచక్షణా జ్ఞానంలేని పశువు నవుతాను. నాకు తెలుసు—"

# అల్పజీవి

ఇలాగు ఏవేవో చెప్పుకుపోయేవాడు శక్తివంచన లేకుండా వాణ్ని ఓదార్చుతూండేవాణ్ని

ఒకరోజు రజని దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది చలపతి చదివి నా కిచ్చాడు ఉత్తరం చదువుతూ జీవితంపట్ల ఆమె నిశితమైన అభిప్రాయాలకి ఆశ్చర్యపోయేను చింతించాను గూడా!

చలపతిగార్కి !

మీ మనసు అనాడు నొప్పించాను తప్పలేదు. ఇప్పుడు మళ్ళీ అందుకే పూనుకుంటున్నా! మన్నిం చండి నా మనసులోని నాలుగు మాటలూ విన్న వించక తప్పదు

---

మొదటి స్నేహితుడు తన రెండవ స్నేహితునితో "ఈ సినీమాతార ఫోటో చూసేవా? ఎంత అందంగా ఉందో. దీన్ని నా ప్రాణంకన్న ఎక్కువగా చూసుకుంటున్నాను" అన్నాడు.

రెండవ స్నేహితుడు' నాకిది యివ్వరా. నిన్నెప్పుడూ తలచుకుంటాను

మొదటి స్నేహితుడు' సారీ! నా ప్రాణమైనా యిస్తానుకాని యిది యివ్వలేనురా బ్రదర్ ...

రెండవ స్నేహితుడు: "పోని. ఆ ప్రాణమే యిచ్చెయ్! అది పోయాక ఆ ఫోటో తీసుకుంటాను." అన్నాడు.

—అవధానుల అన్నాజీరావ్
(విశాఖపట్నం)

---

ఇన్నాళ్ళూ మన మధ్య పరిచయం ప్రేమంటె నే నొప్పుకోను అసలు ప్రేమంటె నాకు గిట్టదు మీరు నన్ను ప్రేమించారు అంటె నాలోని ఆకర్షణ మిమ్మల్నందుకు సముఖుణ్ని చేసింది కాని మీరు ప్రేమించే యీ ఆకర్షణ శాశ్వతంగాదు రాలి పోవచ్చు లేదా మారిపోవచ్చు అనాడు గూడా ఆదే ప్రేమను నాకోసం వెచ్చిస్తారంటే నాకు నమ్మకంలేదు మరో వ్యక్తిలో నాకంటె మిన్నయైన ఆకర్షణ కనుపిస్తే మీ ప్రేమ అటువైపు మొగ్గక మానుతుందా? అందుకనే నాకు ప్రేమంటె గిట్టదు

పెళ్ళంటె పదికాలాలపంట మారని, తరగని అనురాగం దానికి అవసరం అది మీకు నా నుంచి లభించటమంటె నాకు నమ్మకంలేదు అసలు నామీద నాకే నమ్మకంలేదు అలాంటిదాన్ని మీకు మనసిచ్చి జీవిత పర్యంతం మీ పాదదాసిగా వుండటం సంభవంకాదేమో దానివల్ల మన రెండు జీవితాలూ మన్ను చేసుకోటం యిష్టంలేదు నాకు నా ధోరణి వింతయితే ఆ తప్పు నాది మీకూ నాకూ మధ్య ఆత్మీయతవున్న మాట వాస్తవం దానికి మన భావి దాంపత్యానికీ ముడి పెట్టకండి నన్ను అర్థం చేసు కోండి చలపతి నన్ను స్నేహితురాలిగా స్వీకరిస్తే సంతోషిస్తా! సెలవు

రజని

ఆ ఉత్తరం చదివిన నేను రజనిది తప్పంటె నన్ను నేను వంచన చేసుకోటమవుతుంది ప్రేమ మీదవున్న ఆమె అభిప్రాయం మా చలపతిని దగ్గర చేసుకోదు

చలపతే తొందరపడివుంటాడు ఆమెకి తన మీదవున్న అభిమానాన్ని మరో పేరుతో పిలిచాడు ఇన్నాళ్ళ ఆమె ఉద్దేశ్యాలూ, అభిరుచులూ మా చలపతి—యిన్నాళ్ళ సాహచర్యంతో అర్థం చేసుకోకపో టమే ఒక పెద్ద తప్పు అమాయకుడు మా చలపతి

ఎన్నో చెప్పాను ఓదార్చాను అంతా మరచి పొమ్మన్నాను ఎలాగైతేనేం ఏ కొంతైనా వాడు మరచిపోయినందుకు నన్ను నేను అభినందించు కుంటాను

రిజల్ట్సు వచ్చాయి పాసయ్యాం పై చదువులు చదవలేమని నాన్నగారితో చెప్పాం ఆయన సరేనన్నారు నా పెళ్ళి ప్రయత్నాలతోపాటు, చల పతి పెళ్ళి ప్రయత్నాలు గూడా చురుకుగా సాగాయి చలపతి ఆయన మాటకు అడ్డు చెప్పలేదు

ఒక శుభలగ్నాన మా పెళ్ళిళ్ళు జరిగాయి. ఉద్యోగరీత్యా, ఇన్నాళ్ళూ ఒకటిగావున్న మేము— దేశానికి వాడోమూల నేనోమూల అన్నట్టు విసిరి వేయబడ్డాం అమ్మా నాన్న ఆ పల్లెటూరులోనె ఇల్లు, పొలం కనిపెట్టుకుని వున్నారు

* * *

చంటిపిల్లాడు 'కేర్'మని ఏడిచాడు ఉలిక్కి పడి ఆలోచనలోనుంచి తేరుకున్నాను వాణ్నెత్తు కున్నాను వాడి ఏడుపు ఆపించటానికి శత విధాల ప్రయత్నం చేశాను కాని వాడు వున్నకొద్దీ శృతి పెంచుతూన్నాడు చలపతి రాసిన ఉత్తరం ఒక చేతిలో రెపరెపలాడుతూన్నా, అలాగే పిల్లవాణ్ని లాలిస్తూన్నాను అయినా వాడు నామీద జాలి లేకుండా యింకా ఏడుస్తూనే వున్నాడు

"అబ్బబ్బ—వాణ్ని సముదాయించటం గూడా చేత గాదుటండీ!" అంటూ రాజ్యం వంటగదినుంచి బయటకొచ్చింది ఆమె అవతారం బహు ముచ్చ టగావుంది చేతిలో గంట, ముఖంమీద అక్కడక్కడ మసి మచ్చలు, కుచ్చిళ్ళు దోపుకుని, చేతినిండా గాజు లతో, కాటుక కళ్ళతోవచ్చి నన్నూ, నా అసమర్థతని గేలి చేస్తోంది ఆమె యీ అందాన్ని మరో[illegible] డైతే తనివితీరా చూస్తూనే వుండేవాణ్ని [illegible]! చలపతి దగ్గర్నుంచి వచ్చిన ఉత్తరం నా మనసు పాడు చేసింది

ఆమె నా చేతిలో పిల్లాణ్ని ఎత్తుకుని వంట గదివైపు వెళ్ళబోతూ, నా చేతిలోని ఉత్తరంచూసి

అగిపోయింది. అదేమి చిత్రమోగాని పిల్లాడు తల్లి చేతుల్లోకి వెళ్ళంగానే, కెనేడియన్ యింజన్లాంటి వాడి శృతిని టక్కున ఆపేసి—నుదుటిమీదపడ్డ ఆమె జుత్తుతో ఆడుకుంటున్నాడు.

"ఆ ఉత్తరేమిటండీ?"

"చలపతి రాశాడు కుసుమకి మళ్ళీ జబ్బు చేసిందిట"

"పాపం!"

"నిజంగా చలపతి జీవితాన్ని అందరూ తినే కారు రాజీ! వాడికింత సహనం ఎవరు నేర్పారోగాని—నాలాటివాడైతే ఏనాడో ఆత్మహత్య చేసేసుకునే వాడు. ఇప్పటివరకూ చలపతి జీవితంపై చేసిన సమీక్షనన్నీ మాట అనిపించింది

"ఒకసారి వెళ్ళి చూసొద్దామా? ఎన్నాళ్లో అయింది చూచి" రాజ్యం అంది

"నాకూ వెళ్ళాలనేవుంది సెలవు మాత్రం నెలం అడిగితే ఇచ్చేంత సులువుగా లేదు రాజీ"

రాజ్యం వంటగదిలోకి వెళ్ళిపోయింది.

చలపతిగురించి ఆలోచన తిరిగి ప్రారంభమయింది. కుసుమ వాడి భార్య పెళ్ళయింతర్వాత రెండు సంవత్సరాలు ఏం సుఖంగా గడిచిందోగాని, అప్పట్నుంచీ వాడు యమయాతన అనుభవిస్తున్నాడు నేననుకున్నాను చలపతి జీవితంలో కుసుమ ఒక సుఖప్రదమైన ఘట్టమని వాడికిక సుఖం లేదేమో అసలు.

భోజనం ముగించి ఆఫీసు కెళ్ళాను ఆఫీసు పని సాగలేదు మనసంతా గందరగోళమయింది. రాత్రి భోజనం గూడా సహించలేదు రాజ్యం పట్టువల్ల ఏదో రెండు మెతుకులు నమిలాను

తెల్లవారింది కొత్త రోజు ప్రారంభం టపాలొచ్చాయి నాన్న రాసిన ఉత్తరం చదివాను మనవడ్ని చూడాలని వుందిట. మనవడ్ని చూచిం తర్వాత చలపతింట నాలుగు రోజులుండి — తీర్థయాత్రలు చేయాలని సంకల్పించుకున్నారుట.

రెండో ఉత్తరం చలపతి రాసింది చదివాను. మిన్నువిరిగి మీదపడినట్లనిపించింది అనుకోకుండా రెండు కన్నీటిబొట్లు రాలిపడ్డాయి ఇదే చాలు వాడి దైన్య స్థితికి సంతాపసూచకంగా :—

రావ్!

ఈరోజు ఎందుకో కాస్త పెద్ద ఉత్తరం రాయాలనిపించింది దీనికొంత కారణం కుసుమ! కుసుమ విన్నాళ్ళు మరోవిధంగా భావించాను ఆమె కథవిని కుమిలిపోతున్నారు రావ్!

రాధ, రజని, కుసుమ—మావయ్య, అత్తయ్య, రామంబావ, తల్లి దండ్రుల్లాంటి మీ అమ్మా నాన్నా, నువ్వు—వీళ్ళందరిమధ్యా నా జీవితం నడిచింది సానుభూతి చూపినా, యీసడించి కొట్టినా, వంచించినా వీళ్ళందరిలోనె నీకు తెలియందేముంది

చిన్నప్పుడే అమ్మా నాన్నా నాకు అన్యాయం చేశారు మావయ్య చేరదీశాడు ఆయన స్వార్థం నన్ను కొంత కాపోయినా కొంతైనా బలి తీసుకుంది

రాధ నన్ను ప్రేమించిందో లేదో తెలియదు గాని, నామీద ఆమెకి విపరీతమైన జాలి వుందని తెలుసు ధన్యుడ్ని!

రజని అర్థంకాదు. అర్థమయినా, కాపోయినా ఆమెవల్ల దెబ్బతిన్నాను ఆమెకి జీవితంపట్ల విపరీతమైన అభిప్రాయాలున్నాయి. అవి నాకు సరిపడవు. బాధ పడ్డాను

కుసుమ—ఇప్పుడు యీమె గురించే నేను ఎక్కువగా చెప్పదలుచుకుంది నాకు పెళ్ళయింది. నా సుఖాన్ని కాంక్షించి పెళ్ళి చేశారు కుసుమని సంతోషపెట్టాలని గతాన్ని మరచి శాయశక్తులా ప్రయత్నించాను. మిగిలిన యీ జీవితంలో ఆమెతోనైనా సుఖమనుభవించాలని వాంఛించాను అంతా వట్టిదయిపోయింది రావ్! ఇక్కడ మా దాంపత్యం గురించి చెప్తాను.

పెళ్ళయిన దగ్గర్నుంచీ ఆమెలో ఏదో వెలితిని చూస్తూ వచ్చాను. ఆ వెలితికి కారణమేమిటో నాకివ్వాళ్టివరకూ తెలిసిందికాదు తిండికీ, బట్టకీ కొరత లేని అవకాశం మీ కుటుంబం ప్రసాదించింది నాకు. కృతజ్ఞుణ్ణి కాని — ఆమెని సుఖపెట్టలేకపోయాను

---

అప్పుడే ఒక ముంగలి షాపు లోకి పోయి గడ్డము గీయించు కొంటున్నాడొక ఆసామి. కత్తి మని గొంతువద్ద బొటబొట మని రక్తము కారసాగింది. వెంటనే ఆ ఆసామి "ఏమయ్యా ముంగలీ కాసిని నీళ్లుంటే యిస్తావూ" అన్నాడు. అది విన్న "ముంగలి" ఎందుకండీ అన్నాడు. మరి నా గొంతు పంచరయినట్టుంది. ఎక్కడ తూటు పడిందో చూడద్దూ" అన్నాడు. అంతే ముంగలి తెల్లబోయాడు.

కె. ఎస్. పురుషోత్తము (పంచుపాడు)

---

ఆమె ఎప్పుడూ మౌనంగా వుండేది సినిమాకి రమ్మన్నా, కులాసాగా వుండమన్నా—నిర్బంధం మీదనైతే వప్పుకునేదేమోగాని మనపూర్వకంగా వప్పుకునేదికాదు నేనేం చెయ్యాలి? మా దాంపత్యంలోని యీలోటు మీ కింతవరకూ చెప్పలేదు ఇప్పుడు చెప్పక తప్పదు

రవి పుట్టాడు కనీసం వాడ్ని చూచుకునైనా సంతోషం ప్రకటిస్తుందేమోనంటె అదీ లేదు ఒక్కొక్కసారి వాడి ఏడుపు గూడా వినిపించుకోనంత ఏకాగ్రతలో వుంటుంది ఎందు కామెకీ ఎడతెరిపి లేని ఆలోచనలు? ఇది వ్యధా? చెప్పలేను

అప్పుడప్పుడు ఫిట్సు లొచ్చేవి గంటా గంటన్నర దాకా తెలివి వచ్చేదికాదు ఆమె ఆరోగ్యం చెడిపోయింది ఎన్నో మందు లిప్పించాను నా పిచ్చిగాని మనోవ్యాధికి మందేఫైటి? నువ్వు ఆశ్చర్యపోతున్నావ్! ఆమెకేమిటి మనోవ్యాధి ఏమిటి అని నిజం నాలాటి అల్పజీవికి తగిన భార్య కుసుమ. ఇందు కెవర్నీ ప్రయోజనంలేదు. ఇదంతా నా కర్మ! ఏనాడు చేసుకున్నానో ఏమో ఈ జీవితానికి సుఖంలేదు రావ్!

నిన్న కుసుమ పరిస్థితి మరీ దారుణంగా తయారయింది ఫిట్ కలవరింతలు—పిచ్చిమాటలు. రవిని నిద్ర పుచ్చాను నాకు భయంగావున్నా [illegible] పెట్టుకుని ఆమె ప్రక్కన కూర్చున్నాను నా కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. ఆమె కూడా ఏడుస్తుంది.

"మీకు బాధ కలిగిస్తున్నానుకదూ!" అంది.

లేదని చెప్పాను

"కాదు నావల్ల మీకు సుఖంలేదు. పాపిష్ఠిదాన్ని. బలహీనురాల్ని. మీకు ..... మీకు క్షమిస్తానంటె ఒక సంగతి చెప్తాను. క్షమిస్తారుకదూ!" అంది కుసుమ.

"నా దగ్గర యింకా దాపరికమా కుసుమా! తప్పులేదు చెప్పు" అన్నాను.

"నేను ... నేను శర్మని ప్రేమించాను. మనసిచ్చాను అతను అంతే కాని నాన్న వప్పుకోలేదు. కులం పట్టింపయింది పర్యవసానంగా మీదాన్ని అయ్యాను" ఆమె సన్నగా ఏడిచింది ఆమె స్థితికి జాలిపెందక మరేం చెయ్యను చెప్పు

"మన్నించండి—శర్మ యిప్పటికీ గుర్తొస్తూనే వుంటాడు పాపిని — మిమ్మల్ని సుఖపెట్టలేకపోతున్నాను నాకు నరకం తప్పదు" ఆమె ముఖం అవలివైపు తిప్పుకుని ఏడ్చింది.

"కుసుమా!—"

"అవును నిజం. నేను బ్రతకను, మందూ మాకూ వాడకండి. నేను బ్రతక్కూడదు చావాలి. త్వరగా చావాలి మీరు సహృదయులు నేను బ్రతికితే మీకు సుఖంలేదు. తెలుసు రవిని ... పెంచి పెద్ద చెయ్యండి అంతే. నన్ను తప్పిపోనివ్వండి" కుళ్ళి కుళ్ళి ఏడిచింది.

"కుసుమా!" జాలిపడ్డాను. ఈపాపం మేమేనాడు చేసుకున్నాం రావ్! నాకు తెలుసు కుసుమ ఎక్కువ కాలం బ్రతకదు. చివర్రోజుల్లో గూడా ఆమె సుఖపడిందేమీలేదు,

"మీరుగా నన్ను శిక్షించలేదు అయినా నాకు జరిగే శిక్ష నాకు తెలుసు నరకం!

"కుసుమా!" అరిచాను అసలే జీవితంలో ఓడిపోయిన కుసుమకి యింకా యీ శిక్ష ఎందుకు? ఎందుకు చెప్పురావ్? నీ మనసు విప్పుక్కుంది కదూ!

అందరూ నా జీవితంపై పరిశోధనలు చేశారు. నా సహనాన్ని పరీక్షించారు ఈ పరీక్షల ఫలితంగా కొన్నాళ్ళకి నా హృదయం ఖండఖండాలైపోతుంది. వుంటానింక."

నామీద సానుభూతితో యిప్పటికే నీ [illegible] తర్పియుంటుంది. సెలవ

# న్యూఢిల్లీ లేఖ

(7–వ పేజీ తరువాయి)

కాలంలో మురుగు కాలువలు బాగు చేయిస్తుండే వాళ్ళు రోడ్లమీద నిల్చిన నీటిని ఖాళీ చేసేందుకు సఫాయి దళం సిద్ధంగా వుండేది

ఆ సిబ్బంది ఇప్పుడింకా ఎన్నింతలో ఎక్కువైంది ఐతే ఆ సిబ్బంది జీతంతో సెలవులు మాత్రం అనుభవిస్తున్నారు ఒక్క ఢిల్లీలోతప్ప మరే నగరంలో సఫాయివారికి ఆదివారం పూర్తి సెలవు దినంగా వుంటే ఒట్టు క్రిందటిసారి జల ప్రళయం తరవాత వరదల కారణాన్వేషణకు ప్రధానమంత్రి ఒక ఉన్నతాధికార సంఘాన్ని నియమించారు 1947 ఆగస్టు తరవాత మురిక్కాలవల మట్టిని తీసినట్లు కన్పడదని ఆ సంఘం వారు తమ నివేదికలో పేర్కొన్నారు అయితే ఈ నిర్లక్ష్యానికి ఎవర్నీ శిక్షించటం జరగలేదు వరదలకు బాధ్యులెవరో నిరూపించటానికి బదులు ఈ సంఘంవారు వరదలను నిరోధించకుండానే, కోటిన్నర రూపాయల సన్ను విధించవలసిన చర్యలను మాత్రం సిఫార్సు చేశారు నగరంలోకల్లా అతి సుందరమైన గోల్ఫ్‌లింక్స్ ప్రాంతంలో వరద నీరు పోయే నిమిత్తం ఇప్పుడో కాలవ తవ్వుతున్నారు ఇప్పుడీ కాలవ త్రవ్వటాన్నిబట్టి, నివేశనస్థలం అమ్మకం జరిగినప్పుడే పుర నిర్మాణంలో ఒక పద్ధతంటూ లేదని తెలుస్తున్నది వర్షపు నీరు పోయేందుకు రోడ్లకు మురుక్కాలవలకి తూములు లేవని కూడా ఈ సంఘంవారు చెప్పారు రోడ్డు అంచుల్ని వరద నీరు పోయే మార్గాలను కలిపేందుకు గొట్టాలను వేస్తున్నారు ఉదయం పూట కాస్త అలాచేస్తే దళిత జాతికి చెందిన ఈ సఫాయి వారు చెత్త చెదారాన్ని గొట్టాల్లోకి తోస్తూవుండటం కూడా చూడొచ్చు అందువల్ల వర్షాలు వచ్చినప్పుడు నీరు యథా ప్రకారం రోడ్లమీదే నిలిచివుంటుంది దీనివల్ల లాభం పొందిందల్లా రాజకుమారి అమృతకౌర్ పేరు జ్ఞాపకంచేసే హిందూస్థాన్ గృహ నిర్మాణ కర్మాగారం ఒక్కటే ఈ కర్మాగారాన్ని మొదట్లో కోటి 20 లక్షల పెట్టుబడితో ఇళ్ళు నిర్మించాలని ఏర్పాటు చేశారు కాని ఇప్పుడక్కడ సిమెంటు గొట్టాలు మాత్రం తయారవుతున్నై "జయ్ రామ్, సీతా రామ్, జై జై రాం" అంటూ ఈ కోటి రూపాయల పెట్టుబడిని మాఫీచేసినందువల్లనే ఈ కర్మాగారానికి ఇప్పుడు లాభం కన్పడుతోంది

క్రిందటిసారి పెద్ద వర్షం వచ్చినప్పుడు సఫ్దర్‌జంగ్ ఆస్పత్రి దగ్గర మురుగు తూముల్లో బడి ఒక వ్యక్తి, నల్గురు పిల్లలు మునిగిపోయారు బ్రిటీషు వాళ్ళింకా ఇక్కడేవుండి, కాంగ్రెస్‌ఉద్యమకార్లుగానేవుంటే ఒక్కపిల్లవాడుమునిగిపోతే నెహ్రూ ఏమనేవాడో! ఏం చేస్తాం! స్వాతంత్ర్యం వచ్చింది. ఆ తర్వాత ప్రాణాలకు విలువేపోయింది మరి!

* * *

పాశ్చాత్య దేశాలు అందులో ముఖ్యంగా రష్యా అంతరిక్షానికి మానవుణ్ణి పంపుతున్న సమయంలో శిఖ్ఖిస్థాన్ ఉర్ఫ్ — పంజాబీసుబాకోసం మాస్టర్ తారాసింగ్ నిరసనదీక్ష బెదిరింపు చాలా చిత్రంగావుంది. పాకిస్తాన్ ఎలా బ్రిటిష్‌వారి సృష్టో శిఖ్ఖిస్థాన్ కూడా బ్రిటిష్‌వారి వారసత్వమే.

సర్ జోగింద్రసింగ్‌ను మంత్రి మండలికి తీసుకుని లిన్‌లిత్‌గో ప్రభువు శిఖ్ఖిస్థాన్‌కు బీజారోపం చేశారు బ్రిటీషువారు నిర్మించిన మతమనే ఉక్కు చట్రాన్ని ఛేదించేందుకు బదులు కాంగ్రెస్ దానికి మద్దతు చేసింది

గత 40 ఏళ్ళ చరిత్రను పర్యవలోకించటం అవసరం లిన్‌లిత్‌గో కేంద్ర మంత్రివర్గాన్ని విస్తృతం చేసేవరకు భారతమంత్రివర్గంలో ఇద్దరు హిందువులు ఒక ముస్లిం సభ్యులుగా వుంటుండేవారు కాంగ్రెస్‌ను సవాలు చేస్తున్నట్లు లిన్‌లిత్‌గో తన మంత్రివర్గంలోకి హరి జనుడా॥ అంబేద్కర్‌ని, శిఖ్ఖు నాయకుడు సర్ జోగింద్రసింగ్‌ని తీసుకుని మంత్రివర్గాన్ని విస్తృతం చేశాడు 1946 సెప్టెంబర్ 2 వ తేదీన శ్రీ నెహ్రూ ప్రభుత్వాన్ని స్వీకరించినప్పుడు తన మంత్రివర్గంలో ఒక ముస్లిం అసఫాలీని, హరిజన్ జగ్జీవన్‌రామ్‌ని, శిఖ్ఖు బలదేవ్‌సింగుని చేర్చుకున్నారు అంతటితో ఆగారా! శ్రీ నెహ్రూ బలదేవ్‌సింగ్‌కు అతిప్రాముఖ్యంఇచ్చి బ్రిటీష్ ప్రభుత్వంతో రాయబారాల నిమిత్తం ఆయన్ను లండన్‌కు తీసుకుపోయారు ఆ సంప్రదింపుల ఫలితమే వేవెల్ నిష్క్రమణా, పాకిస్తాన్ నిర్మాణమున్నూ 1947 ఆగస్టు 15 వ శ్రీ నెహ్రూ రేడియో ప్రసంగం తర్వాత సర్దార్ బలదేవసింగ్ ప్రసంగం చేశారు జిన్నా ప్రతిపాదించిన ద్విజాతి సిద్ధాంతాన్ని నిరసిస్తూనే శ్రీ బలదేవ్‌సింగ్ శిఖ్ఖులు ప్రత్యేక జాతికి చెందిన వారని చెప్పి శిఖ్ఖులను ప్రత్యేక జాతిగా ముద్ర వేశారు స్వతంత్ర దినోత్సవ సందర్భంలో వెలువడ్డ ఈ మాటలకు వేరే వ్యాఖ్యానం అనవసరం

లార్డ్ లిన్‌లిత్‌గో సృష్టించిన ఉక్కు చట్రం ఈనాటికి యథాతథంగానేవుంది నెహ్రూమంత్రివర్గంలో ముసల్మాన్ హఫీజ్ ఇబ్రహీం, శిఖ్ఖు సర్దార్ స్వరణ్ సింగ్, హరిజన్ జగజీవన్‌రాం, వారివారి ప్రత్యేక జాతులకు ప్రతినిధులుగా వుంటూనేవున్నారు.

లోగడ చెప్పినట్లుగా డా పర్‌మర్, వారి అత్రితులు లేకపోతే హిమాచలప్రదేశ్ పంజాబ్‌లో అంతర్భాగంగా వుండేది కొంతమంది జాతీయ శిఖ్ఖులమనేవాళ్ళు కొంతమంది హిమాచలప్రదేశ్ పంజాబ్‌లో చేరకుండా వుండేందుకు తమ పలుకుబడంతా వినియోగించారు చెప్పాలు విడిగావుంచితే ఉత్తమంగా వుండేది అది శిఖ్ఖిస్థాన్‌గా వుండేది. కూడా ఒక రకంగా చెప్పాలు పంజాబ్‌లో కలిపిన తరవాత డా పర్‌మార్‌కోసం హిమాచలప్రదేశ్‌ను ప్రత్యేకరాజ్యంగా వుంచటంలో అర్థంలేదు. ఇప్పటికైనా పంజాబు హిందువులు గురుముఖిలిపిలో పంజాబీని అధికార భాషగా గుర్తిస్తే మాస్టర్ తారాసింగ్ ఆట కట్టించవచ్చు లేకపోతే ఏమైనా సరే ప్రధాన మంత్రి తాము ఈ విషయంలో లొంగమని మాస్టర్ తారాసింగ్‌కు స్పష్టం చేయాలి గత 11 సంవత్సరాల చరిత్ర తారాసింగ్‌లాంటి వాళ్ళను ప్రజాస్వామ్య పద్ధతులనుంచి పెడదారి పట్టించి మొండి పద్ధతులు అలవాటు చేసింది.

మాస్టర్ తారాసింగ్ ఉపవాసం ప్రారంభించనే ప్రారంభించారు. ఇహ వారి ప్రాణాపాయంగూర్చి డాక్టర్లు ప్రకటిస్తూనేవుంటారు అనుకూలమైన పత్రికా విలేఖర్లు ఆయన ఆరోగ్యంగూర్చి అనుక్షణం ఏవోవార్తలు పంపుతూనే వుంటారు.★

